# పింద రామాయణము

## ఉత్తర రామ చరితము

శ్రీ వేమన

...బ్రహ్మయ్య శాస్త్రి గారు:–

...రచన ప్రసాదగుణభూయిష్ఠమై మృదు శైలిలో నున్నది.

శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు:–

కథ పురాతనమైనను గ్రంథమున కొక క్రొత్తదనము వచ్చినది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు:–

వీరికి గల కవితా ప్రతిభ సామాన్య కవుల కందునదికాదు.

జనమంచి షాద్రి శర్మ గారు:–

సర్వ మమృత మయమే.

శ్రీ విక్రమదేవ వర్మగారు జయపురం మహారాజా:–

రామరాజ్య ఘట్టము రాజుల కర్తవ్య కార్యములను లెస్సగా బోధించుచున్నది.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు:–

శైలి పక్వమై ధారాళ మైనది. పవిత్ర మైనది.

గ్రంథకర్త:

హరి గోవిందాచార్యులు, ఎమ్. ఎల్. సి.

ఏలూరు, లక్ష్మీ అండ్ కో., వారి
లక్ష్మీ ప్రెస్ నందు
ముద్రింపఁబడియె.

1950

వలయువారు :
గ్రంథకర్తకు వ్రాసినఁ బడయఁ గలరు.

# కృతి సమర్పణము

శ్రీ కరుణామయుండ వయి
చేరిన భక్తుల నెల్లఁ బ్రోచు రా
మా! కృపఁ జిత్రభాను మధు
మాస శుభప్రద శుద్ధపక్షమం
దీ కమనీయ సత్కృతి గ్రహింపుము;
పుట్టిన రోజు కానుకగా
నీకు సమర్పణమ్మిది వి
నిర్మల భక్తి పురస్సరమ్ముగన్.

# పండితాభిప్రాయములు

## శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి గారు, బి.ఏ., ఎల్.టి.,

### గవర్నమెంటు ట్రాన్సులేటరు, రిటైర్డు

శ్రీ గోవిందాచార్య విరచిత రామాయణ గ్రంథము చదివి సంతసించితిని. గ్రంథము భావోదాత్తతయు, రసపుష్టియు గల్గి మృదుపద ఘటితమును సర్వపాఠక లోక సుగమమునునై విలసిల్లుచున్నది. కథావిధానము మనోహరముగ నున్నది. గంథమునం దెల్లెడల భక్తిరసము వెల్లి విరియుచున్నది. ఇట్టి గ్రంథము పాఠక లోకమునకు ఆనంద సంధాయకమును, పరమార్థ బోధకమును, మహోపకారకమునునై యుండగలదు.

చెన్నాప్రగడ భానుమూర్తి

---

## కళాప్రపూర్ణ శ్రీ విక్రమదేవవర్మగారు,

### డి. లిట్. జయపురం మహారాజా

శ్రీమద్దాత్మకూరి గోవిందాచార్య విరచిత గోవింద రామాయణోత్తర రామ చరితము నందలి కొన్ని పద్యములను జదివితిని. అవి సరళములు; సుఖబోధకములు; మఱి నిర్దుష్టములు. పాత్రము నిర్వచనమయి భక్తిని వెల్లడించెడిని. అందుఁగల రామరాజ్యఘట్టము రాజుల కర్తవ్య కార్యములను లెస్సగా బోధించుచున్నది. అది పాఠశాలా పాఠ్యపుస్తకమగుటకుఁ దగియున్నది.

ఇట్లు,

జయపురము, శ్రీ విక్రమదేవవర్మ.

---

## సాహిత్య విశారద శ్రీకాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

### ఆంధ్ర సాహిత్య పరిషత్తు కార్యనిర్వాహక సభాధ్యక్షులు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి ప్రపత్తితో వ్రాయు విజ్ఞప్తి:

ఆచార్యవర్యా!

తా మాదరముతోఁ బంపిన శ్రీ గోవిందోత్తరరామ చరితము నందికొని సాంతముగఁ బఠించి యమితానందము నందితి. ఈ గ్రంథరాజమును వ్రాయునపుడు మీరు లేఖినిని దేనె గిన్నెలో ముంచి వ్రాసితిరో లేక యమృతకలశమున ముంచి లిఖించితిరో గాని, ప్రతి పద్యమును సుమ దళ మృదుల పద సంపన్నమై యనాయాసాస్వాద్యార్థ మాధురీ భరితమై మోహనశైలిని చదువరుల సంతోష తరంగముల నోల లాడింపఁ దగియున్నది. మున్ను శ్రీ రామ చరితమును కృతిరూపమున మనోహరముగా గానము చేసిన త్యాగరాజ కవీంద్రుఁడు మీ కాదర్శప్రాయుఁడై యుండ నోపు. ఈ కాలమున నిర్దుష్టమగు నాంధ్రభాషలో నిట్టి ముద్దు ముద్దులతోఁ గబ్బముల వ్రాయు ధీశాలురు చాల నరుదుగ నున్నవారు.

ఘనాశయా, ఇది త్రికరణ శుద్ధితో వ్రాసిన భావముగాని యిచ్చకపు ముచ్చట కాదని విన్నవించుచున్నాను.

కాకినాడ. 24-2-42 } బుధవిధేయుఁడు. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి

## పింగళి లక్ష్మీకాంతంగారు.
## ఎమ్. ఏ.

సంస్కృతాంధ్ర ప్రధానాధ్యాపకులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్

(Head of the Telugu department, Andhra University)

గోవింద రామాయణ మను పేర శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు రచించిన ఉత్తర రామాయణమును, అచ్చు కాకపూర్వమే నేను సాంతముగ చదివితిని. ఆ యితివృత్తమునకు ప్రాణ పదమైన రాముని రాజభావమును చిరకాల మననముచే గ్రంథకర్త సాక్షాత్కరింపజేసికొని దానిని లోక తంత్రమునకు ఆదర్శముగ ప్రస్ఫుటము చేయుటకే యీ రచన నుపక్రమించినట్లు నాకు పొడగట్టినది. ఆ యత్నమున ఈయన నిస్సందేహముగా కృతార్థుడయ్యెను. అందుచేతనే ఇది పురాతనమైనను గ్రంథమున కొక క్రొత్త దనము వచ్చినది. శైలియు ప్రయత్న పూర్వకము గాక మిక్కిలి సహజముగ నుండుటచే సుబోధమై సర్వగ్రాహ్యముగా నున్నది.

విశాఖపట్టణం పింగళి లక్ష్మీకాంతం.

## కళాప్రపూర్ణ, శతావధాని
## శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

ఆచార్య కవివరా!

మీరు రచించి, నా కడ కంపిన గోవింద రామాయణము అనెడి ఉత్తర రామ చరితమును నేను కొన్ని భాగములు చదివి చూచితిని. యతి ప్రాసలకని కొన్ని వ్యర్థపదములు చేర్పక ధారాళమైన నిర్దుష్టమైన పదముల కూర్పుతో సుబోధమగు శైలితో నున్న మీ రచన కానందింపని సహృదయు లుండరని నా దృఢాభిప్రాయము. విద్యాశాఖవారు తప్పక మీ పుస్తకమును విద్యార్థులకు పాఠ్య గ్రంథముగా నియమించి మిమ్మును గౌరవింతురనియు విశ్వసించుచున్నాడను. మీ రీ మహామహుని చరిత్రమును రచియించి సహృదయుల నానందింపజేసితిరో ఆ శ్రీరామచంద్ర మూర్తి మీకు నితోధికమైన గ్రంథరచనా సామర్థ్యమును ప్రసాదించుచు దీనితో పాటు నిరామయ ఆయురారోగ్య భాగ్యాది శ్రేయస్సుల ననుగ్రహించుగాక యని ఆశీర్వదించుచున్నాడను.

కడియము. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
31-1-41. శతావధాని.

## కవిత్రయమిత్ర
## గొ. రమాకాంతాచార్యులుగారు

తహశీలుదారు రిటైర్డు, బాపట్ల

తమ కావ్యము నామూలాగ్రముగఁ జదివితిని. వ్రాతప్రతిగూడఁ జదువు భాగ్యము తొలుత లభించెనుగదా ? మీ కావ్యము చాల రసవంతముగా నున్నదనియే నా నిజమైన యభిప్రాయము.

ఉ. గద్యములోన వ్రాసితివి —
గాంధిమహాత్మ్య చరిత్ర; హైందవ
ప్రాద్యదఖండ రాజ్యమహి —
మోన్నతితద్విధ వేతిహాసమున్
హృద్యములైన నీ కృతులఁ —
బ్రీతిని నల్లిన నీకు లెక్కయే ?
పద్యప్రబంధముల్ నుడువ —
బంధుర శైలిని మిత్రరత్నమా!

చ. పలుకులఁ దేనెలొల్కఁ, రస -
భావతరంగితమైన శైలి నా
ర్యుల హృది పల్లవింప నిపు—
డుత్తరరామచరిత్ర వ్రాసి ని
స్తుల కవితా ప్రపంచమున —
సుస్థిర కీర్తి గడించినావు, శ్రీ
విలసిత రామనామము జ —
పించి తరించెడి భాగ్య మబ్బఁగన్.

మ. ధరణిం బుట్టువు నొందినందునకు స్వా
ర్థత్యాగముం జేయుటే
యరు, దందున్ గవితావధూమణివిలా—
సాపాంగవీక్షా పరం
పరకుం బాత్రతఁగాంచు టెంతయునల-
భ్యం, బన్నిటన్ ధన్యమై

## శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

ఆంధ్ర విశ్వ విద్యాలయ సంస్కృతాంధ్ర భాషాధ్యాపకులు రిటైర్డు
ఉపాధ్యాయ పండిత పరిషత్సభాధ్యక్షులు

శ్రీయుతు లాత్మకూరి గోవిందాచార్యులుగారు రచియించిన గోవింద రామాయణమను నామాంతరముగల ఉత్తరరామ చరితము సాదరముగఁ జదివితిని. ఆచార్యులుగారు వివిధ విషయకములైన గ్రంథములు నిర్మించిన లబ్ధ ప్రతిష్ఠులు. వారి పద్య కవిత్వమున కిది యాద్యమైనను సరసశైలీ నిబద్ధము. ఆద్యంత మీకృతి చదువనింపుపుట్టించుచు మృదుమధుర పాకమున విరాజిల్లుచున్నది. ఆచార్యులుగారు పట్టిన పని తుద ముట్టువరకును విడువని కార్య శూరులు. ఆ కార్య శూరత్వ మీకృతిలోఁ గూడఁ బ్రతిఫలించినది. ఈ కృతి విద్వదాదరము గాంచి చిరస్థాయి యగుఁగాక.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
ధవిళేశ్వరము.

---

జొఁటలేకొప్పెను నీదు జీవితము శ్రీ -
గోవింద ధీరాగ్రణీ !

ఇట్లు,

బాపట్ల. భవచ్ఛ్రేయోభిలాషి,
గొట్టుముక్కల రమాకాంతాచార్యులు.

## శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, ఎమ్. ఏ., ఆనర్సు.

సంస్కృతాంధ్ర ప్రధానాధ్యాపకులు
ఏ. వి. ఎన్. కళాశాల

సుప్రసిద్ధ రచయితలును, దేశభక్తాగ్రగణ్యులునగు శ్రీ ఆత్మకూరు గోవిందాచార్యుల వారిచే రచింపఁబడిన గోవింద రామాయణము నందలి యుత్తరభాగమును నేను శాంతముగా సవిమర్శముగాఁ బఠించితిని. ఆంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధములైన యుత్తర రామాయణము లింతకు ముందే రెండు కలవు. కాని యవి యాయాకాలము లందలి యభిరుచులకుఁ దగినట్లు కావ్యాపేక్షచే రచింపఁబడినవి. శ్రీ ఆచార్యుల వా రనావశ్యకమైన శృంగారరసమును, ఉత్తర రామాయణకథతో నంతగా సంబంధములేని రావణాదుల జన్మ వృత్తాంతాదికమును విడిచి యీ రామాయణమును గళాశీలముల నుచితతరముగాఁ బోషించు దృష్టితో స్వతంత్రమార్గమున వెలయించిరి. రాముని యొక్కయుఁ దదనుజుల యొక్కయు జానకియొక్కయు భావము లిందు చక్కఁగా వ్యక్తము చేయఁబడినవి. రాముని రాజ ధర్మపరత్వ మిందు ప్రశంసనీయముగా నిర్వహింపఁ బడినది. భాష శబ్దాడంబరములేక సరళమై, లలితమయ్యును, భావనిర్భరమై, వ్యాకరణ యుక్తమయ్యును ధారాశుద్ధి సమృద్ధమై, యలరారుచున్నది.

విశాఖపట్టణము. దివాకర్ల వేంకటావధాని.

## శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ.

ఆంధ్ర భాషాశాఖకు ప్రధానులు
మద్రాసు విశ్వవిద్యాలయము

(Head of the Telugu department, Madras University)

అయ్యా !

తమరు దయతో పంపిన గోవింద రామాయణ మను ఉత్తరరామ చరితమును చదివి చాల ఆనందమును పొందినాను. రామాయణకథ నెంద రెన్ని విధముల రచింపగూడదన్నట్లు, కథ ప్రాతదే యైనను, మీ రచనలో కాలానుగుణ్యమగు నవ్యత లేకపోలేదు. ఉండకను తప్పదు. కవి స్వీయానుభవమును నాదర్శమున లోక వృత్తమును ప్రతిబింబింప జేయు ననుటకు మీ గ్రంథమొక నిదర్శన మన వచ్చును. కథ యేదైనా కవి తన యనుభవమును, వ్యక్తిత్వమును అందు చూపక మానడు. మీ యాశ్వాసాద్యంత పద్యముల వైఖరి ప్రాతపోకడలను వదలి, నూతనానుభవమునకు సూచనయైయున్నది. ధారాళమైన శైలిలో కథాగమనమునందలి దృష్టితో చక్కగ రచింపబడిన ఈ యుత్తర రామచరితము ఆంధ్రులాదరముతో పఠింతురని తలంచుచున్నాను.

మదరాసు, 28-1-42. } చిత్తగింపుడు,
కోరాడ రామకృష్ణయ్య

## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు, మహారాజావారి కాలేజి తెలుఁగు పండితులు—మైసూరు

ఆర్య ! నమస్కారములు.

తాము దయతో పంపిన ఉత్తర రామాయణమును పూర్తిగ చదివితిని. ఈ కాలమం దిట్టి ప్రాఁత వడిన విషయములను కావ్య వస్తువుగాఁ గొను ధైర్యము తమవంటి యే కొందఱికో కలదు. తమ శైలి పక్వమై ధారాళమైనది. పవిత్రమైనది. ఆశ్వాసాద్యంత పద్యములను కేవల శుష్కసాంప్రదాయములుగా గాక సజీవముగాఁ జేసితిరి. కేవల వస్తుపాత్రముల మీఁదనే అవధానముంచి, అనపేక్షిత విస్తరణ కావ్యమునకుఁ జొరక కావ్యాకారమును దిద్దితిరి. పాండిత్యాభిమానములకు తావీక శయ్యాను గ్రహముగా సుందరముగా వెలయించితిరి.

మైసూరు — భవదీయుఁడు,
28-2-42 — రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

---

## ప్రొఫెసరు రాయప్రోలు సుబ్బారావుగారు, ఉస్మానియా యూనివర్సిటీ ఆంధ్రసాహిత్య పరిషత్తు అధ్యక్షులు

శ్రీ గోవిందాచార్యులకు నమస్కృతులు—

తాము ఆదరముతో వ్రాసిన జాబుతో గోవిందోత్తర రామచరితమును అంది నది. చదివి ఆనందించితిని. అంతర్లీనంగా

శివాయగురవేనమః

## శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారు

## ఆంధ్రవిశ్వవిద్యాలయ పండితులు

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు రచియించిన గోవింద రామాయణము నందలి పెక్కు భాగములు చదివి చూచితిని. శ్రీరామ చరితమునకుఁ గల యాహ్లాదకతయు నాకర్షకతయు నిరుపమానములు. ఆ చరితము పలువురు పెక్కుభంగుల రచియించి యున్నను నయ్యది యింకను మనదేశమున సార్వజనీనమగు వ్యాప్తి నందవలయునను నుత్సాహముతో మిగుల సుబోధమగు రీతి నాశ్రయించి వీరీ గ్రంథమును రచియించి శ్రీరామచంద్రుని ప్రజానురంజన తత్పరతను సీతామహాదేవి పవిత్రతను దేశీయు లెల్లర హృదయము లందు సాక్షాత్కరింపఁజేయుటకు మిక్కిలి ప్రశంసాపాత్రము.

దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

---

ఉండే భక్తి అంతఃకరణాన్ని మధురం చేయక మానదు. అది వాచా అనురణించి నప్పుడు ఏతత్ప్రచనాతరంగిణికూడ శ్రవణ మస్పృణం కావడం నిసర్గం.

రాయప్రోలు సుబ్బారావు,
హైదరాబాదు.

# శ్రీ విస్సా అప్పారావుగారు, ఎమ్. ఏ.

## ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపలు (రిటైర్డు)

నా మిత్రులగు శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులవారు రచించిన గోవింద రామాయణము (ఉత్తరరామచరితము) అను పద్యకావ్యమును జదువు భాగ్యము నాకు కలిగినది. కావ్యము చేత బట్టి చదువ నారంభించినది మొదలు యింకను జదువవలెనను యభిలాష హెచ్చుగుచునే వచ్చినది. శైలి హృదయాకర్షముగను, మృదువుగను, ఆనందదాయకముగానుండెను. కవిత్వము ప్రవాహజలము వలె నిర్మలముగాను, మధురముగాను తోచెను.

ఈ యుత్తర రామచరిత్రను వ్రాయుటలో యాదికవియగు వాల్మీకి వ్రాసిన పద్ధతినే ఈ కవి యనుసరించెను. విషాదాంతముగనే ముగించెనుగాని, మహాకవియగు భవభూతియొక్క మార్గమును ద్రొక్కలేదు. ఆదికావ్యము ననుసరించుటయే సమంజసమని నా యభిప్రాయము. ఏమన రామాయణము క్రౌంచ మిధునము యొక్క వియోగబాధతో ప్రారంభమైనది. ఈ వియోగ దుఃఖమే రామాయణ కథలోని సారమైన పట్టు. దాని ననుసరించియే యన్ని రసములకు మూలమగు కరుణరసము రామాయణమందు పరివ్యాప్తమై యున్నది. కరుణరస ప్రధానమగు కథా సందర్భ మెట్టివారి హృదయమైనను గరిగింపక పోదుగదా! దయార్ద్రహృదయమే కదా మానవత్వముయొక్క ముఖ్య లక్షణము. విశేషించి లోకమాతయగు సీతయొక్క దుఃఖమును వ్యక్తపరచు ఘట్టములను జదువునపుడు తీవ్రమైన హృదయావేదన యెట్టివారికేని గలుగక తీరదు. అట్టి భావోద్రేక మెట్టి మానవునైన సున్నితుని జేసితీర గలదు. ఇట్టిమార్పును కలిగించుటయేకదా కావ్యముయొక్క ముఖ్యోద్దేశము?

పూర్వభాగమందువలెనే ఉత్తరభాగమందుకూడ మహాకవియగు వాల్మీకి సీతావియోగమును కల్పించినాడు. ఆరంభ శ్లోకమందు సూచించిన క్రౌంచ మిధున వియోగ బాధయే యాది కవియొక్క యాదర్శ దృశ్యమగుటచేత యాదృశ్యమునే పూర్వోత్తరభాగములందు చిత్రించి పోషించినాడు. సంపూర్ణమగు కరుణ రసమును కావ్యమందెల్లెడలను ప్రధానముగా స్ఫురింపజేసి తాను ధన్యుడై మానవకోటి నంతటిని ధన్యులజేసినాడు. అందుచేతనే క్రౌంచ మిధున వియోగ దుఃఖముతో ప్రారంభించి, సీతారాముల వియోగ దుఃఖముతో కావ్యమును ముగించి కావ్యకళను పెంపొందించినాడు. కనుక వాల్మీకి పద్ధతియే కావ్యలక్షణము నెక్కువగా పోషించునట్టి యుత్తమ పద్ధతి. అట్టి పద్ధతి నవలంబించుటయే యౌచిత్యమున్ను, సమంజసమున్ను.

ఈ గోవింద రామాయణ మాంధ్రుల యాదరమును శీఘ్రకాలములోనే పొంది వారినందరిని యానందరస మయుల జేయ గలదని నా నమ్మకము. గ్రంథవిస్తార మేమియును లేక ద్రాక్షా పాకములో వ్రాయబడుటచేత విద్యార్థులకిది యత్యంత పఠనీయమై యుపయోగపడునని తలంచుచున్నాను.

—విస్సా అప్పారావు.

## మహోపాధ్యాయ
## శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు

**విజయనగర మహారాజ సంస్కృత ఆంగ్లేయ కళాశాలా సంస్కృ[త]**
**ఆంధ్రాంగ్లేయ భాషాధ్యాపకులు, (రిటైర్డు)**

బహువిధ గద్య పద్య కావ్యకర్తలు గోపీనాథ రామాయణము ఆముక్త
మాల్యద మొదలగు కావ్యములకు పీఠికాకర్తలు.

శ్రీరామాయనమః

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు దయతో బంపిన శ్రీ రామో[త్త]ర చరిత్రమను నయిదాశ్వాసముల [ప్ర]బంధమును నామూలాగ్రముగఁ జదివితిని.

ఈ గ్రంథ మంతయు, నారభటీ, [కై]శికి, సాత్త్వతి, భారతి యను నాలుగు [వృ]త్తులతోడను, వైదర్భి, గౌడి, పాంచాలి మొదలగు రీతుల తోడను ప్రచురమై, [ధా]రాశుద్ధి గలిగి, చదువువారి మనస్సుల[కు]ను, వినువారి చెవులకును మధుస్యందియై యున్నది. నాకనేకు లాంధ్రప్రబంధ[ము]లను రచియించి, యభిప్రాయము [ని]మ్మని, పీఠికలను వ్రాయుమని కోరి యున్నారు. వారి వారి కవనములను [చూ]చియున్న నాకు అవి దీనివలె యింపు [రు]చించలేదు. పూర్వ సంస్కృతకవులు [ఆ]ంధ్ర కవులు రామ పూర్వచరిత్రమునే వ్రాసియున్నారుగాని, ఉత్తర చరిత్రము వ్రాసినవారు విరళముగానున్నారు. సంస్కృ[త] కవులలో భవభూతి "ఉత్తర రామ[చ]రిత్రము"ను, తెలుగు కవులలో తిక్కన [సో]మయాజి "నిర్వచనోత్తర రామాయ[ణ]ము"ను, కంకంటి పాపరాజు "ఉత్తర రామ చరిత్రము"ను వ్రాసిరి. కాళిదాసు రఘువంశము, భోజరాజు రామాయణ చంపు, శంభుదాసు - లంకాహరణము, భవభూతి - మహావీర చరితము, జయదేవుడు - ప్రసన్న రాఘవము, మురారి భట్టు - మహావీరచరితము, పట్టాభిరామ కవి - జానకీ పరిణయము, రాజశేఖరుని బాలరామాయణము మొదలగునవన్నియు పూర్వచరిత్రమును ప్రతిపాదించు నాటకములు. ఆంధ్రభాషలో గూడ, హుళక్కి భాస్కరుని రామాయణము, రంగనాథుని రామాయణము, గోపీనాథ వేంకటకవి రామాయణము, అయ్యలరాజు రామభద్రకవి "రామాభ్యుదయము" మొదలగు పూర్వకథను ప్రతిపాదించు రామాయణములు గలవు. (ఆధునికులలో శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు, శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారును, రామాయణమును రచించిరి.) పూర్వులందరును వ్రాసిన రామాయణమే గదా యనిన, సకలసద్గుణ సంపూర్ణుడైన లోకోత్తర నాయకుడు కవులకు లక్షించుటెట్లు ? వీరి సరస్వతి తరించుట యెట్లు?

## మహా మహోపాధ్యాయ - కళాప్రపూర్ణ
## శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారు
### మహారాజా సంస్కృత కళాశాల ప్రధాన పండితులు (రిటైర్డు)

శ్రీ భారతీ తీర్థోపాధ్యాయ ఆత్మకూరి గోవిందాచార్య విరచితంబగు గోవింద రామాయణంబను మహాకావ్యమున నుత్తరరామ చరితమును నేను బూర్తిగాఁ జదివితిని. ఇందలి రచన ప్రసాద గుణ భూయిష్టమయి మృదు శైలిలో నున్నది. భవభూతి యుత్తర రామ చరితము నాటకముగ నుండుటచేఁ గథలోఁ గొంతమార్పు కలిగినందున నుత్తరకాండ మందలి కథాసందర్భమును సరిగా గమనించుట కవకాశమును గన్పింపనేరదు. ఉత్తర కాండలోని కథాసందర్భ మంతయుఁ గావ్యానుగుణముగ నిందు సంగ్రహింపఁబడి యున్నది. ఈ గ్రంథమువలన సంస్కృత భాషా జ్ఞానము లేకున్నను, నాంధ్రభాషలో సామాన్య జ్ఞానము కలవారందరికిని ఉత్తర రామాయణములోని కథా సందర్భము సాకల్యముగఁ దెలియఁగలదు. ఈ కవిత రసప్రధాన మగుటచేఁ బాఠకుల కానందదాయకమయి యుత్తర రామాయణమందలి ధర్మమును నీతిని నుపదేశింపఁ గలదని నా నమ్మకము. ఇట్టి గ్రంథమ్ము నాంధ్రలోకమున కర్పించిన యీ గ్రంథకర్త యాంధ్రలోక కృతజ్ఞతా పాత్రమని వేరుగఁ జెప్ప నక్కరలేదు. వీరిట్టి గ్రంథములను హెచ్చుగ రచించి యాంధ్రలోకోపకారులగు నటుల భగవంతు డనుగ్రహించుగాక.

తాతా సుబ్బరాయశాస్త్రి
విజయనగరం

---

(౧౧ వ పేజీ రెండవ కాలం తరువాయి)

ఈ "గోవిందోత్తర రామాయణము" ప్రథమాశ్వాసమునందు సాకేతపురి వర్ణనము చక్కని శైలిలో వ్రాయబడినది. పూర్వకాలమందు రాజ్యమేలిన రాజుల కందరకు రామరాజ్య మెట్లాదర్శకమై యున్నదియు వివరింపబడినది. రెండవ యాశ్వాసములో సీతావియోగ వర్ణనము "అపిగ్రావారో దిత్యపి దళతి వజ్రస్య హృదయం" అనినట్లు, చదువరులకు కంటతడి పుట్టింపక మానదని నా నిశ్చయము. లక్ష్మణుడు సీతను రామాజ్ఞచే వాల్మీక్యాశ్రమమునకు గొనిపోయి, యచట దిగ పెట్టుట మఱింత కరుణ రసావహమైయున్నది. కుశల వోత్పత్తి, సీతావియోగము, మొదలగు కథలు వాల్మీక్యుత్తర రామాయణమునందువలెనే వ్రాయబడినవి. కవిగారు శ్రీ వైష్ణవులయ్యును, కనక దుర్గాంబను ప్రశంసించుట వీరి దేవతాసమత్వ బుద్ధినిఁ దెలుపుచున్నది.

ఈ కావ్యమునం దెల్ల యెడల ఆచార్యులవారి కవనము నిర్దుష్టము గా నుండుటయేగాక ఓజః కాంతి గుణోపేతమై చదువువారి హృదయంబుల నాకర్షించుచున్నది. ఈ కాలమందిట్లు కవనము జెప్పువార లరుదు.

మహోపాధ్యాయ
మేడేపల్లి వేంకటరమణాచార్యుఁడు

# కావ్య స్మృతి తీర్థ—కళా ప్రపూర్ణ
# శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారు

## బ్రహ్మాండపురాణము, శ్రీమద్రామాయణము, ఇత్యాదిమహాగ్రంథకర్త

కాలము దుర్విభావ్యము. భగవత్స్వరూప మదియేయని పెద్ద లందురు. దాని శక్తి యపరిమేయ మనుట సిద్ధాంతము. దాని త్రిప్పులకు లోఁబడమనువారు దేవానాంప్రియులు (మూర్ఖులు). అదియె కర్మమనఁబడు ననువాద మప్రతిహతము. అది యఖండము. లోక వ్యవహారార్థము ఆ యఖండమును ఖండములుగా భావించుట సార్వజనీనము. అట్టికాలము నారాధించుటయే భగవంతు నారాధించుట. కాలారాధన మనఁగా:

ఆదానస్య ప్రదానస్య కర్తవ్యస్యచ కర్మణః క్షిప్రమక్రియమాణస్య కాలఃపిబతి సంపదః అన్నయట్టిది. కర్తవ్యమును దటి తప్పక నిర్వహించుటయే కాలోపాసన యని తాత్పర్యము. ఎంద తేమన్నను ప్రపంచమున నత్యధికసంఖ్యాకు లాపరాత్పరు నారాధించుచున్నారనుట నిస్సందేహము. కర్మానుసారము పరాత్పరు నారాధించు మార్గ మలవడును. భక్తి సాంద్రమగుచో, నారాధన విశేషము లన్నియు సమాన ఫలప్రదములే యనుట నిర్వివాదము.

ఇది కలికాలము. ఇక్కాలమున స్వార్థైక పరత్వమే ప్రధానము. భక్తిలత నిలువను, వృద్ధిపొందను, దెసల వ్యాపింపను దావులేదు. ఇట్టి పట్టున ప్రస్తావింపఁదగిన పేరొండుకలదు. దానిం దెలుపుటకే యీ సంరంభము.

శ్రీమాన్ ఆత్మకూరు గోవిందాచార్యులుగారు కొన్ని గ్రంథముల నింతకు మున్నె రచించి, ప్రసిద్ధిఁగాంచి యిపుడు ఉత్తరరామ చరిత్రము లిఖించిరి. వీరి నింతకుం బూర్వమే నెఱుంగను. వినికి మాత్రము కలదు. నన్ను స్వరింతియ. వీరు విచిత్రవైష్ణవులు! ఇంతకుముం దిట్టివారిని నేఁ గని విని యెఱుంగను !

ఇష్టదేవతా ప్రార్థనమందుఁ దొలుదొల్త బాలాంబను వినుతించిరి. సామాన్యదృష్టిం బరిశీలింప నిది వైష్ణవ సంప్రదాయ విరుద్ధముగాఁ దోఁపకమానదు.

'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' అన్నసూక్తి ననుసరించి యోజింప నిందచ్చెరువొసంగునదియెద్దియు లేదు. నిరాకారుఁడగు భగవంతు నాకారవంతునిగా నారాధించునది మహాప్రకృతి. ఆమహాప్రకృతి తద్వ్యతిరిక్తవస్తువు కాదు. భగవదిచ్ఛాశక్తి. వారిరువురకుఁ జంద్రచంద్రికలకు నగ్నిదాహికలకుఁబోలె నభేద ప్రతిపత్తి కలదు. ప్రకృత్యుపాసనయన సగుణ బ్రహ్మారాధన మని తాత్పర్యము. స్త్రీపురుషాది లింగభేదము లాపరమవస్తువునకు లేవు. యోగులు తేజస్స్వరూపునిగా ధ్యానింతురు. ఇతరు లిచ్ఛాకల్పిత రూప నామముల నా భగవంతునే కొలుతురు. ఇన్ని రూపభేదముల నామభేదముల వ్యవహరింపఁగల యద్వితీయవస్తువే పరమాత్మ.

(౧౩ వ పేజీ రెండవ కాలం తరువాయి)

ఆ భగవంతుని బాలగా ధ్యానించినను దృష్టుఁడగుననుట సిద్ధాంతము. శ్రీకృష్ణ పరమాత్మయు గీతయం దీసిద్ధాంతమునే తేటపఱచెను.

ఇట్లు బాలను పాసించి యంతటఁ "కనకదుర్గం గాంచి" పూజించిరి. అవ్వల "అంబకు మ్రొక్కి తచ్ఛుభ పదాశ్రిత కుంకుమరేఖఁ" దాల్చిరి. పిమ్మట "శబ్దశక్తి నుపాసన సలుప గోర్కె పొడమి శ్రీరామకథ వ్రాయఁబూనినారు"

దుర్గను బూజించుట - శ్రీరామకథ వ్రాయఁదలంపు గలుగుట - తేజస్తిమిర న్యాయమున కుదాహరణము కావచ్చు గదాయని కొందరు లఘుమతు లూహింతు రేమో! "శ్రీరామో లలితాంబికా" అను సూక్తికలదు. "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అన్న సూక్తియు "బాల పదాశ్రితుండనై......ఏకమేవాచలన ప్రధానమను నాత్మ రచించితి" యను వీరిభావమునే దృఢ పరచెడిని. మఱియు వీరు రామోపాసకులు. ఉల్లేఖాలంకారమున కుదాహరణముగా శ్రీరామకథ యలరారుచుండ దాని నెవరు వర్ణింపకుందురు? సకల విషయములకు శ్రీరామచరితము స్మృతి వంటిది.

తే॥ "భక్తిరసముఁ బునాదిగాఁ బ్రబలఁజేసి
కరుణరస కావ్యసౌధంబుఁ గట్టువాఁడ
- జానకీ రామలక్ష్మణుల్ దీనియందు
గాపురముఁజేయుచుంద్రు స్వకర్మజిక్కి"

అని కవివర్యులు తమ యుద్దేశ్యమును వెలిబుచ్చి ధన్యులైరి. సెభాసు, సెభాసు అని మెచ్చవచ్చు నీమహాకవి యాశయము. "నిరుపహతి స్థలంబు" అను పద్యమును నిరసించుచు,

ఉ॥ ఊయెల మంచముల్ రమణియున్ విడె
మిచ్చుటయున్, రసజ్ఞుడున్
హాయిగ మందమారుత మనంతముగా
బ్రసరించు సౌధముల్
వ్రాయము నేల? యొక్క గుణరామ
పదద్వయభక్తి గల్గుచో
వ్రాయఁగఁజాలమే సుజన రంజకముల్
రసవత్ప్రబంధముల్,

అని వ్రాసి తమ మనోభావము నీ మహాకవి బయలు పఱచెను. పోతన మహాకవి శేఖరుల కేసౌధముండెను? ఏప్రియ దూతిక కప్పురవిడె మిచ్చెను? భాగవతముంబోలు నుత్తమోత్తమ గ్రంథమును వ్రాసెఁగదా! రాజులవలన ధనంబు లాగుటకుఁ జెప్పినమాటలు గాని భగవత్కథ నిర్మించుటకు నిక్కమైన భక్తి యొక్కటే సాధనము.

ఈ యుత్తమ కావ్యమునం దొలు తటిది విహారాశ్వాసము. రెండవది వియోగాశ్వాసము. మూఁడవది సుతోదయాశ్వాసము. నాల్గవది నిర్గమనాశ్వాసము. అయిదవది పునస్సంయోగాశ్వాసము నను నవి కథాంశములనే తెలుపుచు నలరారుచున్నవి. ఈ పేరులు వరుసగా మనస్సునం దుంచుకొనినఁ గథ కన్నుల యెదుటఁ బొడకట్టు చుండును. "మఱి

(౧౪ వ పేజీ రెండవ కాలం తరువాయి)

యొక్కరు త్రొక్కని ఫక్కి నేఁటికిన్" అని కవిగారనుట కిదియు నొక కారణము గాక తప్పదు.

ఇఁకఁ గవిత్వ విషయమున నాల్గు పంక్తులు వ్రాసెద. గ్రంథకర్త గోవిందాచార్యులుగారు, కథ శ్రీరామచరితము. ఈ రెండిఁటికి సంబంధము కుదురుట సైజము. బాలోపాసకు లగు గ్రంథకర్తకు సుధామయవాక్కు లలవడుట స్వభావము. అందును గవిత్వము నాదియందుఁ గొన్ని మార్గముల నడిపించి కాఁగి చల్లారిన పాలన్నట్లు రాని యుద్వృత్తి నుపశమింపఁ జేసి భక్తిరస మార్గమున నడిపింపఁ బూనిన సుకవిగాన నిందు నెఱసు లేవి యుండును? కవిత్వము గంగా తరంగిణిం బోలి యనర్గళ గతివిశేషమునఁ బ్రవహించెడిని. వెదకి వెదకి చేర్చినట్లుండు పదమెందేఁ గానరాదు. యతిప్రాసముల కై కక్కుఱితి పడనక్కఱలేక కవిత నడచినది. కాన శ్లాఘ్యతమ మనుటకంటె వేరొక్కమాట పలుక వలను పడినది కాదు.

మ. అనుఁగుం దమ్ముఁడు భక్తుఁ డగ్రజుని
    వాక్యార్థంబు నీడేర్చియుం
 గనఁడయ్యెన్ మదిశాంతి లక్ష్మణుఁడు
    లోకంబెట్లు హర్షించునా
 పని రాజాజ్ఞను ధిక్కరించుటయొ
    లోపంబేమియున్ లేని సీ
 తను ఘోరాటవి డించుటో ద్వివిధ
    ముల్ ధర్మచ్యుతంబుల్ గదా!

అన్న పద్యరత్నములే యెల్లతావులం బొడకట్టుచుండ నిది రసవంతము, ఇది ప్పిడి యని యెట్లు వ్రాయనగును? సర్వమమృతమయమే యను నొక్కవాక్కు వ్రాసి మౌనముద్ర ధరింపనెంచితిని. గ్రంథ మంత పెద్దది గాకున్నను నిరుపమాన పద్యరత్న పరిశోభితమగుట నమూల్యమని చెప్పనొప్పును. ఇట్టి యత్యుత్తమ గ్రంథమును రచించి భగవంతుఁడగు శ్రీ రఘురాముని కంకిత మొనర్చి కవివతంసులు "సమానానా ముత్తమశ్లోకోఽస్తు" అన్న సూక్తికిం బాత్రులైరి. ఇట్టి యుత్తమ గ్రంథముఁ బఠించు నదృష్టము గలుగుట నేనును ధన్యుఁడనే. ఇమ్మహాకవి వతంసు లింకనిట్టి యమూల్యగ్రంథముల రచించి పామరులకు భగవద్భక్తిని జేకూర్తురుగాక యని వారిని కోరుచున్నాను. ఈ యుత్తమ తమ కావ్య మాంధ్ర త్రిలింగదేశముల యందు నిచ్చలు వ్యాపించుగాక! పరమేశ్వరుఁడు శ్రీరామ చంద్రమూర్తి వీరికి దీర్ఘాయురారోగ్యములు గల్గించి యనేకోత్తమ గ్రంథరాజముల వ్రాయఁ బురికొల్పుఁగాక.

కడప,
19-2-42.

ఇట్లు విన్నవించు
భక్తపద సేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

## శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారు, ఎమ్. ఏ., ఎల్. టి.,

రిటైర్డు హెడ్ మాష్టరు, గవర్నమెంటు ట్రెయినింగుస్కూలు, విజయనగరం రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము, పింగళి సూరన్న జీవితము ఇత్యాది గ్రంథకర్త.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు మన ఆంధ్రదేశములో ప్రసిద్ధపురుషులు. వీరు భారతదేశ అర్థశాస్త్రమును విపులముగా రచించిరి. (బ్రిటిష్ సామ్రాజ్యమునకు కేంద్రఅర్థశాస్త్ర సభయనదగు రాయల్ సొసైటీలో సభ్యులు ఎఫ్. ఆర్. ఇ. ఎస్.) వీరింకను మరికొన్ని యుద్గ్రంథములను రచించి ప్రకటించినారు. ప్రకృతము వీరు రచించిన "ఉత్తర రామచరిత్రము" అను ఆంధ్ర ప్రబంధమును నేను చదువుటయు, వారు చదువగా పలుమార్లు వినుటయు, భాగ్యము నాకు లభించినది. వీరికి పూర్వము ఉత్తరరామచరిత్రమును ఆంధ్రప్రబంధముగా రచించినవారు మన పూర్వకవులలో నిద్దరుకలరు. ప్రథమమున కవిబ్రహ్మ యగు తిక్కన కవి నిర్వచనముగా నీ కథను ప్రబంధరూపముగా రచించెను. తరువాత కంకంటి పాపరాజు ఈ కథనే ఆంధ్రప్రబంధముగా రచించెను. వారిద్దరి తర్వాత నా సుప్రసిద్ధకథను ప్రబంధరూపముగా రచించినవారు వీరే. తిక్కన కవికృతి యా కవి వరుని మృదుమధుర పదజాలముతో కూర్పబడి బహుసంక్షిప్తముగా నున్నది. ఏ తడవునను కవి రసభావములను పెంచి తన సహజపాటవమును చూపలేదు. కంకంటి పాపరాజు తన కాలమందలి కవులకు పరిపాటిగా నుండిన ప్రౌఢ పదబంధురమైన శైలిని వినియోగించి గ్రంథమును చాలవరకు మహాప్రబంధమునకు నిర్ణీతములైన వర్ణనలను అపారముగా సాగించి పండిత ప్రకాండజుష్టమగునట్లు రచించెను. శ్రీమాన్ గోవిందాచార్యులుగారు ఆకథనే ప్రబంధరూపముగా రచించుటలో దృక్పథము పూర్వకవులకంటె భిన్నముగా మార్చుకొని తన గ్రంథమునకు ప్రత్యేకమైన వ్యక్తిత్వమును విశిష్టత్వము నొసంగ గలిగిరి. వీరి గ్రంథములో ముఖ్యములైనట్టివియును, పై రెండు గ్రంథములలో ప్రాముఖ్యము వహించనట్టివియును విషయములను ఇచ్చట చూపెదను.

1. ఏకపత్నీ వ్రతుడును, భగవదవతార పురుషుడును అగు శ్రీరాముని యొక్కయు, మహాపతివ్రతా శిరోమణియగు సీతాదేవియొక్కయు లోకాతీత దాంపత్యమును వీరు దృక్పథమందుంచుకొని, అచలితమగు ధ్రువనక్షత్రమునుజూచి నావికుడెట్లు సముద్రయానము చేయునో అట్లే వీరును ఈ గ్రంథమును అమూలాగ్రముగా రచించిరి. శ్రీరామభక్తులగు వీరు సీతారాముల యందలి దాంపత్యాద్వైతమందు దృఢమగు భక్త్యావేశమును బొందియుండిరి. ఇదియే వీరి గ్రంథమందలి మొదటి ముఖ్యసూత్రము. దీనికి నిదర్శనముగా వారొసంగిన ఆశ్వాస నామములను జూడవచ్చును. ఆంధ్రగ్రంథములలో నిట్లా విషయమును గురించి మహాదసావేశమున రచించినవారరుదు. ఈ భావసంబంధమైన రసావేశము ఈ గ్రంథమందు ప్రతి పద్యమందును, ప్రతి పదమందును ఉన్నదని చెప్పుట నాకతిశయోక్తియని తోచదు.

2. భారతదేశమందు హిందూమహాయుగముగా స్వర్ణయుగమని యిప్పటికిని అనూచానముగా పేరుపొందియున్న రామరాజ్యమును సకల ప్రజాక్షేమభాగ్యమును వీరు తమ గ్రంథమందు యథాశక్తిగా నిర్వహింప ప్రయత్నించిరి. మొదటి విషయము ఆధ్యాత్మిక పథమందెట్లు వీరికి మూలసూత్రముగనుండి వీరిని జయప్రద ముగా కొనసాగించినదో అట్లే లౌక్యధర్మమున రామరాజ్యవిషయము గూడ వీరి దృక్పథము నావహించి వీరు తమ జీవితకాలమందు అనేక కష్టములకు పాల్పడి సేకరించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక ఆదర్శములను వినియోగించుటకు అవకాశ మిచ్చినది. ఈ రెండు సూత్రములను మనము పూర్తిగా గ్రహించినగాని యీ కవి వరుని కృషిని మనము తగినట్లాదరించుటయు కృతికి తగిన గౌరవమిచ్చుటయు పొసఁగదు. కాబట్టి వీరీ గ్రంథమును ఐహికాధ్యాత్మికములకు ఆదర్శముగా నుండునట్లు వ్రాయ నుద్దేశించిరని చెప్ప సాహసించుచున్నాను. ఆ ప్రయత్నములో వీరు చాలవఱకు సఫలీకృతులైరనియే నా యభిప్రాయము.

3. శైలి విషయములోకూడ వీరు ప్రత్యేక వ్యక్తిత్వము కనుపరచిరి. సహజ ముగ నుభయభాషాపాండిత్యము కల్గియు, నిఘంటువుల నెల్లప్పుడును తమ దరి నుంచుకొనియు వారు పాండిత్యమునుగాని, నిఘంటుజ్ఞానమునుగాని చూపుటకు అరిది శబ్దములనెచ్చటను ఉపయోగింపక సరళమై, స్వాదువైరసపుష్టమైన శైలిని వాడిరి. ఈ విధమగు శైలిని మన ప్రాచీనకవులు మాత్రమే పాటించిరి. తరువాత కవులు ఆశైలిని మార్చివేసి శబ్దాడంబరము కొఱకు పెనగులాడుచు ప్రబంధములను భాషా నిఘంటువులుగా మార్చుటచేతనే ఆంధ్ర ప్రబంధము క్రమక్రమముగా దేశములో అనాదరణముపొంది యుత్సన్నమైనది. నీరివిధముగానే కవులరచన యుండిన యెడల ఆంధ్రప్రబంధము మన వాఙ్మయమందిప్పటికిని అగ్రస్థాన మలంకరించిరో యుండును. వీరు కేవలపాండిత్య ప్రదర్శనము కొఱ కెంత మాత్రమును ప్రయత్నింపక సులభము లైన తియ్యని మాటలతో తమ రసభావములను చెప్పఁగలిగిరి. ఈ గ్రంథ మందెచ్చటను నిరర్థక పదములు గాన్పింపవు. ప్రతిభాగమును వారి ఆదర్శమునకు సమగ్రమగు నిద ర్శనముగానే చేయఁగలిగిరి.

4. వీరు తామురచించిన గ్రంథమును చాలకాలమువఱకు పలుమార్లు సవ రించుచు, దిద్దుచు, తీర్చుచునేయుండిరి. అంతియకాక, తమ మిత్రులగు కవులతోను, పండితులతోను తఱచు తమ గ్రంథమందలి రసభావములనుగూర్చి చర్చించుచుండిరి. ఇట్లే మన పూర్వమహాకవులు తమ యుద్గ్రంథములను ఒరపిడిబెట్టి అహీనకాంతి గల వానిగాజేసి మనకు బ్రసాదించిరి. వీరును ఆవిధముగానే చేసిన కృషి ఫలించుటచే వీరి గ్రంథము స్వాభావిక రసభావశోభితమై, ఔచిత్య పరిపూరితమై, మహాదాదర్శ సంధాయకమై సర్వదా నెగడుచుండునని నాయభిప్రాయము.

———

# ప్రథమ ముద్రణము - మనవి.

ఆంధ్ర మహాజనులకు :

గాంధీ మహాత్ముని సత్యాగ్రహ శంఖారావము - కారాగృహ ప్రవేశము - ప్రాణోపద్రవ రోగము - విడుదల - విశ్రాంతి - సద్గ్రంథ రచనా సమాప్తి - తత్ప్రకటనము - ఇవి యన్నియు నాకు పరిపాటి. ఈ నూతన పద్య కావ్య చరిత్రయు నా సాంప్రదాయమునకు విరుద్ధము కాలేదు. 1941 వ డిశంబరులో సత్యాగ్రహోద్యమమున బందెకుఁ బోవుటకుఁ బూర్వమే యీకావ్యరచన పూర్తియైనది. ప్రకటించుటకై ప్రయత్నించితిని. విఫలుఁడనైతిని. ఖయిదునుండి విడుదలయైన పిమ్మట కూడ వెంటనే ప్రకటింపఁ జాలక పోతిని. ఎడతెగని యనారోగ్యమే యిందులకు కారణము. నేటికీ నవ్యకావ్య మాంధ్రుల కర్పించుకోన గలిగితిని. ఇది యంతయు నా సీతారామచంద్రుని కృప. శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి యాశీర్వచన ఫలితము.

పురుషకారములేని పని యుండదు గదా! విడుదలయైన ఉత్తర క్షణము నుండియు వెనుక దక్షత వహించిన వారు శ్రీతుమ్మలపల్లి వీరభద్రరావు, సత్యనారాయణమూర్తి సోదరులు. ఏలూరు చేరిన నాటనుండియు, నేటివరకు శ్రీయుతులు డాక్టరు వల్లూరి నరసింహారావు గారు, దుగ్గిరాల రాజశేఖరరావుగారు వైద్యసహాయ మొసంగు చుండిరి. హితులలోఁ బరమహితుఁడు బంధువులలో నాప్త బంధువువలెఁ జిరకాలమునుండి నా కండదండయై నిలిచియున్న శ్రీ డాక్టరు బెండపూడి పేరరాజుగా రిచట స్మరణీయులు.

కోరినంత మాత్రమున, శ్రమ యనక వ్రాత ప్రతినంతయు సవి మర్శకముగ బలువురు మిత్రులు చదివిరి. వారి వారి యభిప్రాయముల నాకొసంగి తోడ్పడిరి. ఇందు ముఖ్యులు శ్రీ యుతులు పింగళి లక్ష్మీ కాంతంగారు, గరికిపాటి మల్లావధానులుగారు, కేతుమళ్ళ అచ్యుత రావుగారు, దివాకర్ల వేంకటావధానులుగారు, విశ్వనాథ సత్యనారాయణ గారు, బుద్ధిరాజు వీరభద్రరావుగారు.

వీరందరు చదువుటకుఁ దగియుండు నట్లుగ వ్రాతప్రతిని స్ఫుటముగ వ్రాసిపెట్టినవారు శ్రీ పెద్దింటి రంగాచార్యులుగారు.

జాబు చేతఁ గోరినంతమాత్రమున పండితులు - కవులు విమర్శకులు - నీ కావ్యమును జదివి ప్రసన్నులై వారివారి యభిప్రాయములను బ్రసాదించిరి. ఆధ్యాత్మిక తీవ్రాభినివేశమున విశేషకాలమును వినియోగించుకొనుచు, నాకోర్కెను మన్నించి, సకాలమున నీకావ్యమునకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దయతో తొలి పలుకు వ్రాసిరి. ఎడతెగకుండ, నిత్యకృత్యముగ, కవి సన్మానముల నందుచు, నూపిరాడకున్నను, నెట్లో తీరిక జేసికొని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా రాదరముతోఁ బీఠికను వ్రాసిరి.

నే నిట గడుంగడు ప్రశంసింపదగినవారు మఱి యిరువురుగలరు. శ్రీమద్రామాయణమును బద్యకావ్యముగ వ్రాయ నాకుఁ గలిగిన సంకల్ప మెఱింగించినంత మాత్రమున వ్యాఖ్యానములతోఁగూడిన శ్రీ మద్రామాయణాది గ్రంథముల శ్రీ ఈదర వెంకయ్య పంతులుగారొసంగిరి. మరియు యుద్ధకారణముగ కాగితపు కరవు ప్రబలిన నీకాలమున ముద్రించుటకువలయు కాగితమును సరఫరా చేసి వారి ముద్రణాలయమునందే అచ్చు వేయించినదియు వీరె.

"ధనమూల మిదంజగత్" అను నార్యోక్తి ననుసరించి, యీ కావ్య ముద్రణమునకు శ్రీ ముడుంబ వేంకట రంగ అనహా రాచార్యులుగారు (రాజమండ్రి) మూలకారకులు. ఇందులకువలయు ధనవ్యయము నంతయు వారే భరించిరి.

ఈ కావ్యము నాంధ్ర పాఠక లోకమున కర్పించుటకై పైన వివరించినవిధముగ నాకుఁ దోడ్పడిన పెద్దలకు నమస్కృతులు, పిన్నల కాశీర్వచనములు.

ఏలూరు
20—1—42

ఆత్మకూరి గోవిందాచార్యులు

# ద్వితీయ ముద్రణము - మనవి.

శ్రీసీతా రాముని కృపచే, నీ కావ్యమును సమకాలికులు మెచ్చినారు. పండితుల, పామరుల ఆదరణాభిమానములు లభించినవి. ఆంధ్రవిశ్వ విద్యాలయమువారు ఇంటరుమీడియేటు విద్యార్థులకు 1952 వ సంవత్సర పరీక్షకు (Part II Telugu modern poetry) పాఠ్య గ్రంథముగ (ఇందలి వియోగాశ్వాసము నిర్ణయించిరి. మదరాసు ప్రభుత్వమువారాంధ్ర దేశమందలి స్థానిక పరిపాలనా సంస్థల సర్వవిధములగు గ్రంథాలయములయం దీ కావ్యము నుంచవలెనని స్థానిక పరిపాలనా సంస్థలను హెచ్చరించిరి. ఈవిధముగ నీ కావ్యము ఆంధ్రుల మన్నన నందుటచే నీ ద్వితీయముద్రణ మవసరమైనది. (విద్యార్థులకు వియోగాశ్వాసము ప్రత్యేక పుస్తకముగా నచ్చయినది.)

ఈ గోవింద రామాయణము 'ఉత్తరరామ చరితము' నకు గ్రంథాలయ ప్రవేశము లభించుటచే, నిక పలువుర పాఠకుల కందుబాటుగ నుండును. భక్తిరసము పునాదిగాగల యీ కావ్య పఠనమున భక్తిరసముచే పాఠకుల హృదయములు స్పందించుగాక. ఈ కావ్యరచనమున గ్రంథకర్తకుఁగల మహాదాశయ మిదియే. శ్రీసీతారాముల కృపచే దాన పాఠకులు ధన్యులగుదురుగాక. నేచరితార్థుఁడ నగుదునుగాక. తప్పులు లేకుండగ అచ్చు కాగితములను సరిచూచిన మిత్రులు శ్రీ గరికిపాటి మల్లావధానులుగారి కెంతయుఁ గృతజ్ఞుడను. సకాలమున సక్రమముగా నీ పుస్తకము నచ్చువేసి యిచ్చిన లక్ష్మీప్రెస్ వారికి అభివందనములు.

ఆత్మకూరి గోవిందాచార్యులు.

గ్రంథకర్త.

22-11-50.

COPY OF PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, MADRAS.

Roc. No. 1037 J/50 dated 12-6-1950.

Government of Madras .(Education Department)

MEMORANDUM No. 10859/50 E1. dated 2-6-1950.

Sub; Books and Publications - Telugu 'Govinda Ramayanam, by Sri A. Govindachari - Purchase of.

The Director of Public Instruction is requested to commend to Local Bodies the purchase of copies of the book entitled "Govinda Ramayanam" in Telugu by Sri A. Govindachari M. L. C., Eluru for use in the libraries maintained by them.

RAJAIAH D. PAUL,
Secretary to Government.

Copy Communicated

M. SRINIVASAN,
for Director of Puplic Instruction.

(True copy)/Forwarded/(By order)

Sd. .....................
15-6-50
Superintendent.

To

The District Educational Officers and Inspectresses of Girls Schools (in Andhra Area only).
The Divisional Inspector of Schools (in Andhra Area only)
The Presidents of Dt. Boards (in Andhra area only)
The Commissioners of Municipalities through the Chairman concerned (in Andhra area only)

Copy to 'J' section (2) copies.

(True copy)

ఓమ్

# తొలిపలుకు


శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

ఆంధ్రప్రధానాధ్యాపకులు, శ్రీవెంకటేశ్వర సంస్కృతకళాశాల, తిరుపతి.


శ్రీ సీతారామచంద్రులు భరతవర్షప్రజల కనుకరణీయ శీలురగు పరమపురుషులు. భారతదేశమున సుమంగళు లెల్లరు సీతాశీలమును పాతివ్రత్యాదికము ననుకరింపఁ బ్రయత్నింతురు. పురుషు లెల్లరు శ్రీరామశీలము, నేకపత్నీ వ్రతాదిరూపము ననుకరింపఁ దపింతురు. రామాయణేతివృత్తము భారతీయుల పవిత్రజీవితమునఁ బరిణమించిపోయినది. ప్రజల మంచి చెడుగులలో, కష్ట సుఖములలో, నింక నెన్నెని వ్యవహారములలో రామాయణ కథార్థములు రామాయణ కథాపురుషులు పరిస్ఫురించుచుందురు. సీత లెందఱో, చుప్పనాతు లెందఱో, రాము లెందఱో, రావణు లెందఱో, కౌసల్య లెందఱో, కైక లెందఱో ప్రజలలోఁ బరిగణింపఁ బడుచున్నారు. కారణము లెఱుఁగరాని కష్టానుభవములందుఁ బ్రజలకు శ్రీరామచంద్రమూర్తి జీవితావలంబమును బ్రసాదించుచున్నాఁడు. మానవులై యవతరించిన శ్రీ సీతారాములు తమ కాలముననే, తమ గుణోత్కర్షముచే నీశ్వరాంశావతీర్ణులుగా గుర్తింపఁబడిరి. నాఁటికి, నేఁటికి, నేనాఁటికిఁ గూడ, వారి నామాక్షరములు మహా మహిమతోఁ దారక బ్రహ్మ మంత్రములై యారాధింపఁబడుచునే యుండును.

రామో రామో రామ ఇతి ప్రజానామ భవన్ కథాః।
రామ భూతం జగత్సర్వం రామే రాజ్యం ప్రజా సతి.

అని వాల్మీకి వాకొన్నాఁడు. కవి వరేణ్యుఁడు పోతరాజు, భక్తస్యుఁడు గోపరాజు, గాయకోత్తముఁడు త్యాగరాజు తమ యుచ్ఛ్వాస నిశ్వాసములు రామ నామాక్షర ద్వయమకా జీవించి, యాంధ్రులకముగా రామనామరుచి నాస్వాదింపించిరి. ప్రపంచ మెల్ల రామరాజ్యముకాఁ గోరి తపించుచున్నాఁడు గాంధి మహాత్ముఁడు.

రామాయణమను పేర "మహత్తరమయిన సీతాచారిత్రమునే వాల్మీకి వర్ణించె" నట అది యట్లు కలదు. షట్కాండాత్మకమయిన రామాయణము కంటె నుత్తర రామాయణమున సీతాశీలము మఱియు నుద్దీప్తమై గోచరించును. సప్తమ కాండమునకు 'నుత్తర' పదము సవిశేషార్థము. శ్రీ సీతారాముల బంగారు శీలమున కీకాండ మగ్నిపరీక్ష కాదా? నిజముగాఁ బూర్వరామాయణమున జరిగిన సీతా సాక్షా దగ్ని ప్రవేశ పరీక్షకంటె, నిందలి సీతారాముల యవ్యక్తాంత రంగాగ్ని పరీక్ష మహత్తరమయినది. అందు సీత జ్వాలదగ్నిలోఁ జల్లగా బ్రజ్వలించి ప్రసన్నయయ్యెను. ఇందు సీతారాములు పుటపాక ప్రతీ కాశమైన యవ్యక్తాగ్నిలో నగపడకయే యడఁగారిరి. అబ్బ! ఉత్తర రామ చరిత్రావసానపు దెబ్బను లోకాంతర జన్మాంతర సుఖముల విశ్వ సించు భారతీయులే భరింపఁజాలుదురు. ఎట్లు భరింపఁజాలుటో! అట్టి వారికి నట్టి యవసానమా? సమర్థనముల కేమి! ఊపిరాడకున్నది!!

కావుననే కాఁబోలును! పలువు రుత్తర రామాయణమును ప్రామాణికముగా గ్రహింపరయిరి. రామాయణము షట్కాండియే యనియు, వాల్మీకి గ్రంథసంఖ్య షట్కాండికే సరిపడుచున్నదనియు నుత్తరకావ్యరచన పూర్వకావ్యరచనతోఁ బోలఁ జాలకున్నదనియు, వారు యుక్తుల నుపపాదించిరి. భాషారచనలవారు, ప్రాచీనులే పలువు రుత్తర రామాయణ కథను బరివర్తింపకయే పరిత్యజించిరి. పరమ పురుషులగు సీతారాముల కట్టి కట్టడి యిడుమ పాటుఁ జెప్పుట వారికి దుస్సహముగాఁ దోచియుండును. పలువురు షట్కాండినే ప్రమాణీక రించుట యటుండ, భాస భవభూత్యాది ప్రాచీనకవులును సీతా రాముల శీలముమీఁది యభిమానముచే, వాల్మీకి మహాకవికి వంకలే దిద్దిరి. భాసుని రామాయణ కథానాటకములెల్ల వాల్మీకి రామాయణ కథలోని వంకలు దిద్దుట కేర్పడినవే. రామపట్టాభిషేక యత్నమున కైక లేకితనమును, మాయలేడి కథలో సీత లక్ష్మణుని నెడఁ జెడ నాడికను జక్కదిద్దుటకు భాసుఁడు ప్రతిమానాటకము రచించెను. వాల్మీకి యుత్తర కాండ కథలోని సీతారాముల యవసాన కరుణకమున్న

కాఁగఁజాలక భవభూతి యుత్తర రామచరిత్ర నాటకమును లోకోత్తర రచనలో సీతారామ పునస్సమాగమ శుభాంతముగా రచించెను. తత్కథార్థమున వాల్మీకి గ్రంథమున కంటె భవభూతి గ్రంథమునకే పరమ పూజ్యత కల్గినది. భవభూతి తన నాటకమున "వాల్మీకీ! ఇది (సీతా భూగర్భ ప్రవేశము) యటయ్యా నీ కావ్యపరమార్థము!"

అని లక్ష్మణ పాత్ర ముఖమునఁ దన దుఃఖమునే వెల్లడించుకొన్నాఁడు. ఇవి కవి కల్పనములే; వాస్తవమున సీతారాముల యవసానము వాల్మీకి కథితమే కాఁబోలును. లోకానుభవ మిట్లును గలదు కదా! సద్వర్తను లెందఱో సంకటములతోఁ గ్రుంకుచుండుటయు దుర్వర్తను లెందఱో సర్వ సౌఖ్యములతోఁ దుళ్ళింతలాడు చుండుటయుఁ జూచుచున్నాము గాదా! నేఁడు మన కన్నులెదుర లోకారాధనమునకై సర్వస్వ మర్పించి తన్నులఁ దాఁపులబడి యడగారుచున్నవా రెందఱు లేరు? అంతరించినవా రెందఱు లేరు? సత్పురుషులఁ గీడ్పఱుచుచు సర్వసౌఖ్యము లందుచున్నవా రెందఱు లేరు? ఏవం విధ విధి వైపరీత్య పరిక్లేశానుభవము కూడ ప్రస్తుత గ్రంథకర్త కీయుత్తర రామాయణ కథా రచ నాభిమానమున కొక హేతువు కాఁగూడును!

కవి కల్పితములైన కథార్థములు శృంగార కరుణాది రస పరికరములతోఁ గావ్య ప్రతిపాదనమున నాస్వాద్యము లగుటకంటె నవి లోకమున జరిగిన సత్యార్థములే యైనచో నంతగా నద్భుతానుభావాది రస పరికర పౌష్కల్యము, కవి కవితాకల్పనా చమత్కృతి లేకున్నను సహృదయుల కాస్వాద్యతరములై యానందముఁ గొల్పుచుండును. సత్యమే సౌందర్య సమంచితము. శుభమయము. సత్య వస్తువు నసిగా సమకూర నప్పుడే కవితా ప్రతారణము పనిగొనును. సత్య స్వరూపము, సువ్యక్తము గాక పోఁగా నూహా పరికల్పితమైన, సత్య ప్రతికృతియే కవిత యగుచున్నది. అట్టిదానికి భాషాపరిష్కృతి, యలంకార విడంబము, శయ్యా వైయాత్యము, వస్తు విన్యాస వైచిత్ర్యము, పనిఁ

బూనికొని తేవలసి యుండును. కూట సాక్ష్యము చెప్పువాఁడు కథ కట్టుకొని పూర్వాపర సందర్భముల నెన్నింటినో పూనికతోఁ బోసఁ గించు కొనవలసినవాఁ డగును. ఎంత పోసఁగించు కొన్నను తుదకు వాఁ డదను దటిసినపు డవక తవకలకుఁ బాల్పడు చుండును. సత్యము వ్రాయుచ్చువాఁడు తొట్రుపడక యున్న దున్నట్లు నిర్వికారముగా నిబ్బరముగా నిరూపణము చేయఁగల్గును. "టాఁగూరు బంగారు కలము చికిలి వ్రాతల కంటె గాంధి యినుపకలము గీటు వ్రాతలు చుఱుకయినవి, సూటియైనవి, సుందరమయినవి!" అని—

ఇట్టి వేవేవో భావములు నాకు శేకెత్తుచుఁ గ్రైత యన్న రోఁత రోఁచు కాలమున గోవింద రామాయణ మిది చేత జిక్కినది. ఇది యేదో రామాయణ కథారచన యని యీాస డింపుతోనే యెత్తికొనియు దొలి పద్యము దొరకొని, యితిశ్రీ దాక యేకధారగాఁ జదివియే యింకొకరి చేతఁ బెట్టవలసిన వాఁడ నయితిని. నన్ని కావ్యమంత తన్మయునిఁ గావించినది. కవితా విడంబన మంతగా నాకిందుఁ గాన రాలేదు. కవి కిందు శ్రీ రామచంద్రమూర్తి దివ్యధ్యానము, తత్సచ్చరిత్ర ప్రణయనతత్పరత, పరమార్థలిప్స యనునవియే యీ గ్రంథ రచనమున హృదయమునఁ దొలఁకు లాడినవి. ఉత్తర రామాయణ మందున్న యుప కథలెల్ల నిందు పేక్షింపఁబడినవి. తిక్కన నిర్వచనోత్తర రామాయణము. పాపరాజు నుత్తర రామాయణము మొదలగునవి కవితా విలాసంపు సొంపు లాస్వా దింపగోరి కూరిచినకృతులు. ఈ గోవింద రామాయణమునకును వానికిని పోలిక లేదు. ఆ గ్రంథములు పాఠకునిఁ గవితా స్వారస్య కల్పనా చమత్కారానుభవ రసికునిఁ గావింపఁ గల్గినవి. ఈ గ్రంథము పాఠ కుని శ్రీరామ భక్తిపరుని, సుఖదుఃఖ నిర్వికారుని పరమార్థపరా యణునిఁగావింపఁగల్గినది. కవితావికృతు లంతగాఁ గానరాకున్నంత మాత్రమున నిది కావ్యగౌరవము లేనిదనఁగాదు. వంకలు దీటిసనశయ్య, పొంకముగల పలుకుతీరు, శుచిరుచులుగల పాకము, వడిగల కథావస్తు

గతి యిందున్నవి. ఉత్తరరామాయణ కథావస్తువునకిట్టి కవితా పద్ధతి కరవే కావలసినది. కొంపలు దగులబడుచున్న సంక్షోభసందర్భములఁ జెప్పినప్పటి రాగాలాపములువోలె నుత్తరరామ ప్రణయ ప్రళయ కథాకథనమున విపుల కవితా విలాసములు వైరస్యహేతువు లగును. తటస్థులనెల్ల నువ్వెత్తుగానూచి పడద్రోచి లోఁగొని కొట్టికొని పోవు కరుణరసకల్లోలినిలో జల జలలు, మిల మిలలు, సెలమెలపులు, సోనసొంపులు గోచరింపవు. పాఠకులకు జీవితానుశీలనమున నుత్తర రామచరిత్ర మెంత గంభీరయోచనపుఁబని గల్పింపవలెనో, గోవిందాచార్యులవారి రచనమిది యంతపనిని గల్పింపఁ జాలియున్నది. దీనిఁ జదివి నేను తన్మయుఁడనై స్తవముగాఁ గాక వాస్తవముగానే యిట్లు వ్రాయుచున్నాను. ఈ గ్రంథము నామూలాగ్రముఁ జదువునపుడును నందును గ్రంథాద్యంతాశ్వాసావసాన ఘట్టములఁ జదువునపుడును నే నలౌకికానందమును బొందినాఁడను. వియోగాశ్వాసము, నిర్గమనాశ్వాసము నిందు మఱీ రసపుతములుగా నున్నవి. కృత్రిమకవితా కల్పన లిందు లేవు. కథాగతి సూటిగానున్నది. ఔచితి చక్కఁగా సంరక్షితమయినది. పుష్పము వోని కథాపరమార్థమునకు దొడిమవోలెఁ గవిత వెనుకఁ బడియున్నది.

అనన్య సాధ్యేస్వాభీష్టే మహా విశ్వాస పూర్వకమ్
త దేకోపాయతా యాఞ్చా ప్రపత్తి శ్శరణా గతిః.

అన్న ప్రపత్తి మాధుర్యము గ్రంథము ప్రతిపదమునఁ బాఠకులు పర్యాప్తముగా నాస్వాదింపఁగల్గుదురు. ఆంధ్ర సహృదయులకెల్ల నీ గోవిందరామాయణము పరమార్థపు విందు సాగించి పరితోషము గొల్పజాలునని నా విశ్వాసము. పరమార్థపరాయణు లగు నిట్టి గ్రంథకర్తలను భగవంతుఁ డాంధ్రదేశమున కింకను ననుగ్రహించుఁగాక.

తిరుపతి,
16—2—1942.

వే టూ రి ప్ర భా క ర శా స్త్రి.

# పీఠిక

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, ఎమ్. ఏ.,
ఆంధ్రాధ్యాపకులు, ఎస్. ఆర్. ఆర్. కళాశాల,
బెజవాడ

మఱల రామాయణ మన్నంతనే పాడినదగా పాటయా యందురు. పాట పాడినదే యయ్యును పాడినది నవ్యమైనొక గీతిగా నున్నచో ప్రశంసార్హమే కదా! ఏదో గీతిగాఁ బాడ గలవాఁడు క్రొత్తపాట పాడినను అస్తవ్యస్తముగ నుండును. ఎప్పటి కప్పుడు క్రొత్త కల్పన చేయఁగల వాఁడు ప్రాత పాట పాడినను క్రొత్తగానే యుండును. పాటలోని యక్షరములు మాత్రమే చూడఁ గలిగి యసలు పాడుట యొక్క రుచి తెలియని వానిది మొదటి మాట.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యుల వారు ప్రాత పాటనే క్రొత్తగాఁ బాడినారు. ఈ క్రొత్తదనము, మఱల పాడుటలో లేదు. పాడిన వైఖరి క్రొత్తగా నుండుటలో నున్నది. తెలుఁగు భాషలోఁ బద్యరచన యొక శిల్పము. ఈ శిల్పము కావ్యశిల్ప మను మహాసముద్రములో నొకబిందువు. కాని యది ప్రవహించినను తీర్చి దిద్ది మంచి నీటి సముద్రము వలె చేయ వచ్చును. మంచి నీటి బిందువులు విడివిడిగా మంచు నీటిని సమకూర్చినను ఒక సముద్రము కాదు. మహాతరంగములు లేనిచో, బహు విధాల జంతుసృష్టి లేనిచో, అగాధత్వము లేనిచో, పరిసర ప్రాంత దేశోపస్థితి మాహాత్మ్యము లేనిచో, సముద్రము సముద్రమే కాదు. అట్లే క్రొత్తదైన పాత్ర పోషణయు, కథా కల్పనయు, మఱియు ననేకమైన కావ్య శిల్ప మార్గములు లేనిచో నెంతటి శయ్యా పాకములు కలిగిన గ్రంథమైనను, కాలాంతరగ్రస్త మగును. భాషా వేత్త వేరు. రసజ్ఞుఁడు వేరు. భాషా వేత్తలలో గొంత రసజ్ఞత యున్నది. రసజ్ఞులలో కొంత భాషావేత్తృత్వము నున్నది. నిజముగాఁ గావ్య శిల్పములోఁ దీర్చిన పద్యములనుఁ

ఎక్కువ స్థానమున్నది. భావ పరిణతికి ఎక్కువ స్థానమున్నది. ఈ గ్రంథము భావ పరిణతి యెక్కువగా కలిగిన గ్రంథము.

ఈ కావ్యములో సుతోదయాశ్వాసమును పునస్సంయోగాశ్వాసమును రెండు దివ్యమైన మచ్చుముక్కలు. పునస్సంయోగాశ్వాసము విషాద కథ గానే యుంచి శుభాంత కథగా మార్చినట్లు భావ పరంపరచేత కల్పించుటలో రమ్యమై యీదశ కందుకొన్నది. సుతోదయాశ్వాసము దాని కదియే సాటి. ఈ యాశ్వాస మంతయు శత్రుఘ్నుని చుట్టును తిరిగినది. శత్రుఘ్నుఁడు మధురకుఁ బోవుచు వాల్మీకి యాశ్రమమున విశ్రమించెను. అతడందుండగనే కుశలవులు జనించిరి. శత్రుఘ్నుఁడు ఆశ్రమమునకు వచ్చుటయు, కుశలవుల జననమును భిన్న ఛందస్సులలో నడచినవి. సుగంధి, స్రగ్విణి, ద్విపదలు ఈపని చేసినవి. ఈచమత్కారమైన సన్నివేశము భిన్నవృత్తములతోఁ దీర్చిన కవియొక్క వృత్తౌచిత్యము దివ్యశిల్పములోని భాగము. శత్రుఘ్నుఁడు "పిల్లలన్ కన లేదు ప్రేమ మీరంగ, యిది యేమి లోకమో ! యిది యేమి పనియొ, మది పుట్టదో చూడ మమకార మప్పుడు" శత్రుఘ్నుఁడు మధురకుఁ బోయెను. పన్నెండేడ్ల తరువాత మఱల నయోధ్యకు తిరిగివచ్చెను. వాల్మీకి యాశ్రమంబున మఱల దిగెను. అప్పుడు లవ కుశులు రామాయణము పాడినారు. శత్రుఘ్నుఁడు ఆ పాటవిని మాటాడలేదు. వారినిగూర్చి ఋషి నడుగ లేదు.

"గాన కోవిదుల జాడ లెఱుంగ గదయ్య హానిచే, నన్న నదేమొ గూడ దనె నాతని వెంబడి వచ్చువారితో, మన్నన నేర్వడో లవణ మర్దనుఁ డాగతి నేల పల్కెనో"-మఱల తోటకవృత్త ముండెను.

శత్రుఘ్నుడు అయోధ్యకు వెళ్ళి తిరిగి మధురకు పోయెను. కుశలవుల సంగతి అన్నగారితో చెప్పనేలేదు సరిగదా "మధురకేగెడి నాడును, మధుర వీడి మరలి వచ్చెడి నాడును, మార్గమందు విడిసి యుండెను వాల్మీకి పేటియందు, విడియ డేలొకో మరలి తావెడలు

నాడు" "అగ్రజుని వీడి మధురకు నఱుగు త్రోవ, రాముసతి యున్న వాల్మీకాశ్రమము లేదో, జ్ఞప్తికిని రాదో! గంతవ్య సరణి కాదో, తెలియగా రాదు శత్రుఘ్ను తలంపదేమొ" ఈ ఘట్ట మిట్లు వ్రాయుటలో ఈ కవి తన యపారమైన ప్రతిభ జూపించెను.

మఱి యితరమైన ప్రతిభలు కావ్యమంతటను పుష్కలముగా నున్నవి.

ఆశ్వాసాంతాది పద్యములు తెలుఁగు కవులందఱు సంబోధన తోనే తీర్తురు. ఈ కవి మఱి యొక మార్గమున తీర్చెను. అవి యన్నియు ఆచార్యులవారి భక్తి భావములే. ఈ పద్యములు వేరే యొక భక్తుని కథ. ఇట్లు వ్రాసిన వారు మఱి యింకొక్కరే గలరు. శ్రీ కూచి నరసింహము పంతులు గారు తమ "గౌరాంగ" చరిత్రలో నిట్లు చేసిరి.

గోవిందాచార్యుల వారు రాజకీయ వేత్త. దేశనాయకుడు. స్వార్థత్యాగి, భక్తుఁడు. ఈ లక్షణము లన్నియు వీరి కావ్యము నిండ కనిపించుచునే యుండును. రామచంద్రుడు "ఏకాంత మునం దుపాంత నృప ఘట్టన శక్తులు తూచి చూచెదున్" "ద్రవ్య కరకానన నదీ నదంబు లరసి" పెంపుచేయును. (విహారాశ్వాసమున రాముఁడు సీతను వదలి పెట్టగా బ్రాహ్మణులు పండితులు శ్రీరాముడు చేసిన పనిని గూర్చి మాటాడుదురు. ఆ ఘట్టమంతయు లోక నీతితో నిండియున్నది. నీతియు ధర్మమును కలియవు. లోకయాత్రకు నీతి యవసరమే. రాజనీతి రాజ్యముకొఱకు. నీతియు అసత్య మార్గమును రెండు నొకటియే. నీతినిబట్టి సీతను వదల కున్నచో రాజ్య సంపాతము కాదు." (వియోగాశ్వాసమున)

ఈరీతిగా ననేకములైన లోకజ్ఞానముతోఁ గూడినవియు, స్వకీయ రాజకీయ వేత్తృత్వము విశదపరచునవియు ఘట్టములు గలవు.

ఈ రాజనీతి వేత్తృత్వమే గాక కవికి బహ్వేతర శాస్త్ర పాండిత్యము గూడ గలదు. సర్వశాస్త్రములు కావ్యమునకు అంగములగుట వలన పేరి యితర శాస్త్ర పాండిత్యము కావ్యమున కలంకార ప్రాయముగా నున్నది. జ్యోతిష శాస్త్ర ప్రశంస కూడ నీ కావ్యమునందు గలదు. (వియోగాశ్వాసమున)

పేరికిఁగల కవితా ప్రతిభ సామాన్య కవుల కందునది కాదు. ప్రతిభ యనునది యొక్కొక్క భావమును క్రొత్తక్రొత్తగా చెప్పించును. సీతారాములు వియోగాత్పూర్వము వన విహారము చేయుచుండగ "కాలగర్భమునం దేమికలదో వారు ముద్దు ముచ్చట లంతతో ముగియు రీతి ననుభవించిరి" ఈ సూచ్యార్థ సూచనము 'భవభూతి' మార్గమునం దున్నది. (విహారాశ్వాసమున)

ఇంతకంటె నెక్కువైనది యింకొకటి. రాముఁడు సీతకు ఋష్యాశ్రమము చూచుట యన్న కోరికను వరముగా నిచ్చెను. "కాని మానస మేలకో కలవర పడి" మౌనము వహించెను. "వరమలిచ్చి వ్యసన మొందుట యిక్ష్వాకు వంశ విధమొ" ఈ పద్యమునందలి భావము బహ్వర్థ తాడనము చేసి యాస్వాద్య మగుచున్నది. దశరథుఁడు కైకకు వరమిచ్చి వ్యసనము పొందెను. రాముఁడు సీతకు వరమిచ్చి వ్యసనము పొందెను. ఈ యర్థము లూరకే తోఁచుచున్నవి. అసలర్థ మిదికాదు. రాముఁడు ఆ వరఫలితముగా కొన్ని దినములైన సీతను వదలి యుండ వలయునన్న విచారమో! రాబోవు నాపద యొక్క సూచనయో! ఇదియు గాక రాముడు భగవంతుఁడన్న భావమో! కవి మనస్సులో నీవాకము బింబించుచున్నది. (విహారాశ్వాసమున)

వాల్మీకి యడవిలో సీతాదేవినిఁ జూచి "దశ దిగ్భరిత కీర్తి దశరథ సమ్రాట్ స్నుషా తల్లజంబ సుస్వాగతంబు" ఈ మొదలైన సీస పద్యము కలదు. ఇట్లు వాల్మీకిచేత సీతకు స్వాగత మిప్పించిన కవి లేఁడు. (వియోగాశ్వాసమున

ఈ కావ్యమంతయు నిట్టివి, యనేకములును కవియొక్క ప్రతిభా ద్యోతకములుగా నున్నవి.

కవి యీకాలము వాఁడు. ఈ కాలము పూర్వకాలపు భారత భాగవతములందలి యనేక విషయములను వివదించుచున్నది. రాముడు దేవుడు కాదనుచున్నది. రాముడు చేసిన చర్యలన్నియు నధర్మ మనుచున్నది. ఈ భావములన్నియు భక్తుఁడైన యీ కవి మనస్సునందు గగ్గోలుపడుచునే యున్నవి. ప్రత్యేకముగా "శంబుకవధ" యీ కవి మనస్సును కలచి నట్లేయున్నది.

"శుద్ధ చరిత్రుడు శంబుకుండు మా రాముఁడు చంపగాదగు నరాతి నరుండో... యాతతాయియో! యీకథ యేగతిన్ రఘుకులేందుని జీవిత గాధ మార్చునో" యని తన కాలపుభావమును వివరించెను. "లోకసుపాలన మిట్టిదన్నచో" లోకులు విశ్వసింతురా యని యీయన యనుమానము. "కృతయుగధర్మ మట్టిదిగాన అట్టి ధర్మమూనితివా రామ" యని సంబోధించెను. ఇది యంతయు జూడగా కవి యాధునిక భావములచేత తాడితమైన బుద్ధిని మఱల నిలఁబెట్టుకొన్నట్లు కనిపించును. సుతోదయాశ్వాసమున

మఱియొక్క విషయము. హనుమంతుడు శ్రీరామచంద్రుని స్తోత్రముచేయుచు "రాముడు సర్వరసధాము" డని చెప్పుచు అద్భుత శృంగార కరుణ హాస్య రౌద్ర శాంత వీర భీభత్స భయానకరసములు చెప్పుచు భక్తిస్నేహవాత్సల్య రసములుగూడ చెప్పెను. భక్తి స్నేహ వాత్సల్యములుగూడ రసములని చెప్పుటలో నీ కవి విశేష వ్యాఖ్యానము చేయుచున్నాడు. భక్తి రసమని నేఁటి పండితులు కొందఱు జగన్నాధ పండితుని ననుసరించి వాదించుచున్నారు. కావచ్చును. విభావాను భావముల కల్పనచేత స్నేహవాత్సల్యములు గూడ రసములు కావచ్చును. ఇది యంతయు ప్రతిభా విశేష సంపన్నము.

ఈకవి ప్రకృతి పరిశీలన చక్కగాఁ జేయగలవాఁడు. "మళ్ళ కేగెడి కాపు కాళ్ళకు తొడిగెడి కిఱ్ఱు చెప్పుల జోళ్ళ కిఱ్ఱుకిఱులు, లలి వాకిళుల నూడ్చి కలయంపి చల్లనౌ కాంతల హస్తకంకణ రవమ్ము" మొదలైన వర్ణనము కవియొక్క యాంధ్రత్వమును చాటుచున్నది.

ఇట్టి బహుగుణ భూయిష్టమైనదియు, శ్రీ రామచంద్ర కథాత్మకమై, మోక్షదాయియు నగు నీ కావ్యమునకు నన్ను పీఠిక వ్రాసి పెట్టుమని యడుగుట నా యదృష్టము.

ఇంకొక్కటియే మాట. ఇందలి పూర్వగాథా రచనము గాయత్రీ రామాయణమువలె నున్నది. అందలి చివరి యైదుపద్యములు భాగవతములోని నారాయణ కవచమును స్మృతికిఁ దెచ్చుచున్నవి.

బెజవాడ
21—2—1942

విశ్వనాథ సత్యనారాయణ

—

# వి ష య సూ చి క

సు తో ద యా శ్వా స ము



ని ర్గ మ నా శ్వా స ము

పునస్సంయోగాశ్వాసము



తప్పొప్పుల పట్టిక పుస్తకాంతమున

శ్రీః



శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్
సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్లో. కాలామ్భోధర కాన్తికాన్త మనిశమ్, వీరాసనాధ్యాసితమ్
ముద్రామ్ జ్ఞానమయీమ్ దధాన మపరమ్ హస్తామ్బుజమ్ జానుని
సీతామ్ పార్శ్వగతామ్ సరోరుహకరామ్ విద్యున్నిభామ్ రాఘవమ్
పశ్యన్తమ్ మకుటాఙ్గదాది వివిధా కల్పోజ్జ్వలాఙ్గమ్ భజే॥

శ్లో. చరితమ్ రఘునాథస్య । శతకోటి ప్రవిస్తరమ్
ఏకైకమక్షరమ్ప్రోక్తమ్ । మహాపాతకనాశనమ్॥

శ్లో. రామాయ రామభద్రాయ । రామచన్ద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ । సీతాయాః పతయే నమః॥



ఓమ్

శ్రీరామాయనమః

# గోవిందరామాయణము

## ఉత్తరరామచరితము

### ఇష్టదేవతాప్రార్థనము

ఉ. శ్రీనిధియై, యనాది చిద ♦ చిత్పద సన్మయ మాతృదేవియై
భాను సహస్రమండల వి ♦ భా ప్రతిభాసిత మూర్తి గల్గియున్
జానగు మోమున న్మధుర ♦ శాంత మృదూక్తులఁబల్కు-బాల, నా
మానసమందు నిల్చి యభి ♦ మానముతో సుకవిత్వ మిచ్చుతన్. 1

శా. శ్రీ కృష్ణాతటినీ తటిం గల గిరిన్ ♦ జిన్మాత్ర రూపంబునన్
*లోకత్రాణనదీక్ష వెల్గెడి జగ ♦ ల్లోకైకన్ గృపామూర్తికన్
రాకాచంద్రనిభాననన్, గనక దు ♦ ర్గన్ గాంచి పూజింప, నే
నైకాత్మన్ బెజవాడకుం జనితి నే ♦ నేకాక్షిగా భక్తిమై. 2

ఉ. తొల్లిటితల్లి మా కనక ♦ దుర్గ వసించు నగాగ్రమెక్కి-, యా
సల్లలిత స్వరూపము ప్ర ♦ శాంతికర మ్మఘనాశనమ్మ్మ, నా
యుల్లము సల్లవింపఁ గని ♦ యూర్జిత పాప నివృత్తిఁ జెంద సం
ఫుల్లలతాంత కుంకుమ్ములఁ ♦ బూజలొనర్చి నివాళు లిచ్చుచున్. 3

ఉ. అంబకు మ్రొక్కి-, తచ్ఛుభ ప ♦ దార్చిత కుంకుమరేఖఁ దాల్చి, కృ
ష్ణాంబు సమీపసైకతము ♦ నందు మెయిన్ శ్రమదీర వాల్చి, డెం
దంబున నాదు జన్మఫలి ♦ తంబు దలంచుచు నుంటి శుక్రవా
రంబున నీశ్వరాబ్ద నవ ♦ రాత్రుల నొండొక రేయి నొంటిమై. 4

---

* పాఠాంతరము : లోకత్రాణ సుదీక్ష

తే. అల్లనల్లన స్మృతి దప్పి ♦ యంతలోన
బాల తలఁ పాత్మలో నిండి ♦ పరిణతిఁ గన,
శబ్దశక్తి నుపాసన ♦ సలుపఁ గోర్కె
పొడమి శ్రీరామకథ వ్రాయఁ ♦ బూనినాఁడ. 5

ఉ. వ్రాసితి నాదియందుఁ గడు ♦ భక్తిని గాంధిమహాత్ము తత్త్వముల్,
వ్రాసితి దాస్యబంధగత ♦ భారతదేశ మహార్థశాస్త్రముల్,
వ్రాసితి భారతీయ పర ♦ రాజ్యవిధాన విపచ్చరిత్రముల్,
వ్రాసి తరింపనెంతు నికఁ ♦ బార్థివరాము పవిత్ర కావ్యముల్. 6

ఉ. తిక్కన వ్రాసియుండె మును ♦ దివ్యని మాటల మూటఁగట్టి, పే
రెక్కిన పాపరాజు రచి ♦ యించె సమాసముల్ ఘటించి, వే
ఱొక్కఁడు వ్రాయఁగాఁ దగునె ♦ యుత్తరకాండముఁ గావ్యరీతి? నే
నొక్కఁడ బూనుకొంటి మఱి ♦ యొక్కరు త్రొక్కనిఫక్కి నేఁటికిన్. 7

తే. భక్తిరసముఁ బునాదిగాఁ ♦ బ్రబలఁజేసి
కరుణరస కావ్య సౌధంబుఁ ♦ గట్టువాఁడ
జానకీ రామ లక్ష్మణుల్ ♦ దీనియందుఁ
గాపురముఁ జేయుచుంద్రు స్వ ♦ కర్మఁ జిక్కి. 8

తే. ఎడ తెగని స్వీయదుఃఖాబ్ధి ♦ నీదులాడి
ధీరుఁడగు రాముఁడే కడ ♦ తేరఁ డాయె!
జానకీ రాఘవుల కష్ట ♦ సరణి చదివి
కరుణరసమున నెవ్వారు ♦ కరఁగకుంద్రు! 9

ఉ. రామ పదాబ్జ మంజుల ప ♦ రాగ పరీవృత చిత్త బంభరం
బీమెయి నాట్యమాడఁగల ♦ దీ కవితాసుమ భాసురాటవీ
స్తోమమునన్ సుభక్తి మధు ♦ తుంగతరంగ వివృద్ధ వాహినుల్
దామరతంపరై చెలఁగ, ♦ దానఁ గృతార్థత నొందఁ జాలనే. 10

ఉ. ఒప్పుగ వ్రాసినారు కవు ♦ లుత్తమ రామచరిత్ర మెందఱో
యిప్పుడు నీవుగూడ నది ♦ యే రచియింప విశేషమేమి? యేం

గొప్ప ఘటించు నీకనుచుఁ ♦ గొందఱు పల్కఁగవచ్చుఁ గాని, రా
మప్ప చరిత్రమే తగు, ని ♦ హమ్ము పరమ్ము లభింపఁజేయఁగన్. 11

ఉ. ఊయెల మంచమున్, రమణి♦యున్, విడెమిచ్చుటయున్, రసజ్ఞుఁడున్
హాయిగ మందమారుత మ ♦ నంతముగాఁ బ్రసరించు సౌధమున్
బ్రాయము నేల? యొక్క గుణ ♦ రామ పదద్వయ భక్తి గల్గుచోఁ
వ్రాయఁగఁజాలనే, సుజన ♦ రంజకముల్ రసవత్ప్రబంధముల్. 12

చ. సకల కళా విశారదుని ♦ సర్వ రసాత్మకమైన కావ్యమున్
వికల మనన్ సదా, నరుఁడు ♦ నెంగలియై వెనుదీయఁబోఁడు; మా
నక నలుసెంచు, మానవుని ♦ నాణెముతోఁ బనిలేదు, రాఘవుం
డొకఁడె దయాసుధాబ్ధి కణ ♦ మొక్కటి చిల్కఁ దరింపఁజాలనే. 13

తే. సకలసంస్కృత సాహితీ ♦ ప్రకటితంబు
సర్వ ధర్మార్థ సంచయ ♦ సంశ్రయంబు
కాళిదాసాది కవికాండ ♦ కల్పకంబు
ఆదికావ్యంబు; తత్కర్త ♦ నాత్మనెంతు. 14

చ. తెనుఁగు కవిత్వమాధురినిఁ ♦ దీసి, బిగిన్ వడగట్టి, మేల్ రసం
బున జిగిఁజేర్చి, నైజగుణ ♦ భూతికి వన్నెలఁదీర్చి, యీడు జో
డనఁదగు దేశభాషలను ♦ నాంధ్రిని మిన్నగఁజేసి, కీర్తిఁ బెం
చిన సుకవిత్రయంబు నెదఁ ♦ జేర్తు సుధామయ కావ్యసిద్ధికిన్. 15

ఉ. నన్నయ తిక్కనాది కవి ♦ నాథులకుం బ్రణమిల్లి భక్తి, పె
ద్దన్నకు మ్రొక్కి, తక్కఁగల ♦ యాంధ్ర మహాకవి శేఖరాళికిన్
మన్ననఁ దెల్పి, పోతనకు ♦ మానస మిచ్చి రవంతసేపు; నా
తెన్నున వ్రాయువాఁడ, సుమ♦తిన్ రఘురామమహాప్రబంధమున్. 16

## పూర్వగాథ

శా. శ్రీరామామణి సీత గాఁగ భువి నే ♦ శ్రీశుం డయోధ్యాపురిన్
శ్రీరాముండను పేరఁ బుట్టి జనులన్ ♦ సేవించి, పాలించి, లో

[illegible] శత్రుఘ్నసహితుండై ♦ త్యాగార్చనల్ మించె, నా
[illegible] జానకీ విభుండు ♦ ప్రీతిన్ బ్రోచు మత్కావ్యమున్.17

ఉ. ఖండిత మోహుఁడై మునుల ♦ బాంధవుఁడై సుజనాళిఁ బ్రోవఁ గో
దండముఁ బూనువాఁడు, నిజ ♦ ధర్మము నేర్చినవాఁడు, కౌశికో
ద్దండిత సహాయ సిద్ధిత ♦ దానవుఁ డధ్వరరక్షకుండు, రా
ముండు, సలక్ష్మణుండు, నృప ♦ పుత్రుఁడు, మాదరినుండుఁగావుతన్.

తే. అక్షయామోఘ తేజోమ ♦ యాత్మకుండు
భవుని చాపంబు విఱిచిన ♦ భవ హరుండు
ధరణి జామాత, పూత, సీ ♦ తా విభుండు
సతము శుభముల నిడి మమ్ము ♦ సాకుఁగాత! 19

చ. తన పదధూళి జాతి నొక ♦ తన్వినిఁగాఁ నొనరింపఁ జాలియున్
జనకుని యాన రాజ్యరమ ♦ సర్వము వీడిన త్యాగశీలి, కా
ర్తిని గహనాంతరంబునఁ జ ♦ రించి తరించిన పుణ్యశాలి, పా
వన రఘురామమూర్తి, సిత ♦ బంధురకీర్తిని మాకొసంగుతన్. 20

ఉ. సీతయు, లక్ష్మణుండుఁ దన ♦ చెంత సపర్యల సల్పుచుండ, సా
కేత నికేతన స్థితిఁ బ ♦ కీర్ణ వనాంతర చిత్రకూట సం
కేతిత భూధరంబున సు ♦ ఖించుచు, మోహిత యోగివర్యుఁడై
ఖ్యాతివహించినట్టి రఘు ♦ కాంతుఁడు తృప్తిని మాకొసంగుతన్.21

తే. ధాత్రిఁబాలింపగా నీవె ♦ తగుదు వంచుఁ
బదములకు మ్రొక్కు భరతుని ♦ పలుకు వినక,
పాదుకల నిచ్చి, యాతనిఁ ♦ బంపి నట్టి
ధీరుఁడగు రాముఁ డిచ్చుత ♦ దీక్ష మాకు. 22

చ. అసురులఁ జంపుచున్ మునుల ♦ యార్తిని బాపుచు, దండకాటవి
న్మసలుచు, గృధ్రరాజునకు ♦ నాక మొసంగిన పుణ్యమూర్తి; తా
మెసవెడి యెంగిలిన్ శబరి మెచ్చి ♦ యొసంగఁగ, భక్తభక్తుఁడై
కొసరిన రామమూర్తి మముఁ ♦ గోరక యే దయతోడఁ జూచుతన్.

ఉ. కాపుము నీవె, *నాకుఁ గడ ♦ గండ్లను బాపుము నీవె,యంచు సు
గ్రీవుఁడు వేఁడునంతటనె, ♦ కీశ వరేణ్యుని వాలిఁ జంపి సు
గ్రీవుని యార్తిఁ బాపిన వ ♦ రిష్ఠుఁడు, రక్షణ దక్షకుండు స
ర్వావసరంబులందు, శర ♦ ణాగతులన్ మముఁ బ్రోచుఁగావుతన్.24

చ. వననిధి దాఁటి లంకిణిని ♦ ద్వారమునందు జయించి లంకలో
జనకతనూభవ న్గని వి ♦ శాంపతి సేమము సెప్పి, యాపె యి
చ్చిన హరువా శిరోమణిని ♦ జెచ్చెరఁదెచ్చి యొసంగు నంజనా
తనయునిఁగూడు రాముఁడు స♦తంబుఁ గృపన్ మముఁబెంచుఁగావుతన్.

ఉ. సేతువుఁ గట్టి వార్నిధికి, ♦ సీత కృశించెడి లంకలో మహా
పాతకుఁడైన రావణునిఁ ♦ బట్టి వధించి, విభీషణార్యు సం
ప్రీతిని రాజుఁజేసి, తన ♦ ప్రేమసిఁ గూడిన వీరరాఘవుం
డూతగ, నాంజనేయుఁగొని ♦ యొప్పున మమ్ముఁదరింపఁజేయుతన్

ఉ. వైరులఁ గెల్చి సీతఁగొని ♦ భక్తులు వెంబడిరా, నయోధ్యకుం
జేరి, స్వరాజ్యమంది, నిజ ♦ సేవక సోదర బంధు మిత్ర నా
ద్వార సమేతుఁడైన పరి ♦ పాలితలోక శుభంకరుండు, మా
శ్రీ రఘురామ భూవిభుఁడు ♦ స్వేచ్ఛమెయిన్ వరదుండు గావుతన్.



ఓమ్.

శ్రీరామాయనమః

# గోవిందరామాయణము

## ఉత్తరరామచరితము

## విహారాశ్వాసము

### సాకేతవర్ణనము

క. అందంబు ప్రేమ, ప్రేమా
నందంబే సృష్టి కార ♦ ణంబగుఁ, బ్రకృతిన్
సౌందర్య రసాస్వాదన
మందుట జీవులకు ధర్మ ♦ మౌఁగద; రామా! 28

క. శ్రీకరమై, శుభదంబై,
ప్రాకట విభవంబు గల్గి ♦ ప్రథిత సుకీర్తిన్
లోకస్తుతి పాత్రంబై
సాకేతపురంబు దనరు ♦ సరయూతటినిన్. 29

చం. అనిమిషులై ప్రజల్ నృపు ని ♦ రంతరమున్ భజియించుటన్, నికే
తనములు మోహనాకృతి సు ♦ ధామయరమ్యములై చెలంగుటన్
గననగు నాయయోధ్య, సుర ♦ కాండము స్వీయపురంబుతో నరే
శునిఁ గొలువన్ మరల్గొని వ♦సుంధరకున్ దిగియున్న పోలికన్. 30

ఉ. ఆ నగరీశుఁ డీ మహి మ ♦ హా మహిమోన్నతుఁడై, రమాగతా
నూన సుఖప్రసన్నత గ ♦ నున్ సతతంబు, సుకర్మ యుక్త వి
జ్ఞానమయేంద్రియేచ్ఛకు వ ♦ శంవదుఁడై పరిపాలనా క్రమం
బూను; ప్రజానురక్త హృద ♦ యోజ్జ్వల సత్య పరాక్రమంబునన్.

## రా మ రా జ్య ము

ఉ. నమ్మును లోకపాలనము ♦ నన్ జగదీశు ననంతు నవ్యయున్;
వమ్మని యెంచఁబోఁడు నిజ ♦ పౌరుషమున్ బనిఁ బూను పట్ల; య
త్నమ్ము ఫలింపకున్నను ♦ యథావిధిఁ గార్యము సల్పుఁగాని చి
త్తమ్మునఁ జింతనొందఁడు; స ♦ దా జయకర్ముఁడు ప్రాప్తరాజ్యుఁడై.

శా. ప్రాతఃకాలమునందె లేచి విధులన్ ♦ బ్రారంభమున్ జేయు, సు
స్నాతుండౌచుఁ ద్రిసంధ్యలందు నెరపున్ ♦ శాస్త్రోక్తకర్మంబు, లో
కాతీతంబగు భక్తిఁ దల్లులకు దా ♦ సోహమ్మనున్, సంతత
ప్రీతిన్ భ్రాతలఁ జీరి వారి సుఖ మే ♦ వేళన్ విచారించెడిన్. 33

ఉ. మంతన ముండు నిత్యమును ♦ మంత్రులతో నృపకర్మ సల్ప, నా
వంతయు మంతనంబు నెపు ♦ డన్యులకున్ దెలియంగనీఁడు, సా
మంత నృపాళి నెల్లర స ♦ మానముగా దయఁ బ్రోచుచుండు, నే
కాంతమునం దుపాంత నృప ♦ ఘట్టన శక్తులు తూఁచి చూచెడిన్. 34

చ. గురుని వసిష్ఠునిన్ సతముఁ ♦ గొల్చుచు ధర్మము నేర్చుచుండు, నే
మఱక యెఱుంగు నెప్డు జన ♦ మాన్యులఁగూడి ప్రజాసుఖమ్ము; వై
మఱవఁడు, స్వీయబాహుబల ♦ మార్గణ శక్తులెయెంచబోఁడు, భూ
సుర మునిముఖ్యులన్ దనుపుచున్ గ్రహియించును గర్మధర్మముల్.

తే. అర్థ సముపార్జనా రీతు ♦ లర్థ శాస్త్ర
కోవిదులఁగూడి చర్చించి ♦ కొఱఁతఁ జెందఁ
డార్థికంబునఁ, గోశంబు ♦ నరయు చుండి
వ్యయమునకుఁ బూనుఁ బాత్రత ♦ ననుసరించి. 36

తే. ద్రవ్యకర కానన నదీ న ♦ దంబు లరసి
పెంపుఁ జేయుచుఁ గాపాడి ♦ పెంచు చుండి
ప్రజల సిరి నెంచి; కరము ని ♦ ర్ణయము సేసి
యర్థ ధర్మంబు లొండొంట ♦ నభిలషించు. 37

క. తడ వానరింపఁడు దర్శన
మిడఁగా నే వేళనైన ♦ నేరికి నైనన్
జడియకు పాలితు లెన్నఁడు
నొడయనితోఁ గష్ట సుఖము ♦ లున్నవి తెలుపన్. 38

తే. అదను దప్పక విధిఁదీర్చి ♦ ముదముఁ గూర్చ
నతఁడు, మితభాషి యయ్యుఁ బ్రి ♦ యం వదుండు
క్షితి పనులలోన నెల్ల రా ♦ శ్రితులె కాని
పగతు రనువారు లేరు భూ ♦ పాల మణికి. 39

తే. బీద సాదల దయతోడ ♦ నాదరించు,
న్యాయ మొనఁగూర్చుపట్ల ధ ♦ నాఢ్యు లన్నఁ
బక్షపాతంబుఁ జూపఁడు, ♦ పరమ నియతిఁ
దాత దండ్రుల తెరువున ♦ ధరణి నేలు. 40

తే ఆడి, మాటను దప్పెడి ♦ వాఁడు గాఁడు,
విల్లు గురిపెట్టఁ డొకమాత్రఁ, ♦ బెట్టె నేని,
రామబాణం బమోఘంబు; ♦ రామరాజు
ప్రథితగుణవర్తి, ధ్రువకీర్తి, ♦ రామమూర్తి. 41

తే. రాముఁడు చతుష్పదంబు ధ ♦ ర్మంబు నడుప
సకల జగదేక శాశ్వత ♦ శాసకుండు
నాఁగఁ బంచభూతంబు ల ♦ నారతంబు
సహజ ధర్మంబు మీరక ♦ సంచరించు. 42

తే. రాఘవ యశో లతాళి దు ♦ ర్గమ దిశాళి,
బహుళ సుమ పరీమళ భార ♦ వహతఁ గనియుఁ,
బవనుఁ డేవేళ గతి విలం ♦ బంబుఁ గనఁడు
జనము సుఖియింప వీచుఁ బ్ర ♦ శాంతవృత్తి. 43

*అతల కుతలంబు లెప్పుడ ♦ నోన్యమైత్రిఁ
మెలఁగుచుండుటఁ గాలంబు ♦ మీరిపోక

* పాఠాంతరము : అభ్రమును పృథ్వినిత్యమ

వాన గురియును లోకంబు ♦ వర్ధిలంగ
నచట నతివృ ష్ట్యనావృష్టు ♦ లసలె లేవు. 44

తే. ఇల్లు లేనట్టి నిరుపేద ♦ లెవరు లేరు,
పాడి పంటలు కొఱవడు ♦ వారు లేరు,
జల సమృద్ధియుఁ బశుపక్షి ♦ జంతు వితతి
గలవు ప్రజకెల్ల సంతృప్తి ♦ కరము గాఁగ, 45

తే. స్థిర సుఖంబునఁ జిరకాల ♦ జీవులగుచుఁ
దనువు జీర్ణించి, ప్రకృతి సి ♦ ద్ధముగఁ బ్రజలు
కాల ధర్మంబుఁ గాంతు, ర ♦ కాలమరణ
భయము నొందరు శ్రీరామ ♦ పాలనమున. 46

తే. "కలహ" మనుపల్కు "ప్రణయ" సం ♦ గతినిఁబొంది
దంపతులయందె సుంత యూ ♦ హింపనగును ;
గర్భవతి గాని యిల్లాలు, ♦ కాన్పులందు
నెగుడు దిగుడులఁ గను పత్ని ♦ యెందులేదు. 47

తే. అత్త కోడండ్ర కా సీమ ♦ నరిది తగవు.
లచ్చికిని శారదకు మైత్రి ♦ లభ్యమయ్యె.
కలిమియే గాని మఱి లేమి ♦ గానరాదు.
చదువు సంధ్యలు గలవారు ♦ సకల జనులు. 48

## ము ను ల రా క

ఉ. ఈగతి రాజ్యమేలు ధర ♦ ణీశ్వర రాఘవు దర్శనార్థమై
యోగులు రాజమందిరము ♦ నొయ్యనఁజేరఁగ రాజసేవకుం
డేఁగి ప్రణామముల్ సలుప ♦ నెల్లరకున్ "సుఖమ" స్త టంచు స్వా
యాగమనంబు వారు ప్రతిహారిని ♦ తేనికిఁ దెల్పఁగోరినన్. 49

తే. ప్రణతి సల్పుచుఁ బ్రతిహారి ♦ రాఘవునకు
మునుల రాక నెఱింగింప ♦ భూవిభుండు

వారికెదురేగి, తోడ్కొని ♦ వచ్చి మ్రొక్కి
యర్ఘ్యపాద్యంబు లిచ్చె న ♦ యంబు మీర. 50

చ. మునులను దోడితెచ్చి, ముద ♦ ముం గనునట్లుగ, నర్హరీతులన్
గనకమయాసనంబులను ♦ గ్రాలెడు చిత్రకుశాసనంబులన్,
వినయముతోడ నిచ్చి, రఘు♦వీరుఁడు "మీకు శుభమ్ములొక్కొ! మీ
వనములు నిర్భయంబులొకొ !♦భద్రమె శిష్యులకున్ సతం"బనెన్. 51

చ. వనజభవాది దేవగణ ♦ వందిత ! తావకదోర్బలంబునన్
మునులు సుఖస్థితుల్ గని య♦పూర్వతపంబున నున్నవారు రా
వణువధఁ జేసి, సీతఁ గొని ♦ వచ్చి, సుఖించెడి*నిన్ను, మే మయో
ధ్యను దిలకింప నోచితిమి, ♦ ధన్యులు మావలె శిష్యులెల్లరున్. 52

ఉ. భూవర ! శౌర్యధైర్యగుణ ♦ మూర్తివి! నీ గుణదర్ప సంపదన్
జావదొ లోకభీకర ని ♦ శాచరయోధగణంబు! వారిలో
రావణ కుంభకర్ణుల దు ♦ రమ్మున దున్మిన దానికంటె, నా
రావణిఁ జంపుటే† ఘనత ♦ రమ్ము, విరోధి పటిష్ఠుఁడాతఁడే. 53

ఆ. ఇంద్రజిత్తు శక్తి ♦ కెవ్వారు సరివారు
తండ్రి కంటె వాని ♦ తపము ఘనము
మాయ రణము నందు ♦ మహితుఁడో వానిని
జంప వశమె భూత ♦ సంఘమునకు ? 54

తే. నీవె వధియింపఁ జేసితి ♦ నేర్పు మీర
విస్మయంబంద లోకము ♦ వీరరామ !
ఇంకమాకేమి భయము లో ♦ కేశ ! యిపుడు ?
సాధు రక్షణ దక్ష ! వి♦ శాల వక్ష !

క. అనుచున్ మునితతి వలుకఁగ,
జనపతి కడుమోదమంది, ♦ సాకల్యముగా 55

---

* పాఠాంతరము : మిమ్ము

† పాఠాంతరము : ఘనతర, మ్మసమాన విరోధి యాతఁడే.

విన నుత్సహించె, రావణి
జనకుని మించిన విధంబు ♦ సమరములోనన్. 56

ఉ. రామనృపోత్తముండు, ముని ♦ రాజుల నీగతిఁ బృచ్ఛసేయ, వా
రా మహనీయుఁ గుంభజు ని♦యంత్రితుఁ జేయ, నగస్త్యమౌని శ్రీ
రామున కంతటన్ దెలిపె ♦ రావణ రావణి జన్మగాథలన్
నేమము, మంత్రముం, గలిగి ♦ నేర్చిన వారి తపోబలాదులన్. 57

తే. సభనుదీర్చి, పులస్త్య వం ♦ శక్రమంబు
సర్వమాలించి, పావని ♦ జన్మ మరసి
తండ్రి తాతలు ధన్యతఁ ♦ దనిసి రనుచు
మునుల రాకకు, రాముండు ♦ ముదము దెల్పె. 58

ఆ. విన్నవించె భక్తి ♦ విరియంగ ఋషులతోఁ
దనకు దర్శనంబుఁ ♦ దఱచుగ నిడ;
నధ్వరంబు సలుప ♦ నభిమతం బెఱిఁగించి
మునుల రాకఁ గోరి ♦ వినయ మొప్ప. 59

తే. సంయములఁ బంపి సభనిల్పి ♦ సంధ్యవార్చి
సంజకెంజాయ మెల్లన ♦ జారువేళ
నృపతిధర్మంబు సర్వంబు ♦ నెఱపి రాముఁ
డంతిపురమున కేగెఁ బ్ర ♦ శాంతుఁ డగుచు. 60

## బంధుమిత్రుల వీడ్కోలు

ఉ. ఈవిధి రాజ్యభారము వ ♦ హించిన యాది దినంబునుండియున్
భూవరుఁడేలు రాజ్యమును ♦ భూపతు లెందఱో గొల్వ; సన్నిధిన్
సేవకబృందముల్ నిలిచి ♦ సేవ యొనర్పఁగ; మంత్రి పుంగవుల్
రావణసోదరుండుఁ గపి ♦ రాజు, భజించుచునుండ నిత్యమున్. 61

చ. దినకర వంశ మున్నతికిఁ ♦ దెచ్చిన రాముని రాజ్య దీక్షలో
జనపద రాష్ట్ర దేశ జన ♦ సంతతి సంతస మొందునట్లుగాఁ

జనియెను జాలనాళ్లు; రఘు ♦ చంద్రుఁడు గొండొకనాఁడు బల్కెనో
జనకమహీపతీ! యనఘ! ♦ సాకుదు వీవెగదా! మమున్ దయన్. 62

ఉ. మీ మహిమంబునంగద! యమ ♦ మేయబలుండగు వైరిఁ జంపి; నే
నీ మహి నేలుచుంటి హృద ♦ యేశ్వరి సాధ్విని సీతఁ గూడి; మీ
రో, మహితాత్మ! సత్వరతి ♦ నుర్వినిఁ బాలన సేయువారు, మీ
భూమిని వీడి చాలదిన ♦ ముల్ గతియించెఁ, జనన్ దలంతురో? 63

తే. అతుల వినయమ్ము మీరఁ, బ్రి ♦ యమ్ము దనర,
జనక నృపు, రత్నములఁ బూజ ♦ సలిపి భక్తి,
భరతుఁ డరుదెంచు మీతోడఁ ♦ బయనమందు
ననెడి శ్రీరాముఁ గాంచుచు ♦ జనక నృపతి. 64

క. వీరా ! నీ దర్శనమును,
నీ రీతి నయమ్ము, ముదము ♦ నెఱపెను మనమం
దీ రత్నంబుల, దుహితలు
మీరును గొన నర్హులంచు, ♦ మించిన వేడ్కన్. 65

తే. రత్నముల నిచ్చి తిరిగి శ్రీ ♦ రామ పతికి,
జనకుఁ డేగెను నిజ పురి ♦ సాక, నపుడు;
రామచంద్రుఁడు, కేకయ ♦ రాజవరుని
యోగ్యమగురీతి మణుల బ ♦ హూకరించె. 66

తే. మాదు రాజ్యంబు, మేమును, ♦ మాదు సిరియు,
మీ యవియ కావె; మా దిక్కు ♦ మీరె సుండి,
యరుగు డెంచితి రెన్నొ నా ♦ ళ్లయ్యె మీర,
లచటఁ దండ్రి వృద్ధుండు మి ♦ మ్మాత్మఁ దలఁచు. 67

తే. చనఁగ నెంతురె సౌమిత్రి ♦ సాగనంపు
ననుచు రఘురాజు మ్రొక్కఁగై ♦ కమ్మతోడు
మరల రారాజున కెఱంగి ♦ మణుల నిచ్చి
వెడలె లక్ష్మణుం డాతని ♦ వెంట నరుగ. 68

శా. "లంకాధీశ్వరుఁ జంప, నాలమునఁ దో ♦ ర్ద్వాటున్ బ్రసాదింప, ని
శ్శంకన్ వచ్చితి వీ వయోధ్యకిటు; నీ ♦ శౌర్యంబు నెయ్యంబు లా
టంకంబుల్ గననేర వెన్నఁడును, రా ♦ డ్వంశో త్తమా! సద్గుణా
లంకారా!" యని రాజరాజు పలికెన్ ♦ శ్లాఘించి కాశీశుతోన్. 69

తే. "తోరణాలంకృతమ్ము ప్రా ♦ కార యుతము
దివ్య భాగీరథీ స్రవం ♦ తీ వృతమ్ము
వారణాసీ పురమ్ము త్వ ♦ త్పాలితమ్ము"
అని నుతించుచుఁ గాశీశు ♦ నంపె ఱేఁడు. 70

తే. భరతు పిల్పున మున్నారు ♦ ధరణి విభులు
దనుజ మర్దన మొనరింపఁ ♦ దలఁచి మున్ను
వచ్చియుండి రయోధ్యకు, ♦ వారిఁ గాంచి,
పార్థివ శ్రేష్ఠుఁ డిట్టులు ♦ పలుకఁ దొడఁగె. 71

చ. "అపహృతయౌట సీత, భర ♦ తాజ్ఞను రావణుతోడి పోరికై
నృపకుల చంద్రులార! ధర♦ణిన్ విధి తప్పక యేలుచుండియున్
గృప నిట కేగుదెంచితిరి ♦ క్షేమమ? పెద్దయుఁ గాలమాయె, మీ
రిపుడు స్వరాజ్య సీమలకు ♦ నేగఁదలంతురొ హర్ష చిత్తులై? 72

తే. మీ బలిమి కలుములె మాకు ♦ మేర లేని
ధైర్య మొనఁగూర్చె నెల్లెడ; ♦ దైత్యనాథుఁ
ద్రుంప నేను నిమిత్తమా ♦ త్రుండ; మనదు
ప్రేమ వల్లరు లీరీతి ♦ వృద్ధి యగుత" 72

కం. అనుడు నృపేంద్రునిఁగని కడు
మనముల హర్షంబునొంది, ♦ మానవ నాథుల్
వినయము జతఁగొను తమితోఁ
జనవుగఁ గీర్తించి రిట్లు ♦ సరసోక్తులతోన్. 74

చ. "అరులఁ బ్రచండ భండనము ♦ నందు గతాసులఁజేసి, వెండి నీ
పురమున కేగుదెంచితివి ♦ భూసుతఁ గూడి సురక్షితంబుగా

వరలుచు, మా యదృష్ట మిది ♦ పార్థివరామునిఁ గన్నులార మే
మరసితి మిన్నినాళ్ళకుఁ గ♦దా! చరితార్థుల మైతి మెంతయున్. 75

మ. భవదీయామృతదృక్కులన్ దనియు భూ ♦ పాలాగ్రణుల్, ధర్మముల్
జనదాటం దలపోయ లేరు, ప్రజకున్ ♦ సౌఖ్యంబుఁ జేకూర్చి భూ
ధవ! కీర్తిం గడియింపఁ జూచెదరు, స ♦ ద్ధర్మార్థ కామంబులం
దెవరైనన్ నినుఁబట్టి పోయెదరు, వే ♦ రేదారియున్ ద్రొక్కకే. 76

తే. నిన్ను సన్నుతిఁ జేయంగ ♦ నేర మయ్య!
ఆత్మలోఁ గొల్తు మయ్య! ని ♦ న్ననవరతము
సర్వదా నీవె మమ్ముల ♦ సాకుమయ్య!
సెల వొసంగుము పోయి వ ♦ చ్చెద" మటంచు. 77

తే. రాజమర్యాద లొంది రా ♦ రాజు వలనఁ,
దాము తమలోన రామునిఁ ♦ దలఁచుకొనుచు,
నవని యద్రువంగ సకల సై ♦ న్యములఁ గూడి
పుడమి పతులెల్ల నిజపురం ♦ బులకుఁ జనిరి. 78

మ. "సురవైరిం గనఁజాల మైతిమి గదా! ♦ చోద్యంబుగా వైరితోఁ
బరిమీఁదంబడి పోర నెంచితిమి, త ♦ ద్భాగ్యంబు వమ్మయ్యెఁబో,
భరతుండుం బిలు పొందఁడాయె నసుర ♦ వ్రాతంబుఁ జెండాడ, దా
శరథీ! నీ కిదిచెల్లు"నంచుఁ దమలో ♦ సైన్యాళి భాషించెడిన్. 79

తే. తోడుగాఁబోయి, రాజుల ♦ వీడి, తిరిగి
భరత శత్రుఘ్న లక్ష్మణుల్ ♦ వచ్చి, తాము
పొంది యుండిన కాన్కల ♦ భూపున కిడి,
తెలియఁగాఁ జేసి రవ్వాని ♦ తెఱఁగు లెల్ల. 80

ఉ. అందము చందముం గల గ ♦ జాశ్వ రథంబులు, దాస దాసికా
బృందము, లాణిముత్తియపు ♦ బేరులు, కాంచనరత్న భూషలున్
వందలు గాఁగఁ దమ్ములు స ♦ భాస్థలి నిచ్చిరి, సార్వభౌముఁ డా
నందముతో గ్రహించె, నర♦నాథుల భక్తికి నాత్మ మెచ్చుచున్. 81

## రాముఁడు సుగ్రీవాదుల బహూకరించుట

ఉ. రాజ కులావతంసుఁడు, వి ♦ రాజిత భూషణ కాంతిమంతుఁ డ
వ్యాజ కృపాంతరంగుఁడు, ప్ర ♦ భాకరపుత్రకుఁ బిల్చి యిచ్చె వి
భ్రాజిత దివ్య భూషణము; ♦ రాక్షసనాథునిఁ జీరి, కాన్కలన్
రాజిలు రత్నహార మిడి ♦ రంజితు జేసె సుధామయోక్తులన్ 82

తే. తక్కఁగల యుపాయనములఁ ♦ దనివి దీరఁ,
గపులకును, రాక్షసాళికి ♦ గారవమున
రాఘవుం డిచ్చె, వారలు ♦ ప్రమద మొంది
యొడలఁ దాల్చిరి, తమ నైజ ♦ మొప్ప గతుల. 83

చ. విడువఁగఁ జాలఁడాయె రఘు ♦ వీరుఁడు వానరయోధముఖ్యులన్
వడివడి వాలి పుత్రకుని ♦ వాయుసుతున్ దరిఁ జేరఁ దీయుచుం,
దడవొనరింపకుండ సుమ ♦ నంబునఁ గౌఁగిట గ్రుచ్చిగ్రుచ్చి, మై
తొడవులఁ దీసి, మోద భరి♦తుండయి, వారి నలంకరించుచున్. 84

చ. ఇతఁడు త్వదీయపుత్రకుఁ డ ♦ హీనబలాఢ్యుఁడు నాదు ప్రేమకున్
జతపడినాఁడు, వాయుజుఁ డ♦ సన్నిభ మిత్రుఁడు నీకు; నాకొ మేల్
హితుఁడు, సుభూషణావళుల ♦ నిచ్చుట కర్హులు వీరలంచు, భూ
పతి కపినేతతో ననె, స ♦ భాస్థలి వానరు లుత్సహింపఁగన్. 85

తే. అంత సంతృప్తిఁ గనఁజాలఁ ♦ డా నృపుండు
మరువఁ డొక్కరు, నావన ♦ చరుల యందు
వీరులను, శూరులను, బాల ♦ వృద్ధ కపులఁ
బేరు పేరునఁ బిల్చుచుఁ ♦ బ్రియముఁ బల్కె. 86

ఆ. సఖులు మీరు నాకు, ♦ సర్వ కాలంబును
మరువఁ జాల మిమ్ము ♦ మమతఁ దగిలి,
మీ శరీర చయము ♦ నా శరీరమె సుడి
మీరు, నేను, వేఱు ♦ వేఱు గాము. 87

తే. అని కృతజ్ఞతఁ దెల్పెడి ♦ యవని విభునిఁ
గూడి, వనచరాళియు దైత్య ♦ కులము వారు
గడపి యుండిరి వత్సర ♦ కాల మెల్ల
ఖేదమను మాట మఱచి సా ♦ కేత మందు. 88

చం. వనచర రాక్షసాది పరి ♦ వారము, హాయిగ మెక్కి నిక్కుచు
న్దినములు పుచ్చుచున్నతఱి, ♦ నిచ్చలు వారల రాజ్యపాలనన్
మనమున నెంచుచుండి, రఘు♦మాన్యుడు కొండొక మంచినాఁడు సూ
ర్యుని సుతుఁ బిల్చి, పోఁదలఁతు♦వోయి! స్వరాజ్యము నేలఁగానన్. 89

చ. అవిరళ విస్ఫులింగ నివ ♦ హాంతర సంస్థితి కుద్ధి యైన యీ
భువి పరిపాలనంబు బుధ ♦ పోషణ దుష్టవిదారణ క్రియా
వివశతఁ జిక్కి చేయుచు, న♦భేద్యముగాఁ బుర ముంచు, మంత్రులన్
భవ దభివృద్ధినే తలఁచు ♦ వారలఁ జేర్పుము, భాస్కరాత్మజా! 90

తే. వీర లందఱుఁ దలఁప నీ ♦ వారె కారు,
నాకుఁ గడుఁ గూర్చు వారలు; ♦ నీకు హితులు;
అంగదుని, వాయుసూనుని ♦ నమితబలుని,
నలుని, నీలు, సుషేణ మైం ♦ ద గజ గవయు 91

లను, గవాక్ష కుముదులను, ♦ గనుము వీరి.
నేను బ్రత్యుపకృతి సేయ ♦ నేర నెపుడు,
వారి ఋణమందుఁ బడి యుండు ♦ వాఁడ నిజము,
ప్రియుఁడ నై యుండు, వారి క ♦ ప్రియము వలదు. 92

శా. అంచున్, రాఘవుఁ డంతఁ గీశపతి నా♦హ్లాదంబునన్ మెచ్చి, యా
పంచన్ గాంచి విభీషణున్, బుధనుతా! ♦ వర్జించి దుర్నీతి, నీ
వెంచన్ రాజ్యము సేయఁగాఁ దగును, ము♦న్నీ లంక, శ్రీదుండు పా
లించెన్, నేఁటికి నీకు నే నిడితి సు♦శ్లీలంబు, పాలింపుమా! 93

ఆ. ధర్మ నియతి తోడ ♦ ధారుణీపతి యుండు
రాజ్య మందు లేదు, ♦ రాదు కఱవు,

సర్వ కాల మందు ♦ సకల సంపత్తులు
ప్రభవ మొందు చుండు ♦ రాక్షసేంద్ర! 94

ఆ. మఱచి పోకు మయ్య ♦ మమ్మిద్దఱను నీవు
తరణి సుతుఁడు నేనుఁ ♦ దలఁచు చుండు
మని వచించి, లంక ♦ కా విభీషణుఁ బంపి,
పవన సూనుఁ బిలిచి ♦ పలికె నిట్లు: 95

ఉ. పావని! తావకీన గుణ ♦ వర్గము నిస్తుల మీ ధరాస్థలిన్
నీ విమలాత్మ సద్గుణుని ♦ నెయ్యముఁ జూపి భవాబ్ధి నీదఁగా
నావగ నుండుఁ బ్రాణులకు ♦ నమ్మి నినున్ భజియించుచున్నచో,
జీవులు భక్తియోగమున ♦ సిద్ధినిఁ బొందరొ ? ముక్తిఁజెందరో! 96

ద్వి. అని రాఘవుం డన ♦ నంజనా సుతుఁడు
తను వెల్లఁ బులకింప ♦ దశరథాత్మజుని
పాదంబులను వ్రాలి ♦ భజియించె నిట్లు
మోదంబు భక్తియు ♦ మూర్తిభవింప. 97

సీ. దండంబు దశరథ ♦ ధాత్రీశ వరపుత్ర!
దండంబు పూత సీ ♦ తా కళత్ర!
దండంబు నిరుపమ ♦ త్యాగార్చ్య నాధార!
దండంబు శాశ్వత ♦ ధర్మ వీర!
దండంబు దుర్మార్గ ♦ దానవ సంహార!
దండంబు ముని హృదం ♦ తర విహార!
దండంబు సంతత ♦ ధర్మపాలన సక్త!
దండంబు నిత్య స ♦ త్య ప్రవక్త!

తే. దండ మాశ్రిత రక్షణో ♦ ద్యత్కరుండ!
దండ మార్తి నివారణ ♦ ధార్మికుండ!
దండ మవ్యాజ కరుణామృ ♦ త ప్రదుండ!
దండ మాద్యంత రహిత! ని ♦ త్య ప్రభుండ! 98

కం. సత్య పరాక్రమ రామా!
నిత్యము జపియించు చుందు ♦ నీ నామం బీ
సత్యం బెఱుఁగని నోట, న
కృత్యంబా? త్వత్పవిత్ర ♦ కీర్తికిఁ జెఱుపా ? 99

కం. పావన మగు నీ మృదు తను
వే వరలును నాదు కనుల ♦ యెదుటన్ సతమున్,
దేవా ! కసిగందదు కద !
నా వికృత తదేక వీక్ష ♦ ణంబుల వలనన్. 100

ఉ. నీ సుకుమార కోమల వి ♦ నిర్మల పాదము లస్మదీయ హృ
ద్వ్యాసము నొందఁజేయుదు ని ♦ తాంతము మత్కృతపాప *పంకిలం
బేసహవాసమున్ సలుపు ♦ దేమొ యటన్? భవదీయ పాదముల్
వాసి గడింపవో? పతిత ♦ పావనముల్ గద! శుద్ధి వీడునే! 101

కం. నీవే నారాయణుఁడవు
నీవే మూర్తిత్రయంబు ♦ నియమించు విరాడ్
దేవుండవు నీవే స్వే
చ్ఛావిధి నవతార మెత్తు ♦ చతురుఁడ విలలో. 102

తే. అనుప మానంద సంధాత ♦ వైన నీదు
విమల వర్తన కీర్తన ♦ వెలయుఁగాక,
మహిత శ్రీరామ తారక ♦ మంత్ర మిలను
జపముసేయంగఁ దనువున్నఁ ♦ జాలు నాకు. 103

మ. దివియో భూమియొ ఘోరమౌ నరకమో ♦ దేనిన్ బ్రసాదించినన్
భవదీయేచ్ఛ నటన్ వసించెదఁ దమిన్ ♦ భక్తప్రియా ! "జానకీ
ధవ! రామా! రఘురామ! రామ!" యను నిత్యధ్యానచిత్తంబె రా
ఘవ! యిమ్మా యెటనున్న నయ్యదియె నాకంబౌను నీ సంస్మృతిన్.

* పాఠాంతరము : పంకపందేసుమి

సీ. శ్రీరామ నీనామ ♦ పారాయణము సేయ
దురిత జాలంబులు ♦ తొలఁగి పోవు
శ్రీరామ నీనామ ♦ పారాయణము సేయ
భవ బంధముల్ తెగి ♦ పారి పోవు
శ్రీరామ నీనామ ♦ పారాయణము సేయ
ప్రారబ్ధ కర్మముల్ ♦ రాలి పోవు
శ్రీరామ నీనామ ♦ పారాయణము సేయ
నాత్మ వంచన కర్మ ♦ మాగిపోవు

తే. అమల శ్రీరామనామ గా ♦ నామృతంబె
జన్మముల డస్సి డస్సి సం ♦ సార యాత్రఁ
దీవ్రతర బాధలకుఁ జిక్కి ♦ తేల నట్టి
కష్ట జీవుల యలపుఁ బో ♦ కార్చ నోపు. 105

సీ. స మా లి క :

"జనక ధాత్రీజాని ♦ సభ రుద్ర ధను వెత్తి
త్రుంచిన మేటి య ♦ ద్భుత రసంబు
కమనీయ వసుమతీ ♦ కన్యకా మృదు పాణి
గ్రహియించి తన్పు శృం ♦ గార రసము
రాజ్య భోగము వీడి ♦ రమణితో వని కేగఁ
గల్గిన నాఁటి యా ♦ కరుణ రసము
ఖరదూషణాది రా ♦ క్షస వర్గ సంహార
రణరంగ విస్ఫుట ♦ రౌద్ర రసము
మునిబృందములఁ జేరి ♦ మ్రొక్కుచు నవ్వారి
భద్రంబె యెంచు స ♦ ద్భక్తి రసము
రహిమించి మోహించి ♦ రాక్షసాంగన రాగ
అలనాఁడు చూపిన ♦ హాస్యరసము
స్రుక్కించి వాలిని ♦ సుగ్రీవు దరిఁజేర్చి
నెరపిన సుఖకర ♦ స్నేహ రసము

జగదేక రాజువై ♦ జలధి యొడ్డున దర్భ
శయనంబుఁ బూనిన ♦ శాంత రసము
భయద గంభీరోగ్ర ♦ వారాసి నింకింప
వి ల్లెత్తి పట్టిన ♦ వీర రసము
కాలానల సదృక్ష ♦ మూలబలాశేష
పాటన స్ఫురిత బీ ♦ భత్స రసము
దశకంఠ కంఠ వి ♦ దార ణాయోధన
ప్రకటి తోద్ధత భయా ♦ నక రసమ్ము
భవదీయ పాద సే ♦ వా రక్తుఁడైన కీ
శవాత్యు నెడల వా ♦ త్సల్య రసము

తే. నీవ గాక మ తెవ్వరు ♦ నెరపఁ గలరు !
సర్వరసధామ ! జగదేక ♦ సార్వభౌమ !
సత్కళామూర్తి! శ్రీరామ ♦ చంద్రమూర్తి!
అఖిల పద నిత్య వర్తి! తు ♦ భ్యం నమోస్తు !" 106

క. అనుచున్ భక్తిని పొంగుచు
హనుమంతుఁడు వినుతి సేయ ♦ నాశ్రిత భక్తుం
డనిలజు వెన్నునఁ దట్టియుఁ
దని వోవక కౌఁగిలించి ♦ తమిమైఁ బల్కెన్. 107

మ. అనఘా ! నీవు పరోపకారి వయి నా ♦ యం దెంతయో భక్తి నా
పను లెల్లన్ నెరవేర్చియుంటివి గదా ♦ భావింతు నీ పేర్మి నే
ననయంబున్; మను దీవు నా చరిత ♦ మార్యావర్త భూమండలిన్
మను నందాఁక; త్వదీయ జీవిత మసా ♦ మాన్యంబుగా వర్థిలున్.

చ. ఉపకృతి నొందినట్టి బుధు ♦ లుండియుఁ బ్రత్యుపకార బుద్ధిమై
నెపు డుపకార మూన లభి ♦ యించునొ వీ లని మాత్ర మెప్పుడున్
గపివర ! యెంచరాదు, కోఱ ♦ గామి తలంపది, దానికంటె వే
రపకృతి లేదు; కష్టగతు ♦ లై సఖు లుండఁ దలంపె, యద్దియా.10

చ. అని తన కంఠ సీమను వి ♦ హారము సల్పెడి రత్నహార, మా
యనిల తనూజు కంఠమున ♦ నందముగా వెలుఁగొంద నైచి, యా
తని ముఖబింబముం గని, ము ♦ దంబెసఁగన్ జనకాత్మజా ప్రియుం
డనుపమ రాగపూర్ణ హృద♦యాంబుధి మున్గియుఁ దేలె నెట్టులో 110

తే. మాల దీపింప మెడఁ బవ ♦ మాన సుతుఁడు
భానుమండలమో యనఁ ♦ బరఁగఁ దొడఁగి,
భూసుతాధవు నాశీస్సుఁ ♦ బొంది యుంట
నతి వినూత్న తేజో మయుం ♦ డయ్యె నంత. 111

తే. నృప కులోత్తము దరిఁ జేరి ♦ కపులు వంగి,
పదములకు మ్రొక్కి, మ్రొక్కుచు ♦ వదల లేక
వదలి శ్రీరాము జనరాముఁ ♦ బయన మైరి,
హృదయములు నిల్పి సీతా స ♦ తీశు నందు. 112

తే. భానుజుఁడు, విభీషణుండును ♦ బట్టరాని
ఖేదమును బొంది శ్రీరాము ♦ పాదయుగళి
నశ్రు ధారలఁ గడిగి ర ♦ త్యమిత భక్తి,
వెడలి చని రంతఁ గపి తతి ♦ వెంట రాఁగ. 113

తే. "రామ జయరామ శ్రీరామ ♦ రామ" యంచుఁ
గరములను జేర్చి, భక్తి త ♦ త్పరత మున్గి
భజన సేయుచుఁ జన సాగె ♦ వాయు సుతుఁడు,
కపులు కెరలుచు దారిలో ♦ గంతు లిడఁగ. 114

ఉ. అందఱి నర్హమౌ గతుల ♦ నంపె నృపుండు బహూకరించి, వా
రందఱుఁ బోవుపట్లఁ గన ♦ నయ్యెడు నాత్మ పరాత్మఁ బాయునా
చంద మొకింత, యంత రవి ♦ చయ్యన నెత్తికి వచ్చినిల్చె, నా
నందముతోడ రాఘవుఁడు ♦ నాఁడు సభన్ ముగియించె నంతటన్

తే. మరలి, ధననాథు డంపుట ♦ మహీపు కడకుఁ
బుష్పక విమానరాజ మా ♦ పూట వచ్చి

గగనతల మందు నిల్చి, భూ ♦ కాంతుఁ బిల్చి,
కైకొనఁగ వేఁడెఁ దన్ను లో ♦ కంబు వినఁగ: 116

తే. "రావణాసుర సంహార! ♦ రామ! నీవె
యర్హుఁడవు న న్నధిష్ఠింప ♦ నంచు మరలఁ
బంపినాఁడు కుబేరుండు ♦ ప్రమద మతిని,
గాన్కగా స్వీకరింపుము ♦ కరుణ నన్ను. 117

తే. ఏరికిని గాని కనరాక ♦ స్వేచ్ఛ తోడఁ
దిరుగఁ గలదాన, నీయాన ♦ వరలు దాన"
నంచు, బలుకంగఁ బుష్పక, ♦ మపుడు నృపుఁడు
పూజ సలిపెను స్వాగత ♦ పూర్వకముగ. 118

చ. పని గల కాలమందు, నిను ♦ భావనఁ జేసెద పుష్పకంబ! వెం
టనె చనుదెంచుచుండుము హు ♦ టాహుటినప్పుడ, యంతదాఁక నే
జనులకుఁ గాని హాని యప ♦ చారము నడ్డును లేక యాకసం
బున విహరించుచుండు మనె♦భూపతి, పుష్పక మేగె నంతటన్. 119

ఆ. ధర్మ నియతి తోడఁ ♦ గర్మ పరుండౌచు
రామ నృపతి యిట్లు ♦ రాజ్య మేలఁ,
గాలమాన మెంచఁ ♦ గ్రమము దప్పక యుండు
గతుల మీర లేవు ♦ ఋతువు లెపుడు. 120

తే. బంధు మిత్రుల వీడ్కొల్పి ♦ పార్థివుండు
కౌతుకము హెచ్చ జానకీ ♦ కాంత మెచ్చ,
అతి మనోహరమైన యు ♦ ద్యాన వనము
గనుచు నొకయింత విహరింపఁ ♦ గాఁ దలంచె. 121

సీతా రాముల విహారము

వివిధానేక లతా నికుంజ ఫల పు ♦ ష్పోజాత సంయుక్తమున్,
నవ నానాకుల పక్షి సంకులము, సం ♦ ధ్యారాగ హేమాంబు సం
భవ ఫుల్లోత్పల పద్మ సంకలిత శో ♦ భాపూర్ణ కాసార వ
ర్గ వరిష్ఠంబుగ నొప్పు తోఁట కరిగెన్ ♦ రామయ్య సీతమ్మతోన్.

చ. కలకలలాడు పక్కిగమి, ♦ కానన మందుఁ బ్రవాహ వాహినీ
సలిల తరంగడోలలఁ బ ♦ సందుగ నూఁగుచుఁ దేలియాడుచున్
మెలఁగుట, రాజదంపతు, ల ♦ మేయముదంబునఁ జూచిచూచి, యీ
వలపుల నెట్లు నేర్చినవి ♦ పక్షు లటంచుఁ దలంత్రు వేడుకన్. 123

సీ. ఒండొంటి నెడబాయ ♦ నొల్లని మిథునంబుఁ
గనుచుండి మోదంబుఁ ♦ గాంచు వారు,
ఒకదాని ముక్కునం ♦ దొకటి మేఁతను బెట్టు
కవఁగాంచి మోదంబుఁ ♦ గాంచు వారు,
ఒంటి రాకకు మఱి ♦ యొండు వేచిన జంటఁ
గనఁ జాలి మోదంబుఁ ♦ గాంచు వారు,
లతల యుయ్యాలలన్ ♦ జత నూఁగు యుగళంబుఁ
గన నోఁచి మోదంబు ♦ గాంచు వారు.

తే. అచటి పక్షుల నీరీతి ♦ నహరహంబు
గనుచు, ననురాగ లహరిలో ♦ మునిఁగి మునిఁగి
తేలి, విహరించుచుండిరి ♦ లీల వారు
రాజ దంపతు లావన ♦ రాజి లోన. 124

ఉ. శ్రీరఘురాముఁడున్ సతియు ♦ శ్రీశుఁడు లక్ష్మియుఁబోలె నిత్యమున్
వారని ప్రేమచంద్రికల ♦ వర్ధిల సాగిరి, లోక రీతి సం
సార సుఖంబునన్ గుసుమ ♦ సాయకు పోకల నారి తేరుచుం,
గోరిక లూని మీర తరు ♦ గుల్మ లతా సుమ మైత్రిఁ బొందుచున్. 125

సీ. జీవాత్మ పరమాత్మఁ ♦ జేరెడి చందంబు
సీతమ్మ రామునిఁ ♦ జేరు చుండు
పరమాత్మ జీవాత్మ ♦ పైఁ బ్రేమఁ గనుగతి
రాముండు జానకీ ♦ రామఁ గూడు
జీవుండు దేవుండు ♦ జేరి యేకం బైన
పగిది శ్రీరామ దాం ♦ పత్యముండు

పాంచ భౌతిక శక్తి ♦ వశమె లోకంబనఁగ
జానకీరామ సం ♦ సర్గ ముండు

తే. తనువు తనువునఁ బెనగొనఁ ♦ దనివి తీర
మదియు మదిలోనఁ గలియంగ ♦ మమత తోడ
ప్రేమ రూపంబుఁ దాల్చిన ♦ విధము తోఁప
మెఱుగు చుండెను శ్రీరామ ♦ మిథున మందు. 126

తే. విడి వడుటఁ జాల నాళ్ళుగ, ♦ వీడుఁ జేరి
తేని పనిఁజేయఁ దోడ్తోడఁ ♦ బూని యుంట,
సీతతోఁగూడి, వలపుల ♦ చెయిదు లూన,
వలయు తీరిక మున్ను ల ♦ భ్యంబు గాదొ ! 127

తే. కాల గర్భంబునందేమి ♦ కలదొ ! వారు
ముద్దు ముచ్చట లంతతో ♦ ముగియు రీతి
ననుభవించిరి, కేళీ వి ♦ హార మెల్ల
ధారుణీ పుత్రి గర్భంబుఁ ♦ దాల్చు వరకు. 128

ఆ. రామ నృప వరుండు ♦ రాజిల్లి యీ గతి
నాకు రాలు కాల ♦ మరుగు నంత
సఖినిఁ గూడి వెడలె ♦ సాకేత నగరికి
ధాత్రిఁ దోఁచుచుండఁ ♦ దరుణ శోభ. 129

ఆ. పూర్వ దినము నందు ♦ భూమీశు కర్మల
నేర్పు మీర విభుఁడు ♦ నెఱపు చుండి
యంతిపురముఁ జేరు ♦ నపరాహ్ణ మందునఁ
బొలతిఁ గూడి వలపు ♦ గులుకు లొలుక. 130

తే. ప్రొద్దు పొడచుట తడవుగఁ ♦ బూత సీత
యత్తలకు సేవ సల్పు ని ♦ త్యమ్ము భక్తి,
విధులఁ బూర్వాహ్ణమునఁ దీర్చి ♦ విహిత రీతి
జీవితేశుని పరిచర్యఁ ♦ జేయుఁ బిదప. 131

తే. మారినది యామె రూపంబు, ♦ మగువమిన్న
యొడలు బరువెక్కె మెల్లన ♦ నకుగు లిడుచు,
కొను కంపించుటయె కాదు ♦ గర్భవతికి
వదన మందున సరి క్రొత్త ♦ వన్నెదోఁచె. 132

తే. వంశ వర్ధన మైన గ ♦ ర్భంబుఁ దాల్చి
నే సతిని భర్త మన్నించి, ♦ యేలఁడొక్కొ ?
పూని ప్రేముడిఁ జూపించు ♦ భూమి సుతకు
సరస మృదుసూక్తి రాఘవ ♦ చక్రవర్తి. 133

ఉ. కొండొకనాఁడు సీత పతి ♦ కోమల పాదము లొత్తువేళ, భూ
మండల మేలు నాథుఁ డస ♦ మానుడు, ప్రేయసిపైఁ బ్రసన్నుఁడై
"అండజయాన! కోర్కె లుద ♦ యంబగు తీరు ఘటించెఁ జిత్తమం
దొండు తలంపు పుట్టునెడ♦నొప్పుగఁదీర్చెదఁదెల్పుమా"యనెన్. 134

ఉ. అందము చిందులాడు వద ♦ నాబ్జము గన్గవ విందు సేయఁగా,
సుందరి లోకనాయకుని ♦ చొప్పు గణించి, విశుద్ధజాహ్నవిన్
బొంది, దినంబ యేనియు త ♦ పోవన మందుఁ జరించి, పూజచే
నందలి మానులం దనుప ♦ నయ్యెడు, కోరికఁదెల్పె నాథుతోన్. 135

తే. రాజమార్తాండుఁడగు రఘు ♦ రామ విభుని
భూమిసుత జానకీసతి ♦ పుణ్యచరిత
కోరు వరమెంత సుంతయో!♦కోరినంత
"నల్లె" యని పల్కె నిక్ష్వాకు ♦ వంశ నృపుఁడు. 136

తే. కాని మానస మేలొకో ♦ కలవర పడి,
మానము వహించి త్రుటిమాత్ర, ♦ మాటలాడఁ
బ్రభువు చెలికాండ్రతోఁ గూడె, ♦ వరము లిచ్చి
వ్యసన మొందుట యిక్ష్వాకు ♦ వంశ విధమొ ! 137

## ఆశ్వాసాంత పద్యములు

శా. రామా! తావక నామసంస్మరణ ధీ ♦ రస్నిగ్ధ చిత్తుండనై,
"రామా!రామ!"యటంచు రేయిఁ బవలున్♦రాపాడ,నోరార, రా

దేవరా! మామక కార్యసిద్ధిఁ గన వే ♦ మిా? కావుమిా! సద్గుణో
ద్ధామా! మానవమానసోరమణ! యా ♦ర్తత్రాణ దీక్షాపరా! 139

చ. అపహృత పాప కర్మచయ ♦ మార్తి నివారణ శక్తి మంతముల్
తపసుల ముక్తి సాధనము ♦ తారకమంత్రము, మంత్ర రాజమం
చెప్ప వెడ నిల్పి చొచ్చితిఁ బ♦ రేశ్వర! "శ్రీరఘురామరామ"యన్
జపమునఁ, బ్రోవరాదొకో? యు ♦ సాధ్యమె? రాజకులావతంసమా!

శా. మంత్రార్థంబుఁ జపప్రయోజనము సం ♦ భావింపఁబోన్, నాఁడు నీ
మంత్రంబున్ జపియింపసాగిన దినం ♦ బందున్, మదీయాత్మ నా
సంత్రాసోత్సవ సక్తబాల్యమున నా ♦ శల్ లేవు, నేఁడే భవ
న్మంత్రార్థంబును గోరుచుంటిఁగద! రా ♦ మా! వే ప్రసాదింపవా?

చం. పదపడి నిశ్చయించి నను ♦ వారక నిన్ భజియింప సాగి; నీ
కరుణ లభించె నొక్కొ? కొఱ♦గామిగ నిష్ఫలమయ్యెనొక్కొ? నే
నడుగను: నేఁటి దాఁక నొక ♦ డైన వరంబును గోర లేదు, నేఁ
డరమర విడి వేఁడికొన ♦ నార్తశరణ్య! యనుగ్రహింపవా? 141

ఉ. మైరణ సేయలేని యప ♦ చారము సేసితి నొక్కొ? రామ! నా
నేరమదేమొ తెల్పుమిఁక ♦ నేరక చేసితినో, భవత్కృపా
నారి దొలంగఁ గోలికలఁ ♦ బాటల నాటల నూఁచి యూఁచి, సం
హారముఁ జేయనైతివి మ ♦ దార్తిని! భ్రష్టవివేకుఁ గావవే! 142

ఉ. కష్టము కొన్ని పొంది, సుఖ ♦ కాలము పిమ్మట వచ్చినంత, నా
కష్ట దినమ్ములన్ మఱచి ♦ తో! పరితప్త జనోక్త నిష్ఠురా
విష్టమతిన్ వలంప వొకొ! ♦ విశ్వపితా! గుణరామ! వారిపై
దృష్టి మరల్పు, కాలమొక ♦ తీరున మాత్రమె సాగ దేరికిన్. 143

విహారాశ్వాసము—సంపూర్ణము



ఓమ్

శ్రీరామాయనమః

# గోవింద రామాయణము

## ఉత్తర రామ చరితము

## వియోగాశ్వాసము 2

క. కర్మము దప్పునె జీవికిఁ?
గర్మము సుఖ దుఃఖయోగ ♦ కారణ మెపు, డా
కర్మము కామ్యగతంబగు
మర్మముతోఁ గూడు నెడల ♦ మనుజాధీశా 1

రాముఁడు కొలువుండుట

మ. ధరణీరాజ్యము నేలు రాఘవుఁడు, మం ♦ త్రాంగంబుగా వేగులన్
బుర వీధుల్ దిరుగాడ గూఢముగఁ బం ♦ పున్, వారు లేరీతిగా
సిరియున్ సంపద ధర్మమున్ గలిగి, తన్ ♦ సేవింతురో; యాత్మలం
దు రవంతేనియు ద్వేషముం గనక యుం ♦ ద్రో; యన్న
వార్తల్ విన్న. 2

మ. చెలువొప్పన్ బహురత్నమేదుర మహా ♦ సింహాసనాసీనుఁడై,
విలసత్కాంచన భూషణోజ్జ్వలుఁడు పృ ♦ థ్వీశుండు గొల్వుండు ని
చ్చలు, మంత్రుల్ భటవర్గముల్గొలువఁగాఁ♦జారౌఘముల్ భద్రుఁడున్
దెలుపన్ వార్తలు చాటువుల్ వినుచు ధా♦త్రీ పాలనా క్షేమమున్.

తే. జానకీదేవి పీడి వి ♦ చార మతిని
మధ్యకక్ష్యాంతరము నందు ♦ మహానధనుఁడు

సహచరులఁగూడి, మేలము ♦ సలుపు చుండి,
హాస్యరస గాథలన్ విని ♦ యంతలోన.

ఉ. భద్రుని జేరి రాఘవుఁడు ♦ వల్కెఁ "ప్రజా పరిపాలనంబునన్
భద్రమె సత్యధర్మములు? ♦ పౌరులు రాజ కుటుంబమెంచి, యే
ఛిద్రముగాని లోఁదలంచి ♦ చింతిల కుందురె? రామరాజుపై
విద్రవ మెవ్వరైనఁ దల ♦ పెట్టుదురే ? వచియింపు సర్వమున్"

చ. అన విని, భద్రుఁడాడె విన ♦ యమ్మున "రామ! త్వదీయపాలనం
బునఁ, బ్రజ సత్యధర్మ పథ ♦ ముల్ విడనాడక, సంచరించుచున్
ధనము యశమ్ము సంపద ప ♦ దార్థములున్ దగఁగల్గి జన్మ పా
వన సుఖ జీవమున్ బడసి ♦ వర్ధిలుచుండు, నిరంతరమ్ముగన్.

చ. జనకుని వాక్యపాలనము ♦ సల్పఁగ, రాజ్యము భాగ్యభోగ్యముల్
జనపదముల్ త్యజించి, సతి ♦ జానకితో వనవాసమంట, సీ
తను బలిమిన్ హరింగొనిన ♦ దైత్యులఁజేని శిరంబు నాజిలో
దునుముట కీర్తిపాత్రములు, ♦ స్తుత్యుఁడ వైతివి-గాని దేవరా!"

తే. అంచు, భద్రుండు హృదయమ్ము ♦ నలముకొనిన
చింత మఱి మాటఁబల్కఁడు ♦ చేష్ట లుడిగి,
రాజ రాజేంద్రుఁ డా రఘు ♦ రామమూర్తి
వంతఁ జెందెడి భద్రుని ♦ వదన మరసి.

తే. "విన్నయది విన్న కెతిగ, ♦ విశదపఱుపఁ
దనువు కంపింప నేల? భ ♦ ద్రా! స్వరంబు
కుంటువడ నేల? హృదయానఁ ♦ గుంద నేల ?
తేజుడుఁగ నేల ముఖమందుఁ? ♦ దెలుపవేల ?

తే. భయమునడ నేల ? పౌరుల ♦ భావ మరసి
తెలుపుటయె నీదు సద్విధి, ♦ తెలిసికొంచుఁ
బ్రజకు సుఖదాయకంబగు ♦ పాలనంబు
సలుపుటయె నాదు ధర్మంబు, ♦ తెలుపు మెల్ల."

## భద్రుఁడు లోకాపవాదము దెలుపుట

తే. అనెడి, రామాజ్ఞ విని భద్రుఁ ♦ డాడఁదొడఁగెఁ,
జేతులను మోడ్చి, చిత్తంబుఁ ♦ జేరఁ దీసి,
విపణిశాలల సావిళ్ళ ♦ వీధులందు
జనము వలికిన మాటల ♦ వినిన రీతి. 11

మ. "పెఱవాఁ డాతఁడు, దుష్టుఁడున్, ♦బలిమిచేఁ బ్రేమించి కొంపోయె గ్రొ
మ్మెఱుగుల్ గల్గిన సుందరాంగి ♦ నబలన్ మీనాక్షి, నాలంకఁ జూ
పఱు లేరుం గనఁ జాలనట్లునిచె, సీ! ♦ ప్రాల్మాలి రాముండు సుం
దరిపై మోహము వీడలేక, తనవెం ♦ టన్ దెచ్చె నిల్లాలిగా. 12

ఉ. కొంచెముగాని, రాఘవుఁడుఁ ♦ గూడ నసహ్యతఁజెందఁడొక్కొ?కా
మించెఁ బరాంక వర్తినిని ♦ మేటిమగండు నరేంద్రుఁడయ్యు, నే
పంచలఁబట్టి యుండినను ♦ బత్నియెడన్ మమకారమున్న, రా
వించుట పాడియే? యనుచు ♦ విందుము లోకుల మాట దేవరా! 13

తే. 'మహిని రాజానుమతమె ధ ♦ ర్మంబు గాన,
రాఘవుఁడు సల్పు పనులె ధ ♦ ర్మములు గాఁగ
ననుసరింపఁ దలంపరో ♦ జను'లటంచుఁ
బౌరు లెద నెంచుచున్నారు ♦ ప్రభుని గూర్చి" 14

తే. అనెడి భద్రుని మాటల ♦ నాలకించి
చేష్టలను బాసెఁ, ద్రుటిమాత్ర ♦ చిన్నవోయె,
ననుపమానంద నిధియైన ♦ యతివఁ గూర్చి
ఱేఁడు దనయెడ నపనింద ♦ నేఁడె వినుట. 15

ఉ. నమ్మను భద్రువార్త, మఱి ♦ నమ్మఁగఁ జాలఁడు గొంతసేపు, ఱేఁ
డమ్మయి, డోలికాగతిని ♦ నాత్మ కలంగఁగసాగ, మిత్ర బృం
దమ్మును జూచు నొక్కట,ని ♦ దానముఖోఁ దలయూచుచుండు,స్వాం
తమ్మున దాఁచఁజూచుఁ బరి ♦ తాపము, జానకి కూర్మి నెంచుచున్.

ఉ. విన్న దనంబు నొందె, రఘు ♦ వీరుఁడు, కన్నుల నీరు నింపుచున్,
సన్నుత ధీరుఁడయ్యు నవి ♦ చార*మనో వశుఁడౌచు, నిత్య మా
పన్న శరణ్యుఁడయ్యు, హిత ♦ వర్గముఁగాంచి "నిజంబె? లోక మీ
తెన్నున నిందమోపు నొకొ? ♦ తెల్పుఁడు నా"కని కోరె మిత్రులన్.

చ. పొగులుమనంబుతోడ, నిజ♦మున్ దెలియన్ దమకించు రాముతో
వగచుచు మిత్రకోటి, పద ♦ పద్మములంటుచు "రామ! నీ పయిన్
జగతిని నింద పుట్టె నిది ♦ సత్య" మటంచు వినీతులై వచిం
పఁగ విని, సభ్యులన్ బనిచి,♦పార్థివ రాముఁడు నిశ్చితాత్ముఁడై. 18

కం. గుమ్మములోఁ గల బంటును
దమ్ములఁ బిలువంగఁ బనిచెఁ ♦ దడయక వాఁడున్
రమ్మను నరపతి యాహ్వా
నమ్మును దోడులకుఁ దెల్పె ♦ నత మస్తకుఁడై. 19

తే. వినిన తోడనె, సౌమిత్రి ♦ వెడలి చనియె
నన్న యానను భరతుండు ♦ నరిగె నపుడె
తడవు సేయఁడు కడగొట్టు ♦ తమ్ముఁడైన
నొడయుఁ గనఁజేరి రా మువ్వు ♦ రొక్కమారు. 20

## సోదర సమావేశము - రాముని యాన

ఉ. రాముని యానఁ దమ్ములు స ♦ రాసరి సౌధమునందుఁ జొచ్చి గా
రామున రాము పాదముల ♦ వ్రాలిరి, చేరి సుఖాసనంబులన్;
సోముని తీరునన్ వెలుఁగు ♦ సొంపటి యొంతయొ చిన్నబోవ నె
మ్మోమున ఖిన్నుఁడైన రఘు ♦ పుంగవుఁ జూచిరి, వేచి రాజ్ఞకై.

మ. అనుగుందమ్ములఁగాంచి "మీర లె♦సుమా! యాప్తాళియున్ బంధుగుల్
ధనమున్ రాజ్యము నాదు జీవిత సమ ♦ స్తంబున్, మదర్థంబు మీ
రనువర్తించుచుఁ గూర్తు రెంతయు ♦ మదీ యాభీప్సితం బెట్టి దే"
ననుచుం బల్కెను రామరాజు జన లో♦కారాధకుం డంతటన్. 22

* పాఠాంతరము : మనోవశుఁడయ్యె

ఉ. రాజ కుమారులార ! దిన♦రాజ కులోద్భవులార ! మీరు, "మా
రాజు వధూప్రియుండయి దు ♦ రాగతమున్ సహియించె"నంచు న
వ్యాజ మనీష జానకి ప్ర ♦ వర్తనపై నపదూఱు మోపుచున్
నా జనులాడు నింద విని ♦ నారె? యి దేగతి మాసి పోవునో ! 23

ఉ. రోఁత జనించె నెమ్మది; ని ♦ రూఢముఁగా బ్రజలాడు నింద నా
చేతము గ్రుచ్చె శూలగతిఁ, ♦ జిచ్చయి మేను దహించుచుండె, వి
ఖ్యాత కులంబునన్ జనన ♦ మందితి నే రఘువంశమందు, నా
సీత మహాత్ముఁడైన నృప♦సింహుఁడు మైథిలు నాత్మజాతయే. 24

ఉ. రావణరాజు, లక్ష్మణ ! ధ ♦ రాసుత నిర్జన వన్యభూమిఁ గొం
పోవుట వాని నేను దుద♦ముట్టఁగఁజేయనె లంకఁజొచ్చి? యే
భావము పుట్టెనో జనకు ♦ పట్టి యటన్ ననుఁజేరవచ్చుచో,
నీవ యెఱుంగు దెల్ల, నపు ♦ డే గద సీత ప్రవేశ మగ్నిలోన్. 25

చ. దినకరుఁడున్, నిశాకరుఁడు, ♦ దేవతలున్, బవనుండు, వహ్నియున్
మును పనవద్య సీత యని, ♦ మూఁడుజగంబులు మారుమ్రోయఁగా
ననరొకో ! లంకయందు జన ♦ కాత్మజ ప్రత్యయ మాచరించుటన్
మునుల సమక్షమందు సుర ♦ ముఖ్యుఁడు జానకి నప్పగింపఁడే! 26

ఉ. నీ కిదియెల్లఁ దెల్ల వ ♦ నీసుత శుద్ధ యటంచు నాత్మలో
నాకును రూఢియే, యటులు ♦ నమ్మిక సుస్థిర మౌ చేఁ గదా
గైకొని నాఁడ నాఁడు సుర ♦ కాండము సూడ; నయోధ్య కామెతో
రాక కనే కదా కతము ? ♦ రాగము కాదని నీవెఱుంగవే ? 27

ఉ. ఈ యపవాదుచేఁ బొగులు ♦ నీహృది, లోకము దూఱుచుండె, నే
నీ యపకీర్తి భారము వ ♦ హింపఁగ నోప, నకీర్తి గేయముల్
పాయక యేనిఁ గూర్చి ప్రజ ♦ పాడునొ ? వాఁడు దివంబుఁజేరఁ డీ
కాయముఁ ద్రెళ్ళఁ జొచ్చు నర♦కంబటనే నివసించు వాఁడగున్. 28

గీ. దేవతలు నిత్య మపకీర్తి ♦ నేవగింతు,
రవని నెల్లరు సుమహాత్ము ♦ లైన వారు

పూజ్యమగు కీర్తి నార్జింపఁ ♦ బూను చంద్రుఁ,
క్షితిపతియు నెప్డుఁ గీర్తిఁ గాం ♦ క్షింప వలయుఁ. 29

తే. ప్రాణముల నైన, మిమ్మైనఁ ♦ బాయఁ గలను
నేను కీర్తికై; యపకీర్తిఁ ♦ బూని యింక
జనకజను విడఁగా లేనొ? ♦ కనుఁడు నన్ను
శోక సాగర పతితు, య ♦ శో విహీను. 30

తే. భూమి నావంటి భూతంబు ♦ పుట్టలేదు,
చూడలే దింతవఱ కిట్టి ♦ శోక మగ్నుఁ,
గాలితులె తేనిప్పై నిందఁ ♦ బలుకు కంటె,
వేఱు దుఃఖంబు గలదె భూ ♦ విభున కెందు? 31

ఉ. ఆనతి యిద్ది! రేపె యుద ♦ యంబున, సారథిగా సుమంత్రునిం
బూని, రథమ్మునన్ జనక ♦ పుత్రికఁ దోడ్కొని పొమ్ము, వీడుమీ
కాననసీమలో, జనులఁ ♦ గానఁగ లేని ప్రదేశమం, దయో
ధ్యా నరనాథుఁ డేలు వసు ♦ ధాస్థలి హద్దులదాటి లక్ష్మణా! 32

తే. గంగ దాటిన దివ్యసం ♦ కాశ మగుచు
నమల తమసానదీతీర ♦ మందుఁ గలుగు
నాశ్రమస్థలి; యది సుమ ♦ హాత్ముఁడైన
వాల్మికుని వాడ, యా దఱి ♦ వదలి రమ్ము. 33

తే. వేగ పొ,మ్మింక మారాడ ♦ వీలు లేదు
సీతఁ గొనిపోయి విడనాడి ♦ శీఘ్రగతిని
రమ్ము సౌమిత్రి! నీకు శు ♦ భమ్ము గలుగు,
నన్న దాయువుపై నిది ♦ యాన సుమ్ము. 34

తే. అనుజులగు మీరు వేఱు మా ♦ టాడఁ దగదు
యోజనకుఁ బూనుటయె, మీ క ♦ యోగ్య మరయ,
నహితులని యెంతు మిమ్ము నా ♦ యభిమతమ్ము
నకు విఘాతకులైనచో ♦ వికల మతిని. 35

ఆ. అస్మదాజ్ఞ మీర ♦ లనుసరింతురయేని,
నాదు మాట వినుఁడు ♦ నా తలంపు
నెంచి, తోడ్కొనఁదగు ♦ నీక్షణంబున సీత
నామె కోర్కెఁగూడ ♦ నదియె సుండి. 36

తే. అతివ గంగాప్రవా హార్శి ♦ తాశ్రమాళిఁ
గనఁగఁ బ్రియమంచు మునుఁ దెల్పెఁ ♦ గాన, నామె
కోర్కెయునుఁ దీర్పఁగాఁదగుఁ ♦ గొదువ యేల?
త్వరపడుఁ" డటంచు దశరథ ♦ తనయుఁ డాడి. 37

తే. కన్నుఁగవ నుండి, యశ్రులు ♦ గారఁ దొడఁగి
చీఁకటులు గ్రమ్మఁ జూడ్కులు ♦ చెదరు చుండ
సోదరుల యూరడింపుల ♦ చొప్పు వినక
రామభూపతి నిజమంది ♦ రంబుఁ జొచ్చె. 38

ఉ. అన్నదలం పెఱింగి, వెత ♦ నా రఘురాముని సోదరత్రయం
బెన్నొ తెఱంగులన్ గలఁగి ♦ యేగిరి భూధవునాజ్ఞ నెంచుచున్,
గన్నులఁ గూర్కలేదు రఘు ♦ కాంతున, కా దురవస్థ యందు నే
తెన్నున శాంతి గల్గెడు స ♦ తీమణిఁ బాయగ నున్నవానికిన్! 39

సీ. అదె శకుంతంబు లా ♦ హారార్థ మరుగుచో
గగనంబు మార్మ్రోగు ♦ కలకలంబు
మళ్ళకేగెడి కాపు ♦ కాళ్ళకుఁ దొడిగెడి
కిఱ్ఱుచెప్పుల జోళ్ళ ♦ కిఱ్ఱు కిఱులు
లలి వాకిళుల నూడ్చి ♦ కలయంపి జల్లనా
కాంతల హస్త కం ♦ కణ రవంబు
ఆఁకలి గొన్న లే ♦ యావు దూడలు మాటి
మాటికిఁ బెట్టు నం ♦ భా రవంబు

తే. తెల్లవారెడు జాడను ♦ దెల్పుచుండె
నల్లనల్లన మేల్కాంచి ♦ రెల్లవారు

వెళ్లఁబోవుచు సౌమిత్రి ♦ విధికిఁ బూనె
నుల్లముఁగలంచు పరితాప ♦ మోర్చికొనుచు. 40

## సీతా వియోగము

ఉ. శ్రీరఘురాము నాజ్ఞమెయి ♦ సీతను డించ వనాంతరంబులన్
జారుగుణుండు లక్ష్మణుఁడు ♦ సారథియైన సుమంత్రుఁబిల్చి, వేఁ
బారు తురంగమంబులను ♦ బన్ని, సుశయ్య నమర్చి, తెమ్మనెన్
దేసు, సుమంత్రుఁడట్లె వడిఁ ♦ దెచ్చె రథమ్ము విధిప్రయుక్తుఁడై. 41

తే. రాజసౌధంబు ముంగల ♦ రథము నుంచి
సీతఁ గని మ్రొక్కి సౌమిత్రి ♦ చెప్పె నిట్లు
"అమ్మ! నీకోర్కెఁ బాటించి ♦ యవని భర్త
యాశ్రమస్థలిఁ జూపింప ♦ నాజ్ఞ నొసఁగె. 42

తే. వేగరావమ్మ, వైదేహి! ♦ వేడ్కమీరఁ
బుణ్యగంగానదీతీర ♦ భూమి నున్న
మునుల వాడకుఁ దోడ్కొని ♦ పోదునిపుడె
తేరు సన్నద్ధమై యుండె ♦ దేవి కొఱకు. 43

చ. అని పలుకాడు లక్ష్మణుఁ బ్రియంబునఁగాంచి, ముదంబుతోఁ గుతన్
జనకజ సిద్ధమయ్యె ముని ♦ సంతతిఁ గాంచఁగఁ, బట్టు పుట్టముల్
కనక విభూషణంబులను ♦ గానుకలుగా నిడి రామురాణి గాఁ
దనుపఁగ మౌనిపత్నుల య ♦ థావిధి సర్వశుభప్రదంబుగన్. 44

ఉ. నిన్నఁ గదా మదీయవిభు ♦ నిన్ వరమున్ గృపసేయఁగోరితిన్
వన్నఁ గదా ప్రియంవద ము ♦ దంబునఁగోరిన దంచు నెంచి నీ
యన్న గదా యిటుల్ సలిపె ♦ నాడిన దాడిన యట్లు తోడనే;
వెన్నగదా! హృదీశుమది ♦ వేడినయంతటఁదీర్చుఁ గోరికల్. 45

కం. జానకి యిటు లుప్పొంగుచుఁ
గాననమున కేగఁ బూనుఁ; ♦ గా దా ననుచుం
దా ననఁజాలక, లక్ష్మణుఁ
డూనుచు మౌనంబు, దుఃఖ ♦ మొందును మదిలోన్. 46

ఉ. స్యందన మందు నున్న సుఖ ♦ శయ్యను భూసుత సేరి యెంతొ నా
నందము, దేరు సాగెను వ ♦ నమ్ముల మార్గముఁబట్టి; వాజులన్
దొందర తోడ సారథియుఁ ♦ దోలుచునుండెను, దాను నాక్షణే
డెందమునం బదంపడి, గ ♦ డించును లక్ష్మణుఁ జెప్ప కున్నఁదై. 47

చ. పరిసర మెల్ల దుశ్శకున ♦ భాజనమై కనుపట్టుచుండఁగా
నరదము బోవుచుండె, జన ♦ కాత్మజ గుండెలు జారుచుండె, భూ
వరుని కులాంగనామణికి ♦ భారము దోఁచె నొడల్, కరంబులం
గరములు కంప మొందెఁ, గుడి♦క న్నదరెం గనుఁగోనఁ దెల్పుచున్.

చ. అవనిజ డెంద మందు భయ♦మందుచు లక్ష్మణుఁజూచి పల్కె, ని
ట్లవశకునంబు లయ్యెడిని ♦ యన్నకు నేమొ? భ్రాతృవత్సలా!
భువి కనిపించుఁ బాడువడి, ♦ భూపతి తల్లులకున్ సుఖంబె? మా
నవతతి కెల్ల రామనర ♦ నాథుని రాజ్యమునందు భద్రమే? 49

కం. సీతాసతి యటు పలుకుచుఁ
జేతోవిభు నాత్మయందుఁ ♦ జింతించుచు, భూ
నేతకుఁ బ్రజకును సుఖ మిడఁ
జేతులు జోడించి మ్రొక్కె ♦ శ్రీపతి కంతన్. 50

చ. పరమ పతివ్రతాహృదయ ♦ భారముఁ గాంచుచు లక్ష్మణుండు భూ
వరునకు నెల్లవారలకు ♦ భద్ర మటంచు, ధరాసుతా పదాం
బురుహ సమీపమందుఁ దల♦మోపి, కరంబుల మోడ్చి, దుఃఖ సం
భరిత మనంబునన్ దిరిగి ♦ పల్కఁగఁ జాలమి వేసు మాటలన్. 51

చ. తపనుఁడు వేఁడిమిన్ విడిచి ♦ ధాత్రినిఁగూడఁ ద్యజించి పోయి, యే
నెప మొ ప్రతీచిభూధరము ♦ నెత్తముఁ దలఁదాచుఁ గోపియై
తప మొనరింపఁబోయెడి వి ♦ ధంబో; స్వకీయ కులోత్తముండె లో
కపు నుడిఁ జేసి, కానలకుఁ♦గాంతనుబంపు మహాఘు మాఱఁగన్. 5-

తే. తనదు జాత్యభిమానమే ♦ తలఁచి యేమొ;
యామినీకాంత నద్దెస ♦ లలమి కొనియె,

నవని నిబిడాంధకారమై ♦ యవనిజాత
యడవి కేగెడు ప్రస్థాన ♦ మాగునట్లు. 53

తే. వార లారేయి గోమతీ ♦ తీరమందు
విడిసి యుండిరి, సీతను ♦ వీడ లేక
మరల, దినరాజు, రఘువంశ ♦ కరుఁడు, దీప్తి
లోకబాంధవుఁడై తోఁచె ♦ నాకసమున. 54

చ. ఇనుఁడు ప్రచండుఁడై గగన ♦ మెక్కఁగసాగె సుమంత్రుఁ డన్నచో
తన చతురత్వమెల్ల విది ♦ తంబుగ నశ్వచతుష్టయంబు వేఁ
జనుగతిఁ దోలుచున్, వడిగ ♦ స్యందనమున్ నడిపింపఁబూనె, భూ
తనయయు, లక్ష్మణుండును, దరి ♦ దాపున గాంచిరి జాహ్నవీతటిన్. 55

తే. అర్ధదివసంబు కడతేరు ♦ నంత వారు
తేరు దిగినారు గంగాన ♦ దీ పవిత్ర
తీరతలమున, నదిగేమెమొ ♦ తీవ్రమైన
యార్తిలోఁబడె సౌమిత్రి ♦ యంతకంత. 56

ఉ. 'చాల దినాల నుండి మన ♦ సౌటను గోరిన కోర్కె యిద్ది, నీ
వేల పవిత్రగంగఁ గని ♦ యేడ్చెద విచ్చట ? జహ్నవీనదీ
లీల ముదంబుగాదొ ? గురు ♦ లీల స్మరించెదొ ? రెండు రాత్రులే
కాలము బుచ్చలేవొ ? రఘు ♦ కాంతునిఁ గాంచక ధర్మతత్పరా! 57

ఉ. అన్నను బాసి యొక్కత్రుటి ♦ యైనఁ జరింపఁగలే వెఱుంగుదున్,
సన్నుత రామచంద్ర పద ♦ సారస సేవ లభింప కుండ నే
నెన్నొదినంబు లుండఁగల ♦ నే? రఘువర్యుఁడు నాదు ప్రాణమై
యున్న తెఱం గెఱుంగవె ? ♦ గుణోదధి ? యైనను బేలనైతినే ? 58

ఆ. గంగ దాఁటి పోయి ♦ కని మునివ్రజములఁ
బూజ సల్పి రత్న ♦ భూష లొసఁగి,
మరలి పోదమయ్య! ♦ పురికి శేఘ్ర' యని
యవనిజాత మఱఁది ♦ నంతఁ దేర్చె. 59

క. ఈ మాటలు వినునంతనె
రామానుజుఁ డేడ్పుమాని ♦ రామాజ్ఞనొగిన్
ధీమంతునివలెఁ బూనఁడు
"రామా రామా" యటంచు ♦ రాముని దలఁచున్. 60

తే. కపట మెఱుఁగని జానకీ ♦ కాంత నుడికిఁ
గన్ను గవనుండి బాష్పముల్ ♦ గారుచుండ
నావికునిఁ బిల్చి, సౌమిత్రి ♦ నావలోన
సీత నెక్కించి, తానెక్కి ♦ చేరె నవల. 61

చ. విమలిన జహ్నువీసలిల ♦ విశ్రుత వాహిని దాటి, లక్ష్మణుం
డమలపతివ్రతామణి ధ ♦ రాత్మజ కేమియుఁ బల్కలేక, డెం
దము పరితాపభుగ్నమయి ♦ తాల్మి నశింపఁగ, వేదనాగ్నిలోఁ
గుములుచుఁ బ్రాంజలిన్ నిలిచి ♦ కుత్తుకలో దిగమింగు నేడ్పునన్.

చ. కనుఁగవఁగార్చు బాష్పములు ♦ గాలున గట్టఁగఁగన్ను మోడ్చి "యో
జనకజ! నాదు కర్మ మిది ♦ స్వాంతము గ్రుచ్చిన ముల్లువంటి మా
టను బలికెన్ సుధీరుఁ డక ♦ టా! జననిందకుఁ బాత్రమైతి రా
ముని సుజనాభినందితుని ♦ మూలముగా" ననెఁ గంపితాంగుఁడై. 63

చ. "మరణమె గోరువాఁడ నవ ♦ మానముఁ బొందెడి చేతకంటె, భూ
వరుఁ డిటు నన్ను నిందఁబడఁ ♦ బంపెఁ ద్రిలోకము నందు సువ్రతా!
కరుణ వహింపుమమ్మ! యనఁ ♦ గాఁ దగ దేమియు నన్నటంచుఁదాఁ
గరములు మోడ్చి, సీతపద♦కంజములన్ నతుఁడయ్యె నార్తుఁడై. 64

ఉ. హోరున నేడ్చువానిఁ, బద ♦ యుగ్మము నంటినవానిఁ, జావునే
కోరెడి వానిఁ, గంపితుసిఁ, ♦ గ్రూరుఁడ నే ననువాని, నన్న యే
ఘోరపుఁ గార్యముల్ సలుపఁ♦గోరె నటం చను వాని, లక్ష్మణున్,
నీరజ నేత్ర సీత గని, ♦ నిల్వున నీరయిపోయె నంతటన్. 65

ఉ. ఏమిది! లక్ష్మణా! యిటుల ♦ నేడ్చెద వెందులకయ్య బిట్టుగా?
రాముఁడు సేమమేగద? య ♦ రాజక మేమియు లేదుగా? నిజం

లేమి? మనోవ్యథన్ బడఁగ ♦ నీగతిఁ గారణమేమి? రాముఁ డే
బాములఁ గూర్చెనో? నృపు ♦ పత్నిగ నానతి నిత్తుఁ దెల్పుమా. 66

చ. అను జనకాత్మజావచన ♦ మంతయు వించు, సుమిత్రసూనుఁ డా
ననమును వంచి, యార్ద్రనయ ♦ నంబుల గద్గదిక స్వరంబుతో
'వనుచితమేమొ?' యన్ భయము ♦ నాత్మఁ ద్యజించుచు, దీనుఁడౌచు రా
ముని నుడిఁ దెల్పఁబూనెఁ దన ♦ ముంగల నిల్చిన సీత కీగతిన్. 67

### లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞఁ దెలుపుట

చ. జనకసుతా! సభాస్థలిని ♦ చారుఁడు దారుణవార్తఁ దెల్పె రా
మునకుఁ. "త్వదర్థమై, ప్రజలు ♦ భూపతిపై నపనింద మోపిరం"
చని, రఘురాజు నింద విని ♦ యాత్మ మహాపరితాప మొంది యీ
వని నినుఁ డింప నాజ్ఞనిడె ♦ *వత్సకు నాపుఁ గృపాస్వరూపిణీ! 68

చ. పురజనులాడు నిందకు వి ♦ భుండు విభీత మనస్కుఁడౌచు, నీ
సరణిఁ దపోవనస్థలిని ♦ సాధ్విని నిన్నుఁ ద్యజించి రమ్మనెన్,
బరమ పతివ్రతా మణిగ ♦ భావమునం దలపోయుచుండి, దో
ష రహిత నం చెఱింగియు, ని ♦ జంబు, త్వదిష్టపురస్సరంబుగన్. 69

ఉ. తల్లిరో! రాజశాసనము ♦ దప్పమి నేనిటు సేసియుంటి, సం
ఫుల్లమనోజ్ఞ పుష్పమయ ♦ ముల్, గడు రమ్యములున్ బవిత్రముల్
చల్లని యీవనీస్థలులు, ♦ శాంతి నటుల్ వసియించు వాల్మికుం
డెల్ల తపోజనంబులకు ♦ నేలిక, మిత్రుఁడు మాదు తండ్రికిన్. 70

ఉ. అతని నాశ్రయించి మను ♦ మా యుపవాసము నూని మేలగున్
సీతరో! జీవితేశుపద ♦ సేవ స్మరించు చపాపచిత్తవై,
చేతమునన్ దిగుల్ నడఁగఁ ♦ జెల్లదు, రాముని మాట లన్నియున్
బూత చరిత్ర నీ కెఱుక ♦ పుచ్చితిసుమ్మ నమస్కరించెదన్. 71

### సీతా విలాపము

ఉ. చేతులు మోడ్చి, లక్ష్మణుఁడు ♦ సెప్పెడి దారుణ వాక్యశూలముల్
చేతమునం దగుల్కొనుచుఁ, ♦ జేష్టలుదక్కఁగఁ జేయునంత, ధా

* పాఠాంతరము : వత్సనరున్ గరుణాస్వరూపిణీ !

## సీతా సందేశము

ఉ. అత్తల కీవు నా వినతు ♦ లందఁగఁజేయుచు, రామమూర్తినే
చిత్తము నందుఁ జేర్చుచు వ ♦ సింతు వనంబుల నంచుఁ దెల్పుమీ,
యత్తిన బత్తి నాథుని ప ♦ దాబ్జములన్ స్మరియించి సీత, చే
యెత్తి నమస్కరించె నను ♦ మీ, శుభమారసి యన్నగారికిన్. 79

తే. అన్నమాటల వినిపించి ♦ తయ్య ! వింటి ;
నంటి నీ మాటలంచు, నా ♦ యాత్మ పతికిఁ
జెప్పుమీ లక్ష్మణా ! 'నాదు ♦ తప్పులేక
యనద యట్టులు సంత్యక్త ♦ నైతి' ననుము. 80

తే. రామహిత కాంక్షగల భక్తు ♦ రాలి ననుము
లోక మపనిందఁ బలుకనో ♦ లోటు లేని
నృపతి ధర్మంబుతో భూమి ♦ నేలు మనుము
పత్ని నగు నాకుఁ బతి నిందఁ ♦ బాప విధియె. 81

తే. జానపదులను, బౌరులఁ ♦ జాలఁ బ్రీతి
సోదరులఁ జూచు రీతిగఁ ♦ జూడు మనుము,
ధర్మ మయ్యదె, కీర్తి ప్ర ♦ దంబు నదియె,
భర్తకై నేను బాములఁ ♦ బడుదు ననుము. 82

తే. బంధువు, గురుండు, దైవంబుఁ ♦ బతియె యంచు,
జీవములనైనఁ ద్యజియించి ♦ జీవితేశు
ధర్మ సంరక్షణము నూనఁ ♦ దగును; సతుల
కంత కెక్కుడు ధర్మమీ ♦ యవని లేదు. 83

తే. పాప విరహితయగు సీత ♦ భర్త చేత
విడువఁబడి యాత్మహత్యకై ♦ కడఁగ దనుము
రఘుకులోత్తము వంశవ ♦ ర్ధనము కొఱకు
విపినభూమిఁ జరించి జీ ♦ వించు ననుము. 84

లక్ష్మణుండు మరలిపోవుట.

తే. అనుచు దుఃఖాశ్రుపూర్ణయై ♦ యవనిజాత
విమల సందేశమును బల్క ♦ విభుఁ దలంచి
మాఱుపల్కఁడు మాటాడ ♦ నోరు రాక
విడువఁజాలఁడు, తడఁబడు, ♦ వెడల లేఁడు. 85

తే. అట్లు సౌమిత్రి కల్లోలి ♦ తాత్ముఁ డగుచుఁ
బరమభక్తిని సాగిలఁ ♦ బడుచు మ్రొక్కి
యామె కంతఁ బ్రదక్షిణ ♦ మాచరించి
నత శిరంబున, మరలుచు ♦ నావఁ జేరె. 86

చ. బిరబిర నావ సాగుతఱి ♦ బిక్క మొగంబున మాటి మాటికిన్
ధరణిజ వంకఁ జూచు నది ♦ దాఁటుచు నర్ధ పరావృతాస్యుఁడై
తరు గొకయింత లేని పరి ♦ తాపమునంబడి, జాహ్నవీ నదీ
తరణ మొనర్చె లక్ష్మణుఁడు ♦ దవ్వులనున్న పురంబుఁ జేరఁగన్. 87

సీత వాల్మీకి యాశ్రమముఁ జేరుట

తే. జాహ్నవికి దక్షిణంబున ♦ జనక పుత్రి
ధాత్రిఁ బడియుండి సౌమిత్రి ♦ తరలుచుంటఁ
బాఱఁ జూచును; నుత్తర ♦ తీరమందు
తేరు గలచోటు గనఁ గడు ♦ దూరమయ్యె. 88

తే. అశ్రు పరిపూరి తాక్షుల ♦ కంతలోన
నేమియునుఁ గానరాదాయె ♦ నేడ్వ పోయె
నెమలి కూతలు చెవి సోక ♦ నేర వాయె
నిశ్చలంబయ్యెనో సీత ♦ నిర్మలాత్మ! 89

ఉ. తోడునులేదు, వాడయునుఁ ♦ దోఁచదు, కర్మ మెఱింగుఁ జూడ నే
జాడయుఁగానరాదు, భయ ♦ సాంద్ర మహా విపినంబునందు నె
వ్వాఁడును రక్షలేఁడు, పతి ♦ వాక్కుల డెందము నొచ్చెఁగాని, యే
కీడుఁ దలంప దామె పతి ♦ కిన్, రఘురామ పదానురక్తయై. 90

శా. "రారా యేమను నాకు దిక్కనదు, "లేరా యేరు నాపట్ల" నం
చౌరా! మాటకునైనఁ బేర్కొనదు, ఘోరారణ్యమం దుండియున్
శ్రీరామశ్శరణం మమేతి ఘనమై చెల్వొందు నష్టాక్షరిన్
నోరారన్ జపియింపసాగె నతి సం తుష్టాత్మయై యంతటన్. 91

సీ. * భీతావహము లైన ఘాతుక మృగ తతుల్
దరిడాసి వెనుకకు మరలి పోయె,
బుసలతోఁ బడగెత్తి విసురుతో నోడ లెక్కి
పెనుబాము దిగజారి వెడలి పోయె
అంతలో వనమంత నావృతం బొనరించు
కార్చిచ్చు కనిపించి కమలి పోయె
భీకరార్భటి మొయి శ్లైకమై చదలెల్లఁ
జెలరేఁగి త్రుటిలోనఁ జెదరి పోయె

తే. భీషణధ్వని యేమూల వినఁగ రాదు
పక్షిగములెల్లఁ దమ గూండ్లఁ బట్టి యుండెఁ
బ్రకృతి నిశ్శబ్ద మౌన ము ద్రను ధరించె
రామరాజాజ్ఞయో! పతి వ్రత మహత్త్వ! 92

తే. విడువఁబంపెను గానలోఁ బుడమి ఱేఁడు
పగటి ఱేఁ డెండ పేడుచుఁ బయన మయ్యె
రాఁడుగాఁ దోడు రేఱేఁడు నాఁడు; గాని
గర్జనము లేదు మృగరాజు కానఁగాఁడు. 93

తే. పూత గంగా స్రవంతియుఁ బొంగి పొంగి
తరగలను మానె సీతమ్మ తెఱఁగుఁ జూచి
సర్వము మహీజ సంకల్ప సంభవంబు
రాజుఁ బాసియు నట వన రాజ్ఞి యయ్యె. 94

తే. మహిత రఘురామ భావ త న్మయతఁ గాంచి
కాననంబున సీతమ్మ గసుట లేదు

* పాఠాంతరము: భీతిఁ గూర్చొడి మహా

వృక్ష మృగ పక్షి సంతతి ♦ విపిన మెల్ల
రామ మయముగఁ దోఁచె నా ♦ రామ కప్రుడు. 95

తే. రామ శ్రీరామ, రఘురామ ♦ రామ రవమె
పక్షి మృగ వృక్షములఁ బ్రతి ♦ ధ్వనులఁ జెలఁగఁ,
జెట్టు పుట్టలు మృగ పక్షి ♦ జీవ రాశి
సీతయై దోఁచె, సర్వమ్ము ♦ సీత యయ్యె. 96

తే. కనులు మూసిన దాయమ్మ, ♦ కనదు వినదు,
పవ్వళించెను భూమిపై, ♦ వన ధరిత్రి
శైశవమునాఁటి బిడ్డను ♦ సాకు చుండఁ
బోరు వెట్టుచు నుయ్యాలఁ ♦ బొరలు భంగి. 97

తే. సంజకెంజాయ గనుపించు ♦ సమయ మయ్యె
విహిత కర్మంబులం దీర్చు ♦ వేళ యయ్యెఁ
గర్మ తత్పరు లావారు ♦ గంగ కేగి
స్నాన సంధ్యాది విధులను ♦ సల్పుచుండి 98

తే. వినిరి శ్రీరామ రావ మా ♦ విపినమందు
మంజులమ్మయి వనమెల్ల ♦ మారు వలుక,
రామనామ సమన్వితా ♦ రావ మేరి
దంచుఁ గలయఁ దిరిగిరి వా ♦ రా వనంబు. 99



తే. ముని కుమారులు చూచిరి ♦ వనము నందు
గగనమునుండి పడిన న ♦ క్షత్ర మనఁగఁ
బారవైచిన బంగారు ♦ ప్రతిమ యనఁగ
దిక్కు గానంగ రా నట్టి ♦ యొక్క సుదతి. 100

క. వడివడి పరుగిడి చేరిరి
తడయక ఋషినాథు, మౌని ♦ తనయులు వింతన్
గడగడఁ జెప్పిరి వినినది
పొడగనినది యిట్లు వారు ♦ పుణ్యాత్మునకున్. 101

కష్టములె నీ స్వరూపమై ♦ శిష్టవైన
అమ్మ సీతమ్మ ! సుస్వాగ ♦ తమ్ము నీకుఁ. 106

తే. అనతి దూరమ్ము నందున్న ♦ యాశ్రమంబు
చెంత వసియించు నా తప ♦ స్వినుల పొంతఁ
బుత్రికాప్రేమ నొంది పెం ♦ పొంద వమ్మ
అమ్మ! నమ్ముము నీ స్వగృ ♦ హమ్ము సుమ్ము. 107

తే. రమ్ము నా వెంట ననునంత ♦ రాము పత్ని
హస్తములు మోడ్చి ధేనువు ♦ ననుసరించు
వత్సమును బోలె ; సచ్ఛాత్ర ♦ వర్గ మనెడు
నంశువుల వెల్గు నా జ్యోతి ♦ ననుసరించె. 108

తే. వాల్మికుఁడు మానిపత్నుల ♦ వాడ కడకు
వెంట నిడుకొని పోయెఁ ♦ బృథ్వీజ నపుడు
మధుర వాక్కుల నోదార్చి ♦ మౌని సతుల
కెఱుక పరచెను సీతమ్మ ♦ తెఱఁగు లెల్ల. 109

తే. భూధవుఁడు తండ్రి, రాజ్య ర ♦ మాధవుండు
భర్త, మామ రారాజు, తాఁ ♦ బట్టమహిషి
యయ్యు, వనగత యయ్యె నీ ♦ యనఘ సీత
సాకుఁడీ తల్లులై మీరు ♦ జనక సుతను. 110

క. అనుచున్ ఋషిపత్నులకున్
జనకాత్మజ నప్పగించి ♦ చనియెన్ మునియున్
దన శిష్యులతో నాశ్రమ
మున కప్పుడె; నిత్యవిధులఁ ♦ బూర్తి యొనర్పన్. 111

చ. మునిజన భూషణుం డటులు ♦ భూసుతతోఁ జనుచుండ నాశ్రమం
బునకు, సుమిత్రపుత్రకుఁడు ♦ భూతనయన్ బహుదూరవర్తియై
కనుఁగొని యశ్రువుల్ దొఱఁగ ♦ కన్నుల స్యందన మందునుండి, రి
వ్వనఁ బయనంబుఁ జేసె హాయ ♦ ముల్ వడిఁ బౌరగృహోన్ముఖంబుగన్.

## లక్ష్మణ విలాపము

మ. అనుగుండమ్ముండు భక్తుఁ డగ్రజుని వా ♦ క్యార్థంబు నీడేర్చియుం
గనఁడాయెన్ మది శాంతి లక్ష్మణుఁడు, లో ♦ కం బెట్లు హర్షించు నా
పని, రాజాజ్ఞను ధిక్కరించుట యొ? లో ♦ పం బేమియున్ లేని సీ
తను, ఘోరాటవి డించుటో, ద్వివిధముల్ ♦ ధర్మచ్యుతంబుల్ గదా!

చ. జగతి సహించునో కొ, వని ♦ జానకి నీగతి వీడిపోవఁగా?
నగు, రఘురాము నాన యిది, ♦ నైనఁ బ్రజల్ నను దూరకుందురే!
తగునె పతివ్రతన్ విడువ? ♦ దారుణ శీలుఁడు తేఁడుగాఁడొ! యే
పగిది భరింపఁ జాలునొకొ ♦ భానుకులుండు సతీ వియోగమున్? 114

ఉ. అన్న దలంచు ఘాతుకత ♦ లన్నియుఁ జేయఁగఁ బుట్టినాఁడనో!
యెన్నఁగలేరొ యెవరు? మఱి ♦ యెవ్వరిఁ జీరఁడు, నేనె యన్న కన్
సన్ననె యిట్టి క్రూరవిధి ♦ సల్పితి! లోకము దిట్టిపోయదో?
యెన్నదొ యన్నకుం దగుదు వీవని! ధర్మము ద్రోయుటన్ వనిన్. 115

చ. అని విలపింప సాగెను ర ♦ యంబునఁ బోవు రథంబునందు ల
క్ష్మణుఁడు; సుమంత్రుఁ డారఘుకు ♦ మారున కీవిధిఁ బల్కెనంత, "ల
క్ష్మణ! దురపిల్లఁగాఁ దగునె? ♦ సల్పితి వీవు నృపాలు ధర్మమున్
వినుము రహస్య మొండు విని ♦ పించెద, దీనిని దెల్ప కేరికిన్. 116

### సుమంత్రుఁడు రాముని జాతకఫలములఁ దెల్పుట.

ఉ. "ఇల్లును రాజ్యమున్ విడుచు ♦ నెంతయొ కాలము, వీత భాగ్యుఁడై యొ,
దల్లినిఁ దండ్రినిన్ సతినిఁ ♦ దమ్ముల, నాప్తులఁ బ్రేమపాత్రు లా
నెల్లరఁ బాయువాఁడగు; న ♦ హీన నిరంతర దుఃఖ జీవియౌ
తెల్లమటంచు జాతకము ♦ దెల్పిరి రామునిఁగూర్చి పండితుల్. 117

తే. ధర్మమయమై వెలుంగు త్రే ♦ తా యుగంబు
నం దిరువది నాలుగవ మ ♦ హా యుగమున
శుభదమగు విళంబిని చైత్ర ♦ శుద్ధ నవమి,
వినుత గుణరాముఁ డగు రాము ♦ జనన దినము. 118

ఆ. దినకరుండు నైత్తి ♦ దీప్తిమంతుఁడు గాఁగ
నైదు గ్రహము లుచ్చ ♦ యందుఁ బడఁగఁ
బుట్టె రామవిభుఁడు ♦ పుడమిఁ బునర్వసు
మూఁడుపాళ్లు గడచి ♦ పోయిన తఱి. 119

క. కర్కటకంబున జననం
బర్కుఁడు మేషాది నుండె ♦ నాత్మజుఁ గనుచున్
గర్కట గురు చంద్రులఁ గని
యర్కుని మిత్రుండు కుజుఁడు ♦ నలరెడు నుచ్చన్. 120

ఆ. మేషమందు బుధుఁడు ♦ మీనంబునం గవి
యైదు గ్రహము లుచ్చ ♦ యందు నిటులు
గలవు సాయనగతి ♦ గణితంబు సేయంగ
బుధుని వారమందుఁ ♦ బుట్టినాఁడు 121

క. సుఖ మందిరమున శనియును
సఖియింటను బలము గలుగు ♦ క్ష్మాసుతుఁ డున్నన్
సుఖ మేవిధి లభ్యం బగు ?
నఖి లావని సృష్టికర్త ♦ కైనను రాజా! 122

తే. ఉండుగా కైదు గ్రహములు ♦ నుచ్చ యందు;
ధనకరుఁడు, లగ్నరాశిని ♦ దనదు నుచ్చ
భాగ్యరాశ్యధిపతి యాచుఁ ♦ బరమ మైత్రిఁ
దనరు శశిఁగూడి యుండిన ♦ ధనికుఁ డౌనె ! 123

తే. అరయఁ గేమద్రుమము వట్టె, ♦ నందు శశియొ
కేంద్ర మందుండె రవికి, దుః ♦ ఖితుఁడు ఖలుఁడుఁ
బ్రేష్యుఁడు దరిద్రుఁడును గాఁడొ ♦ ఱేఁడు గూడ,
నన్నియును గల్గి లేకుండు ♦ ననుభవంబు. 124

తే. కల్య రవిఁలగ్న, శశిలగ్న ♦ కంటకముల
గ్రహము లున్నవి, సన్యాసి ♦ గాఁడు, కాని

యిట్టి గ్రహరీతి సుఖముల ♦ నీయ బోదు
శాంతియు నొసంగ జాలదు ♦ సకల గతుల. 125

తే. ఉచ్చ యందుండి చూచుచు ♦ నొండు నొంటి
ప్రబల రిపులౌచు, రవి శనుల్ ♦ బరగు చుంట
రాజరాజయ్యుఁ దీవ్ర దు ♦ ర్వారచింత
ననుభవించును, రాఘవుఁ ♦ డనిరి బుధులు. 126

తే. అఖిల విదుఁడగు దుర్వాసుఁ ♦ డనఁగ నిట్లు
దశరథ నృపాలుతోఁ గూడి ♦ దాని వింటి
శపథ మొనరించియుంటి దా ♦ శరధి తెలఁగు
నన్యులకు నెన్నఁడును దెల్ప ♦ ననుచుఁ; గాని 127

తే. నీదు పరితాప మింతగా ♦ నేఁడు కాంచి
యోర్వఁజాలమిఁ దెల్పితి ♦ నో కుమార !
దాశరథి కర్మ మీగతి ♦ తాత వ్రాయ
వగపుఁ గొననేల రాఘవు ♦ వర్తనమున !" 128

తే. అనఁగ సారథి లక్ష్మణుం ♦ డంతఁ బలికె
నవని పతియైన, నెంతటి ♦ యములుఁడైన
రాముఁడైనను జానకీ ♦ రాముఁడైన
దైవ కల్పిత కర్మఁ దా ♦ దాటఁగలఁడో! 129

లక్ష్మణుఁడు శ్రీరాముని నూరడించుట

ఉ. ఈమెయి లక్ష్మణుండు మతి ♦ నెంతయు నూఱటఁ జెందు వేళకున్
గోమతిఁ జేరె స్యందనము; ♦ గ్రుంకె నినుండు, నదీ తటంబునన్
యామిని వెళ్ళఁ బుచ్చి యుద ♦ యంబుననే పయనంబు సల్పి, శ్రీ
రాముని వాడకుం జనె స♦రాసరి, లక్ష్మణుఁ డాతురంబునన్. 130

తే. అర్ధ దిన మేగునంత మ ♦ హారథుండు,
స్యందనము డిగ్గి కనెను దుః ♦ ఖాబ్ధి మగ్నఁ,

గన్నుఁగవ నశ్రువులుఁ గాఱ్చు ♦ చున్నవాని,
దీన వదను సింహాసనా ♦ సీను రాము. 131

అ. అన్నను జూచునంత హృద ♦ యమ్మున నార్తి జనింప, ధారగాఁ
గన్నుల నీరు గార్చి భువి ♦ కాంతునకుం బ్రణమిల్లి, మ్రొక్కుచున్
సన్నిధియందు నిల్చి, రఘు ♦ చంద్రున కిట్లను లక్ష్మణుండు, "మీ
రెన్నినయాన సల్పి, పృథి ♦ వీశ్వర! వచ్చితిఁ బాదసేవకై. 132

చం. విడిచితి జానకిన్ విమల ♦ విశ్రుత వృత్తను జాహ్నవీతటిన్
జడల ధరించియున్న ముని ♦ నాథుఁడు వాల్మికి నాశ్రమంబునం,
దెడ వెత నొందనేల? పృథి ♦ వీశ! *కృతాకృత కర్మ పోవునే?
పుడమి జనించువార లిటు♦పొందక తప్పునె పుణ్య పాపముల్? 133

క. మరణము కొఱకే జననము
జరుగు వియోగంబు కొఱకె ♦ సంయోగంబున్
విఱుగుట కొఱకే పెఱుగుట
తఱుగుటకే పెంపు లెపుడుఁ ♦ †దథ్యము రామా! 134

చం. ధనమును దారయున్ సుతులుఁ♦దల్లియుఁ దండ్రియు బంధుమిత్రులున్
మనుజ వరేణ్య! సర్వమును ♦ మాయయుఁగదా? మమకారమేల? వీ
నిని విడనాడకుండ నగు ♦ నే యెపు డేరికైననఁగాని? భూ
మిని నివి యెల్లవారలకు♦మిథ్య సుమీ! ధ్రువమిద్ది సర్వదా! 135

ఉ. నీ వెఱుఁగంగ నేరవొకొ? ♦ నిత్య పదార్థము కద్దె ధాత్రిపై?
నీ వఖిల ప్రపంచగతి ♦ నేర్చినవాఁడవు, నీవె నిన్ను, నీ
భూవలయంబునెల్ల వశ ♦ మున్ గొనఁ జాలినవాఁడవున్, వెతం
బోవఁగ జేయువాఁడవును, ♦ భూసుతకై దురపిల్లఁ జెల్లునే! 136

ఉ. ఏ యపదూఱు నెంచి, ధర ♦ ణీశ్వర! మైథిలి వీడినావా? నీ
కా యపవాదు పోవదిటు ♦ లార్తిఁగృశింపఁగ ; నిశ్చయంబు, వే

---

*పాఠాంతరము : పురాకృతకర్మ
†పాఠాంతరము : దథ్యం బార్యా!

పాయుము జానకీ విషయ ♦ భావము, దుర్బల బుద్ధిఁ ద్రోసి, సా
ఖ్యాయత జీవనమ్ముఁ బడ ♦ యందగు ధైర్యముఁ జిక్కఁబట్టుమా!

తే. తమ్ముఁ డీవిధిఁ బలుకంగఁ ♦ దాల్మిఁజెంది
రాజ్యవిధు లెన్ని, నృగమహా ♦ రాజు కథయు
నిమి నృపాలుని చరితంబు ♦ నీతి గాథ
లనుజునకుఁ దెల్పెనంత ధ ♦ రాధిపుండు. 138

తే. కాల విధులను దీర్చెడి ♦ కాల మాయెఁ,
బార్థివుని యాన సౌమిత్రి ♦ పరమ నియతి
నిజ నివాసంబునకుఁబోయెఁ, ♦ బ్రజకుఁ దెలిసె
జానకీదేవి గతి మఱు ♦ సటి దినమ్ము. 139

చ. వెలవెల లాడసాగె పుర ♦ వీధులు, పౌరులు దుఃఖితాత్ములై
కలరెయొ, నిజంబొ; జానకిని ♦ కాంతుఁడు వీడెనొ? నీతిమాలు మా
టల నెవఁడాడె దుర్జనుఁ డటంచును నొండొరుఁ బ్రశ్న వేయుచున్
గలఁగిరి, రాముచేత కిటు ♦ గాసిలి పల్కిరి పండితోత్తముల్. 140

పండిత విమర్శనము

చాకలివాఁడొ? యేరొ, భవ ♦ సాగర మీఁదఁగలేనివారు, నీ
పోక లెఱుంగలేని కడు ♦ మూఢులు నిష్ఠుర మాడి రంచు, లో
కైకపతీ! నరోత్తమ! స ♦ హింపఁగనోపవ? లోకులన్న నో
కాకులు, ధర్మసూక్ష్మ మవ ♦ గాహన మేగతి నేను వారికిన్? 141

ఉ. ఆతప శీతవాయువు ల ♦ హర్నిశమున్ మెయి సోకుచుండ, వి
ఖ్యాతకులంబునన్ జనన ♦ మందియుఁ; దల్లి! సదా మృగ వ్రజో
పేతములైన ఘోర వన ♦ వీథులఁ ద్రిమ్మరినావు రాముతో,
నాతఁ డిటుల్ కృతఘ్నుఁడయి ♦ యాడునె యాడఁగరాని మాటలన్!

ఉ. అమ్మా! చూపితివమ్మ నీమహిమ నీ ♦ వగ్నిం బ్రవేశించి, లే
రమ్మా! నీకు సమాన లీజగతిలో ♦ నాంతర్య సంశుద్ధి, నిన్
రమ్మంచున్ దరి జేరఁదీసి సతిగా ♦ రాజ్యాభిషిక్తుండునై
వమ్మేలయ్యెనొ రామ ధర్మములు? లో ♦ పం బేమి నిన్వీడఁగన్? 143

ఉ. నీతియు, ధర్మమున్ గలియ ♦ నేరవు, మానవ వాంఛితార్థమై
నీతి యసత్యమంత్రము, నృప ♦ నీతియు రాజ్య రమా విభూతికే,
నీతి, యసత్యమార్గము న ♦ నేకవిధంబును; రామ రాజ్య సం
పాతము గాదు నీతి పరి ♦ పాటిని సీతను వీడ కున్నచో. 144

తే. పావకోజ్జ్వల జ్వాలి కా ♦ పాత సీత
పరమ పావని లోకాప ♦ వాద మున్నె?
రాజ నీతికిఁ జెడుగెట్లు ♦ రాణివలన ?
ధవుల విధులున్న వయ్యా భూ ♦ ధవుల కైన ? 145



ఉ. ధర్మము, నీతియున్, విధియు♦దాశరథీ! యివి మూఁడు కర్మముల్
ధర్మము లోకసంగ్రహ వి ♦ ధంబగు, సంఘ పరంబు నీతి, స
త్కర్మయుతంబు జీవిత వి ♦ ధానగతంబును నౌ సదా విధుల్;
నిర్మల బుద్ధి భీతిలఁగ ♦ నేరదు లోకవిధంబు నెంచుచున్. 146

ఉ. ధర్మము నిత్య సత్యము, స ♦ ధర్ములు, బుద్ధుల వాక్కులన్ గ్రియన్
ధర్మమె సర్వలోకహిత ♦ తత్పరతన్ బ్రకటింత్రు, వారికిన్
గర్మను బట్టి పోదు మది; ♦ కర్మనుబుద్ధియె సృష్టిఁజేసెడిన్,
మర్మము లేదు ధర్మగత ♦ మార్గమునన్ రఘురామ ధీమణీ! 147

తే. పరహృతార్ధాంగి నానాఁడు ♦ బడయ నెంచి,
పడసి యీనాఁడు లోకాప ♦ వాద భీతిఁ
భార్య విడనాడి, ధర్మంబుఁ ♦ బాసి తీవు
రామ! యేది నీ సత్య ప ♦ రాక్రమంబు ?
కడకు సతియును ధర్మంబు ♦ గతియుఁ బోయె. 14

శా. ఆలింగూడి విహారలీలల విలా ♦ సాహ్లాదముం బొంది, చూ
లాలిం బంపితివయ్య నట్టడివికిన్ ♦ లజ్జింపవో? సద్విధుల్
గూలంద్రోయవో ధర్మపత్ని యెడలన్? ♦ ఘోషిల్లదో ? తప్తమై
జాలింజెందదో ? *తావకీనహృది పా ♦ షాణంబో ? దుర్భేదమో?

* పాఠాంతరము : నీ యెడంద ఘన.

ఉ. సీతయె యాశ్రమంబుల వ ♦ సింపఁ దలంచె నటంచుఁ దెల్పెదో?
సీతయు నిన్నుఁగూడి నిన ♦ సింపదొ మున్ముని పంచలందు? నీ
ఘాతుక కృత్య దోషమును ♦ గప్పఁగ లోకపు దృష్టినుండి, యే
వ్రాఁతల వ్రాయఁజెల్లుఁ? గవి ♦ రాజులకున్ గల మాడ నోపునే.

తే. తపసి యిల్లాండ్ర జతఁగూడు ♦ తలఁపుఁ జెప్ప
సరస సల్లాపముల నద్ది ♦ విరస మయ్యొ
చనవుచే నొక్క కోర్కెఁ గో ♦ రినది, దాని
ఫలముగా నిట్టులయ్యె జీ ♦ వనము తుదకు. 151

ఉ. ఆమె మహాపతివ్రత య ♦ టంచును నమ్మితి వంతరాత్మలో,
నేమియు దుష్టగాదను ము ♦ నీశ్వరవాక్కులు, వాయువున్ సురల్
సోముఁడు సూర్యుఁడున్, గను వి ♦ శుద్ధచరిత్ర, యపాప, పూత నీ
భూమిజ యన్నమాటఁ దల♦పోసియు ధర్మము నేల మీరితో! 152

తే. శిష్ట సంరక్షణము, దుష్ట ♦ శిక్షణంబు
రాజ్య పరిపాలనా విధి ♦ రాజ రాజ!
యమల మతి సీత, యతుల మ ♦ హా పవిత్ర
యంచు నెఱనమ్మి శిక్ష వి ♦ ధించి తేల? 153

తే. అబలయు, విశిష్ట, చూలాలు ♦ నాత్మసఖియు
నగుట, దోషిణియైన క్ష ♦ మార్హగాదొ?
యహహ! నిరపరాధిని దండ ♦ నార్హ యయ్యె
రామ రాజ్యంబు నందె యో ♦ రామ రాజ! 154

తే. యశముఁ గోరుట సామాన్య ♦ మైన బుద్ధి
యశముఁగోరి యధర్మ మా ♦ ర్గానుగమన
మల్పతర మైన వృత్తి, య ♦ త్యధమ బుద్ధి
విమల యశమెంచి గృహిణిని ♦ వీడి నావు. 155

తే. ధర్మనిర్ణీత నిష్కామ ♦ కర్మచయము
యశము నొనగూర్చుఁ దాఁదాన ♦ యంతె కాని

మోఱకుల మూఁక మనముల ♦ మురియఁజేయు
పోక లేరీతి సత్కీర్తిఁ ♦ బొడమఁ జేయు? 156

తే. భార్య సహధర్మచారిణి ♦ భర్తకంచు
లోనఁ దలపోయవే నాఁడు ♦ గాని రామ!
లభ్యమా నెల్ల చోట్లఁ గ ♦ ళత్ర మంచు
మున్ను బల్కవో? లక్ష్మణ ♦ మూర్ఛ యందు. 157

తె. ఆటలో నొక్క మేలైన ♦ యాట గాదు
పాటలో నొక్క మురిపెంపు ♦ పాట గాదు
లీలలో మార్పగాఁ దగు ♦ లీల గాదు
తన్వి నిజ ధర్మ సంధాత్రి ♦ ధార్మికునకు. 158

తే. రామ రాజానుమతమె ధ ♦ ర్మమ్ము గాదు
కాకపోవచ్చు ధర్మము ♦ లోకుల నుడి
ధర్మ నిర్ణయ గతికి నా ♦ ధార మొక్క
అంతరాత్మ ప్రవృత్తి యే ♦ యార్య తతికి. 159

తే. ముదిమి చేతను జనకుఁడు ♦ మోసపోయె
విల్లు విరచిన మాత్రాన ♦ విశ్వమందు
నాయకోత్తముఁ డీ రఘు ♦ నాయకుఁ డని
హృదయ దుర్బలుఁ డగు వాని ♦ కిచ్చె సుతను. 160

ఉ. మాతృ సమాన యా విమల ♦ మైథిలి, లక్ష్మణ! నీకు; ముందుగా
సీతకుఁ జెప్పవైతి వన ♦ సీమకు రాముని పంపుఁ, జెప్పినన్
బూతచరిత్ర భర్తృపద ♦ ముల్ గని మ్రొక్కుచు; రామచంద్రు సం
ప్రీతునిఁ జేసి కష్టదశ ♦ వెన్కకు నెట్టెడి దేమొ! నిర్దయా! 161

చ. జనకతనూజ లోక నుత ♦ సాధ్వినిఁ జక్కఁగఁ జేరదీసితో
వినుత తపస్వి! లోకు లవి ♦ వేకముతో నపవాదు నాడుటన్
దన విభుఁడైన రాముఁడును ♦ దానన చేసి త్యజించుటన్ మదిన్
గినుక వహింపకే పతినిఁ ♦ గీర్తనసేయు కులాంగనామణిన్. 162

ఉ. ధన్యుఁడవయ్య వాల్మికుఁడ! ♦ ధాత్రిజ నీ పినతల్లి గాదొ, నీ
వన్యుఁడవయ్య ! ధర్మపథ ♦ మారసి యాపద కాలమం దసా
మాన్యగతిన్ దపోమహిమ ♦ మానిని గాథ నెఱింగి రామరా
జన్య సతీ తనూలతను ♦ సాఁకుచునుంటె! త్వదాశ్రమంబునన్. 163

తే. అతివ దుఃఖాశ్రు పూర్ణయై ♦ యంపి నట్టి
విమల సందేశ లహరిలో ♦ వీఁగఁడొక్కొ-
తప్పు గ్రహియింపలేని నీ ♦ తావిభుండు
నేరమును దిద్దుకొన లేని ♦ నిర్దయుండు. 164

ద్వితీ యాశ్వాసాంతము.

ఉ. బూమెలమారివో? జడుఁడ♦వో ? బధిరుండవొ ? మూగవో? సదా
రామ ! నృపాలరామ ! రఘు♦రామ ? యుమాపతిరామ? జానకీ
రామ ! యటంచు, రమ్మనుచు♦ రాగముఁజూపియుఁగొపగించియున్
వేమరు జీరుచున్న విన ♦ వేడుక యయ్యెనొ ? రావదేలకో? 165

మ. జననంబందితి భోగభాగ్య తతులన్ ♦ సంసారమం దుండియున్
మనలే దెప్పుడు రాగలంపటుఁడనై ♦ మానాథ! నీ పాదభ
క్తిని బాల్యంబున నుండియున్ విడువ, స ♦ త్కీర్త్యర్థమై ధర్మసా
ధన భూతంబగు దేహమున్ వదల సి ♦ ద్ధంబైతి నే బందిలో. 166

ఉ. ధారణ దూరమాయె, ధన♦ధాన్యములన్నియు శూన్యమాయె, శా
రీర సుఖమ్ము పోయె, స్వశ ♦ రీరముపై భ్రమలేదు సుమ్మి, నీ
వారల నేనొకండ, ననుఁ ♦ బట్టిన సంతతి లేదు, నీకె కై
వారము సల్పుచుంటి నిక♦వత్తువ? చూడఁగ నోచియుంటినా? 167

మ. నిను సేవింపఁగ నీ పదాబ్జముల నెం ♦ తే భక్తిఁ బూజింప, నీ
కనుదోయిం బ్రసరించు ప్రేమమయ దృ ♦ గ్జాలంబులం బొంద ర
మ్మనుచుంటిన్ గృపరాదొ నీకు రఘురా♦మా! మామకీనాత్మ నీ
వనుకంపన్ గ్రహియింప నంతవఱ కా♦శాక్రాంతమై మ్రగ్గెడిన్. 168

మ. తగునా రాఘవ! దర్శనంబె యిడఁగా ♦ దాతృత్వమున్ లేద ? నిన్
దగు వారెవ్వరుఁ గొల్వరింక వినుమా! ♦ తథ్యంబు, నీ భక్తులన్
బగతోఁ జూచెదవా కొకా? వారి సుఖముల్ ♦ భ్రంశత్వముంబొంద నీ
వగ, భక్తాళికిఁ గష్ట సంతతులె ప్రా ♦ ప్తంబౌట నీ కర్మమా? 169

ద్వితీయాశ్వాసము

సంపూర్ణము



ఓమ్

శ్రీరామాయ నమః

# గోవింద రామాయణము

## ఉత్తర రామ చరితము

## 3. సుతోదయాశ్వాసము

క. నీ లీల లనంతంబులు
కాలత్రితయంబు గాంచఁ ♦ గాఁగల యోగుల్
హేలన్ జూతురు వానిని
శ్రీలలనా హృద్విహార ! ♦ శ్రీరఘురామా !

శ్రీరాముని పేరోలగము - మునుల రాక

చ. శుక పిక శారికా మధుర ♦ సుస్వనగీత పరీతమై సదా
సకల వనీ ప్రఫుల్ల సుమ ♦ సౌరభ సంకలితానిలంబు; శీ
తకర, దివాకరుల్, చలియు ♦ దాప మొసంగ సమంబుగా, జన
ప్రకరము సోకి మన్మథు స ♦ రాగము సేయు వసంతవేళలన్.

తే. పత్ని నెడబాసి రాఘవ ♦ పార్థివుండు
బ్రహ్మచర్యంబు నెఱపుచుఁ ♦ బరమ నియతి
రాజ్య పరిపాలనా కర్మ ♦ రతిని సతము
లోకబాంధవుఁడో యన ♦ లోక మేలు.

మ. యమునాతీర వనాంతరస్థలుల ని ♦ త్యానంద సంపన్నులై
సమబుద్ధిన్ జరియించు తాపసులు, ర ♦ క్షం దక్కితండోపతం

దముగా రామధరాధిపుం గనఁగ రాన్ ♦ ధాత్రీశుఁ డా యోగి బృం
దము నాహ్వానముఁ జేసి కొల్వునకు స ♦ న్మానంబునన్ భక్తితో. 4

ఆ. తపసుల కిడి హేమ ♦ దర్భాసనంబులఁ
బ్రాంజలియయి శుద్ధ ♦ వర్తనమునఁ
బలికె నిట్లు "మీరు ♦ వచ్చిన కతమేమి?
యాన తిడిన దాని నాచరింతు !" 5

తే. మునులు, పుణ్య తీర్థాంబు సం ♦ పూర్ణ కలశ
ములను, ఫల మూలములఁ దెచ్చి ♦ పుడమిఱేని
పూజలను బొంది, వాని భూ ♦ పున కొసంగి
కొలువునం దిట్లు శాంతిమై ♦ పలికి రంత. 6

## మునులు లవణుని గాథ రామునకుఁ దెల్పుట

ఉ. రామ ధరాధిపా ! కలఁడు ♦ రాక్షసుఁ డా మధు రాధినేతయై
నేమముతోడ సద్విధుల ♦ నెట్టుచుఁ బౌరుల నేచుచున్ ముని
స్తోమముఁ బెన్వేతంబడఁగఁ ♦ ద్రోయుచు, రుద్రుని శూలశక్తిచే
భూమి నజేయుఁడై ప్రళయ ♦ మో యనఁగా, లవణాభిధేయుఁడై. 7

ఉ. చెప్పితి మెల్ల రాజులకుఁ ♦ జేష్టలఁ దక్కిరె కాని, వార లే
చొప్పును గానరైరి రిపు ♦ సూదన మూనఁగ, లోక మన్ననో
చొప్పరిలేక నిత్యమును ♦ స్రుక్కెడి దైత్య దురంత బాధ, రా
మప్ప ! త్వదీయ బాహుబల ♦ మా లవణాసురుఁ జంపఁగల్గెడిన్.

చ. అతుల పరాక్రమోన్నత మ ♦ హాయశ మొందిన నీవు రాఘవా
సతతము జీవసంచయ కృ ♦ శత్వ కరుండగు వైరిఁ జంపి, మా
యతులకు రక్షనిమ్ము, లవ ♦ ణాసురుఁ డెవ్వఁడో గాఁడు, వాఁడు నీ
కతన లయమ్ముఁ గొన్న, దశ ♦ కంఠునకున్ భగినీ తనూజుఁడే!

## లవణునిఁ జంప శత్రుఘ్నుఁడు నియోగింపఁబడుట

తే. అనుచు మొఱలిడుచున్న సం ♦ యముల కంత,
రక్షణోత్సుకచిత్తుఁడై ♦ రాజ రాజు
భయము వలదని సెలవిచ్చి ♦ పగతు నడత
మునులఁ బ్రశ్నించి సర్వమ్ము ♦ వినియె దీక్ష. 10

క. మునిజన రక్షణ దక్షుం
డనుజులఁ గని యిట్లు పల్కె, ♦ నసురున్ జంపన్
జనెదరొ? మీ రెవ రీ యెడఁ
బనిఁబూనఁ దలంత్రు? వాఁడు ♦ భరతుని పాలా? 11

క. ధీరోదాత్తుని తమ్ముఁడు
వీరుం డా కైకసుతుఁడు ♦ వినయముతోడన్
శ్రీరాముని గని "లవణుని
బోరం దునుమాడ నేనె ♦ పోదు నృపాలా!" 12

చ. భరతుఁడు పల్కుటే తడవు ♦ ప్రాంజలియై కడగొట్టువాఁడు, "నే
దుర మొనరించువాఁడ, రిపుఁ ♦ ద్రుంచఁగలాఁడ నయోధ్యకున్ వెసన్
మరలఁగఁజాలువాఁడ, రఘు ♦ మాన్య! త్వదీయ పదాబ్జ సేవచే
నరిఁ బరిమార్చు వంతునకు ♦ నర్హుఁడ, నీవ యనుజ్ఞ నిచ్చినన్. 13

ఉ. కైకసుతుండు మున్నె కృత ♦ కర్ముఁడు, మీ వనవాసమందు మీ
రాకకు వేచియుండి యిట ♦ రాజ్యముఁ గాచినవాఁడు, మీకుఁగా
వ్యాకులుఁడై సదా జడలు ♦ వల్కలముల్ ధరియించి, భూమి నే
కాకిగఁ బవ్వళించుచు సు ♦ ఖంబును రోసినవాఁడు, పార్థివా! 14

శా. నందిగ్రామమునందు దుఃఖమతియై ♦ "నాస్త్యన్యథా" యంచు నిన్
డెందంబందున నిల్పి నీవగనె యుం ♦ డెం గందమూలంబు లా
నందంబొప్ప భుజించి, సౌఖ్యమిఁక నై ♦ నన్ బొందఁగాఁజెల్లు, నేఁ
గందున్ గష్టములన్ ద్వదాజ్ఞమెయి లో ♦ కత్రాణ దీక్షారతిన్. 15

చ. అనవిని రాఘవేంద్రుఁడు ర ♦ యంబునఁ దమ్ముని గాఁగిలించి మూ
ర్కొని తొడయందుఁజేర్చి యరి ♦ కుంజరయూధమృగేంద్రమా! నినున్

బనిచెద; దైత్య సంహరణ ♦ భాసుర కీర్తిఁ గడించి యేలుమీ
జనపతివై చను నా మధుర; ♦ సల్పెద నీ కభిషేక మిప్పుడే! 16

తే. కైకతనయు నియోజింపఁ ♦ గష్ట మొందు
దేని, నతఁడు విశ్రాంతితో ♦ నిచట నుండు;
నేలికను జంపి, తద్రాజ్య ♦ మేలు కొఱకు
నొరుని నిల్పని వాఁ డుండు ♦ నరకమందు. 17

తే. బాలుఁడవు మారు మాటాడ ♦ వలదు నీకు
నగ్రజుని మాటఁ బాలింప ♦ నగును, శూర!
యిదియె కర్తవ్యమగు సంశ ♦ యింపరా ద
టంచు సభలోన శత్రుఘ్ను ♦ నభినుతించె. 18

ఉ. రాముని పల్కులన్ వినుచు ♦ రాఘవవర్గ కనిష్ఠుఁ డంత, నె
మ్మోమునువాల్చి, దీనుఁడయి ♦ భూపతి కిట్లను, "అన్నలుండ నా
పైమువ్వు రీరు ధార్మికులు, ♦ పట్టపు టేలికనౌట ధర్మమా!
యేమరువాఁడఁ గాను భవ ♦ దీప్సితమున్ నెఱవేర్ప నగ్రజా! 19

ఉ. ఐనఁ ద్వదాజ్ఞ మీరి తొలి ♦ నాడితిగా, లవణున్ వధింపఁగా
నేనె జనం దలంతునని ♦ నీ విధ మారయ లేక ; కేకయీ
సూనుఁడె రాజుగాఁదగు, య ♦ శో రహితుండగు దైత్యుఁజంపఁగాఁ
బూనుదు నేను, రాజ్యరమఁ ♦ బొందను, తప్పు క్షమింప వేఁడెదన్. 20

ఉ. చేసిన తప్పునే మరలఁ ♦ జేయుచు నుంటిన! బుద్ధిమాలి, నీ
బాసకు మారుసెప్పి, నినుఁ ♦ బాసెడి కర్మముఁ దెచ్చికొంటి, వ్య
త్యాసముఁజేయ నగ్రజుని ♦ యానతికిన్, మఱియొక్కసారి యే
శాసనమైన మీరి నృప ♦ శాస్తికిఁ బాల్పడనొల్ల భూధవా! 21

చ. అనవుఁడు రామచంద్రుఁడు, స్మి ♦ తాననుఁడై యను "శత్రుసూదనా!
జనపరిపాలనంబు, బుధ ♦ సమ్మత ధర్మగతంబ యేని సా
ధనమగుఁ బారలౌకిక ప ♦ థంబునకున్, నిజధర్మ మూనుమీ
వినుము, యశంబుఁ గాంచుము, వి ♦ వేకముతో మధురాన్నృపుండవై.

తే. ఇపుడె యభిషేక మొనరింప ♦ నెంచినాఁడ
విహితకర్మంబు నెఱవేర్ప ♦ విప్రవరులు
మునులు, గురుఁడు, వసిష్ఠుండు ♦ మున్నుగాఁగ
వలయు వారెల్ల విచ్చేయఁ ♦ గలరు సుమ్మి". 23

శత్రుఘ్నుని మధురా ప్రయాణము

తే. అనుట తడవుగ, భరత ల ♦ క్ష్మణులు, వేడ్క
విధుల నెఱవేర్పఁ బూనిరి, ♦ ప్రీతిఁ గనిరి,
వైదికులు, వసిష్ఠుండు నృ ♦ పాల వరులు
పౌరులును వచ్చియుండిరి, ♦ ప్రభుని యాన. 24

తే. ఋత్విజులు మంత్రములఁజెప్పి ♦ యింపు నింప
జయజయ ధ్వానములు రేగి ♦ చదల నంట
మాను లాశీస్సు లిచ్చిరి, ♦ మగువ లెలమి
హారతు లొసంగి రష్ట రా ♦ మానుజునకు. 25

ఆ. ముగురు తల్లులుఁ గడు ♦ ముదమున దీవించి,
యక్షతలను జల్లి ♦ యరిగి రంత;
అక్షతలను జల్లి ♦ యాదల మూర్కొని
యాశిషంబు లిడిరి ♦ యన్న లెల్ల. 26

తే. విజయ దుందుభి మ్రోఁగ భూ ♦ విభుఁడు పలికె
"మధురఁ బాలించు నీతఁడె, ♦ మానితతుల
రక్షణముఁ బూనఁగాఁగల ♦ రాజితండె,
వీరుఁ డీతఁడు శత్రుఘ్న ♦ శూరవరుఁడు," 27

డే. అనఁగ రారాజు "తథ్యమే ♦ యగును గాత
నీదు పల్కులు, లవణుండు ♦ నీల్గు గాత"
మంచు యమునా నదీతీర ♦ మందునుండి
వెడలి వచ్చిన మునులు సం ♦ ప్రీతి ననిరి. 28

మా. అంకమునందుఁ గనీయునిఁజేరిచి♦యారఘురాముఁడు పల్కెనిటుల్
"జంకకశత్రువధింపుము దైత్యుఁ డ♦సాధ్యుఁడు ద్వంద్వరణంబులలోన్

శంకరదత్తము శూలము దంఁడియొ ♦ సంగెనువానికి; వాఁడెప్పుడున్
శంకనొనర్పఁడు మానవుఁ జంపఁగ ♦ శంకరశూల మజేయముగా.

చ. అనుదిన పూజచేఁ బరఁగు ♦ నట్టిది శూలము, దానిఁ బూను వా
నినిఁ బరిమార్చనేర మవ ♦ నీతలమందునఁ, గాన, నీకు దై
త్యునిఁ దుదముట్టఁజేయఁగల♦యొండు మహాస్త్రము నిచ్చువాఁడ,నా
దిని మధుకైటభారుల వ ♦ ధించెను బ్రహ్మ తదస్త్ర శక్తిచే. 30

తే. అతఁడు తనుఁజంపఁ బరిపంథి ♦ యరుగు దేర
శూలమును బూని యని సల్పుఁ, ♦ గూలు నరియుఁ,
గేల శూలంబుఁ దాల్పని ♦ వేళ నరసి
చంప యత్నింప నాతఁడు ♦ చచ్చు సుమ్ము. 31

తే. అతఁడు పురిఁబాసి వెడలు నా ♦ హారమునకు
మరలుచుండఁగ నగరి గు ♦ మ్మమున నిలుము
లోనఁ జొరకుండ శూలంబుఁ ♦ బూనకుండ
మడియఁజేయుము వానినిఁ ♦ దడవు లేక. 32

తే. సైన్యముల ముందుఁ బంపుము ♦ జాగు వలదు
జాహ్నవిని దాటి పవలె; ప్ర ♦ శాంతవృత్తి
నవల, నయ్యావి విడిది సే ♦ యంగఁదగును
నొంటిమై నీవు లవణుని ♦ కంటఁ బడుము. 33

తే. వర్ష ఋతువు ప్రవేశింప ♦ వానిఁ జంప
నదను, యమునాతటీ వాసు ♦ లైన మునులు
సైన్యనివహంబులం గూడి ♦ చనఁగఁ దగును,
ధనముఁ గొని నీవు తదుపరి ♦ తరలి పొమ్ము" 34

తే. అనుచు గారాముతో రాముఁ ♦ డనిన యంత,
నంకమును బాసి శత్రుఘ్నుఁ ♦ డమిత భక్తి
రామ, భరత, లక్ష్మణులకుఁ ♦ గ్రమముగాఁగఁ
బ్రణతులొనరించి, సెలవొంది ♦ వాడఁజేరె. 35

తే. భార్గవచ్యవన మునియుఁ ♦ బార్థివేంద్రు
హితము గమనించి తక్కిన ♦ ఋషులఁగూడి
సైన్యముల వెంటఁ దోడ్కొని ♦ చనెను ముందు,
నంతకో నాఁడు నృపు కొల్వు ♦ సాంతమయ్యె. 36

ఆ. సైన్య వితతిఁ బంపి ♦ శత్రుఘ్నుఁ డగ్రజు
పాదయుగళి నెడదఁ ♦ బాదుకొల్పి
గారవమునఁ బొంది ♦ నారాయణాస్త్రంబు
శత్రుఁ జంపఁ దఱలె ♦ సరిగ నెలకు. 37

ఆ. మార్గ మధ్య మందు ♦ మరునాఁటి రేయి యం
దలపు వాయ, వాల్మి ♦ కాశ్రమమున
అన్న యాన మేర ♦ నాగఁ దలంచుచు
తరణి వొడువ నతఁడు ♦ దరలి చనియె. 38

శత్రుఘ్నుఁడు వాల్మీకాశ్రమముఁ జేరుట.

క. కనుచుఁ ఘోరమృగంబుల
వినుచుఁ బక్షుల రుతంబు ♦ విపినమునందున్
జనిచని రెండవరాత్రికి
మునివాడ నతండు గాంచె ♦ మోదముతోడన్. 39

సీ. జననంబు మరణంబు ♦ క్షణమాత్రఁ గనునట్టి
క్షణకాల జీవులు ♦ క్ష్మాతలమున
తమ వాసమే గాని ♦ తక్కె మెఱుంగని
జలచర జాలంబు ♦ సలిలములను
రోష భీషణఘోష ♦ రోదసి నిండించి
మనునట్టి మృగములు ♦ వన తతులను
సకలజీవుల జ్ఞాన ♦ సంపత్తిచే మించు
జన సంతతులు సర్వ ♦ జగతి లోన

తే. నొండు మరియొండు భక్షించు ♦ చుండు బ్రతుక,
హింసయే సృష్టినైజం బ ♦ హింస కాదు.

కాని సృష్టికిఁ బ్రతి సృష్టిఁ ♦ గందు మిచటఁ
బ్రేమ మూర్తిభవించిన ♦ విధము దోఁచు. 40

ఆ. సర్వ జీవరాశి ♦ సమ భావమున నుండెఁ
గ్రూర జంతు వితతి ♦ కూర్మిఁ జూపు
యోగ మహిమ యిదియె ♦ యోగీశ్వరుం డైన
వాల్మికుండు మనెడి ♦ వాడ యిదియె. 41

సుగంధి. ఔ మహాత్ముఁడీతఁడంచు ♦ నాశ్రమంబుఁ జొచ్చి, శ్రీ
రాము తమ్ముఁ డంత మాని ♦ రాజుఁ గాంచి మ్రొక్కఁగన్
వామలూరుసూనుఁ డర్ఘ్య ♦ పాద్యమిచ్చి, "యిచ్చటం
దాము విశ్రమింప నొప్పు ♦ దాల్మిమీర" నం చనెన్. 42

స్రగ్విణి. "రామునాజ్ఞన్ మహా ♦ రాక్షసున్ జంపఁగా
భూమిదేవోత్తమా ♦ పోవుచున్నాఁడ, నీ
ప్రేమ పాత్రుండనై ♦ రేయి యిందుండి, తే
పే మునుల్ మెచ్చ నే ♦ నేగువాఁడన్ జుఁడీ" 43

ద్వి. అని పల్కె శత్రుఘ్నుఁ ♦ డా మౌని రాజు
విని యిట్లు కోరెను ♦ వినయంబు తోడ 44

సుగంధి. పొంద నేల యన్య భావ ♦ ముల్ మదాశ్రమంబునన్?
గందమూలముల్ భుజించి ♦ గాఢ నిద్రఁ బోవుఁడీ
యందుఁ బర్ణశాల నంచు ♦ నాడి, మౌని తెల్ప, సా
నందుడై సుదాసుఁ గాథ ♦ నమ్రభావుఁడై వినెన్. 45

## కుశలవుల జననము

ద్విపద. నడి రేయి వేళ నా ♦ నాఁడె భూపుత్రి
కడుపారఁ గన్నది ♦ కొడుకు లిద్దరను 46
ముని పత్ని లావార్త ♦ మునికి వేఁ బంపఁ
జనుదెంచె వాల్మీకి ♦ సంతోషముగను 47
గనులార ముని రాజు ♦ కవలను గాంచి
వెను వెంట జాతక ♦ విధుల నీడేర్చె 48

పెను గాలియును ధూళి ♦ పీడింప కుండ
వనదర్భ మంత్రించె ♦ వారి రక్షింప; 49

ముని సతు లా దర్భఁ ♦ బూని తుడిచిరి
మొనతోడ నొక్కని ♦ మొదలుతో నొకని 50

కుల దీపకులు దాన ♦ గుశలవుల్ నాఁగఁ
జెలువొందుదురు గవల్ ♦ శ్రీరామ సుతులు; 51

రాముని గోత్రంబు ♦ నామంబు లపుడు
ప్రేమతో ముని దెల్పఁ ♦ బెద్ద గొంతుకను 52

లవణుఁ జంపఁగ నేగు ♦ లక్ష్మణానుజుఁడు
కవల మహీజాత ♦ కనె నంచు వినుచుఁ 53

బురిటి శాలను డాసి ♦ భూజాతఁ గాంచి
కరయుగ్మమున్ మోడ్చి ♦ కాళ్లకుఁ బ్రమొక్కి— 54

"తల్లి ! క్షేమమ" యని ♦ తన శాల కేగ
పిల్లలం గన లేదు ♦ ప్రేమ మీరఁగను 55

ఇదియేమి లోకమో ♦ యిది యేమి పనియొ ?
మదిఁబుట్టదో చూడ ♦ మమకార మపుడు; 56

శ్రావణ మాసాది ♦ శత్రుఘ్ను డిటులు
శ్రవణ సుఖంబుగా ♦ రాత్రిని గడపె. 57

ఉదయాద్రి దినకరుఁ ♦ డుదయించు నంత
ముదమొంది ఋషిపాద ♦ ముల మ్రొక్కినాఁడు. 58

ముని కడ సెలవొంది ♦ ముందు మార్గమునఁ
జనినాఁడు లవణాఖ్య ♦ దనుజుఁ జంపుటకు. 59

## లవణ సంహారము

చ. మునులకడన్ వసించుచుఁ బ్ర ♦ మోదముతోఁ గథ లాలకించుచున్
జనిచని సప్తరాత్రములు, ♦ శాత్రవుఁ జంపఁ దదేక నిష్ఠ మై

కని యమునానదీతటముఁ ♦ గాంచి యటన్ జ్యవనాదులన్, బురం
బున లవణుండు లేమి విని, ♦ ప్రొద్దున బాఁటె నతండు వాహినిన్. 60

చ. దినపతి కొండ నెక్కు తఱి ♦ దివ్య శరాద్భుత శక్తిమంతుఁడై
ధనువును బూని పట్టణపు ♦ ద్వారము ముంగల నిల్చి రాఘవేం
ద్రుని కడగొట్టు తమ్ముఁ డరిఁ ♦ ద్రుంపగ నువ్విళు లూరుచుండె, నె
త్తిని రవి దోఁచు నంత బహు ♦ తీవ్రముగాఁ జనుదెంచె నాతఁడున్.

శా. "ఓరోరీ! నరుఁడా! మహాద్భుతము! న ♦ న్నోడింపఁగా వచ్చితో?
పోరన్వచ్చిరి యెందఱో యిటుల మున్ ♦ బోకారినా రెల్ల రా
రారా! నీ శర మేఁచునొక్కొ నను? మూ ♦ ర్ఖా! నిన్నిదే చంపి, యా
హారంబున్ గయికొందు నీక్షణమ సు ♦ మ్మా! హృష్ట చిత్తుండనై."

మ. అనుచున్ ఘోరనిశాచరుండు పటురో ♦ షాయత్త చిత్తుండు ప
ల్కెను, శత్రుఘ్నుఁడు నవ్వుచున్ "లవణ! శం ♦ కించెన్ సుమా మున్ను రా
వణుఁడున్ రాఘవు శక్తి నిల్లె, నినుఁ జం ♦ పన్ వచ్చితిన్ వీడ, రా
ముని తమ్ముండ దురంబు సల్పుమిఁక, నీ ♦ పోఁగాల మాసన్నమా!

మ. అన *"నా మాతులుఁ జంపినట్టి కుటిలుం ♦ డా రాముఁడే రాక పా
పను నిన్నేల రణంబు సల్పఁ బనిచెన్! ♦ బ్రహ్మాండముల్ గూల్తు నే
ననిఁ బూనన్ బలుమాటలేల" యని యా ♦ హాకారఝాంకారముల్
మిను ముట్టన్ లవణుండు భూజముల సౌ ♦ మిత్రిన్ వెసన్ డీకొనెన్.

శా. జ్యారావంబున దిక్కు లెల్ల వణఁకన్ ♦ శత్రుఘ్నుఁడా శత్రుపై
నారాచంబులఁ గొట్టి వ్యథుఁడగుచున్ ♦ నారాయణాస్త్రంబునే
శ్రీరామున్ మదినెంచి వీడె, నది జే ♦ జేరావముల్ సేయుచున్
బోరన్ శూలముఁ దేఁదలంచు లవణున్ ♦ బోకార్చె నప్పట్టునన్.

తే. అబ్బ! చచ్చెనా లవణుఁ డం ♦ చనెడి వారు
పాతకుఁడు ద్రెళ్ళినాఁడని ♦ పల్కువారు
పరమ సంతోషభరితులై ♦ పరఁగు వారు
నెల్ల రప్పుడు శత్రుఘ్ను ♦ నెదుటఁ బడిరి. 66

---

*పాఠాంతరము: నా మామను

తే. శివుని దరిఁజేరె శూలంబు ♦ శీఘ్రగతిని
విగత జీవుని లవణుని ♦ విడిచి పుచ్చి,
మధుర శత్రుఘ్ను వశమాయె, ♦ ప్రథిత గుణుఁడు
రాఘవుని కీర్తి నద్దెసఁ ♦ బ్రబల మాయె. 67

ఉ. రాముని సోదరుండు మధు ♦ రన్ జనులెల్లరుఁ గొల్వ సైనిక
స్తోమముతోఁ జమూపతుల ♦ తోఁ బ్రజకున్ దగురక్ష నిచ్చి; యా
రామములన్ దటాకముల ♦ రథ్యల, మేడల నాటపట్టులన్
నేమముతో నమర్చి యవ ♦ నీపతి ధర్మము లెల్లఁ దీర్చుచున్. 68

శత్రుఘ్నుఁ డయోధ్యకు మరలుట

తే. పదియు రెండేండ్లు మధురలోఁ ♦ బాలనమ్ము
సలిపి, రఘురాముఁ జూచు నా ♦ సక్తిఁ దగిలి,
నిజ పురము వీడి కొంత సై ♦ నికదళమ్ము
గొని యయోధ్యకుఁ బయనమై ♦ చనుచు మరల. 69

ఆ. మార్గ మధ్య మందు ♦ మాన్యుఁడౌ వాల్మీకి
యాశ్రమంబుఁ జేరి ♦ యచట విడిసె
నర్ఘ్య పాద్య మొసఁగి ♦ యాతిథ్య మిచ్చియు
మునియు నాదరించె ♦ భూమిపతిని. 70

తే. వేగ వాల్మీకి యొసఁగిన ♦ విందుఁగుడిచి
సైనికుల నుంచి యాశ్రమ ♦ స్థలములందుఁ
గర్ణ పేయంబుగా మౌని ♦ కథలఁ జెప్ప
వినుచు శత్రుఘ్నుఁ డానంద ♦ వివశుఁడయ్యె. 71

ఆ. సీతఁ దలఁపఁబోఁడు ♦ సీతమ్మ కొమరుల
యోగ మరయఁబోఁడు ♦ యోగి యైనఁ
దెలుపఁ డపుడు రాము ♦ కులవర్ధనులఁగూర్చి
తేని కడకుఁ బోవు ♦ వాని తోడ. 72

తే. సుతులఁ గని సీత; ముని సతీ ♦ తతులఁ గూడి
చిఱుతలను బెంచు రఘురాముఁ ♦ జేర్చి మదిని;

సతతము శ్రీరామ నామ సం ♦ స్మరణ లబ్ధ
శాంతి, సుఖ దుఃఖముల నొక్క ♦ సరణిఁ గనును. 73

తే. "లాలి రఘురామ శ్రీరామ ♦ లాలి యనుచు
జోలఁ బాడుచు శ్రీరామ ♦ లాలిఁ బాడి
రక్షఁ బెట్టుచు శ్రీరామ ♦ రక్షఁ బెట్టి
యనుఁగు సుతులను బెంచె ♦ సీతమ్మ సతము. 74

సీ. మేదు రాశ్రమ వనీ ♦ పాదప చ్ఛాయయే
రమ్య సితాతప ♦ త్రంబు గాఁగ
సకలాటవీ జంతు ♦ సంతాన విహరణ
స్థలములే రాణి వా ♦ సంబు గాఁగ
శారికా కీరికా ♦ చార రావంబులే
తమిఁ గూర్చు నృత్య గా ♦ నములు గాఁగ
నిశ్చల పతిభక్తి ♦ నెఱపు సువ్రతములే
షడ్రసోపేత భో ♦ జనము గాఁగ

తే. పుట్టి మెట్టిన యిండ్ల వి ♦ భూతి బాసి
గహన గత యాఱె రాజ యో ♦ గంబు గాఁగ
ననఘు రాచూలి రారాణి ♦ యడవి నుండె
నిన కులేశ్వరుఁడే రాజ్య ♦ మేలుచుండ." 75

తే. అనెడి వృత్తాంత మొకయింత ♦ యైన మునియు
నెఱుక పరుపఁడు పదియు మూఁ ♦ డేండ్లు గాఁగ
నాశ్రమంబున నివసించు ♦ ననఘుఁ గూర్చి,
దశరథేశుని సత్కీర్తిఁ ♦ దలఁచి యేమొ? 76

తే. బడలికలు గాయ శత్రుఘ్న ♦ పార్థివుండు
పర్ణశా లాంతరంబునఁ ♦ బండుకొనెను,
గాని నిద్రింపఁజాలఁడు ♦ కదలఁ డెటకు
నతని పరివారమును గూడ ♦ నట్లె యుండె, 77

తే. మధుర కేగెడి నాఁడును ♦ మధుర వీడి
మరలి వచ్చెడి నాఁడును ♦ మార్గమందు,
విడిసి యుండెను వాల్మీకి ♦ వీటి యందు
విడియఁ డేలొకొ? మరలి తా ♦ వెడలు నాఁడు. 91

తే. అగ్రజుని వీడి మధురకు ♦ నరుగు త్రోవ
రాముసతి యున్న వాల్మికా ♦ శ్రమము లేదొ ?
జ్ఞప్తికిని రాదొ ? గంతవ్య ♦ సరణి కాదొ ?
తెలియఁగా రాదు శత్రుఘ్ను ♦ తలఁ పదేమొ ? 92

తే. రాఘవుఁడు దమ్ము నోదార్చి ♦ రాజ్యమేలఁ
బనిచి, తనకడ లక్ష్మణ ♦ భరతు లుండఁ
బ్రజలు సుఖయింప రాజ్య భా ♦ రమ్ముఁ బూని
వరలుచుండెను కాలంబు ♦ జరుగుచుండె. 93

## శంబుకుని వధ

తే. అంత నొకనాఁడు రామ ధ ♦ రాధిపుండు
కొలువు దీర్పఁగ నేగుచు ♦ గుమ్మము కడ
హృదయ వేదనమున నేడ్చు ♦ వృద్ధ విప్ర
దంపతులఁ గాంచి, యేడ్పు క ♦ తంబు నడిగె. 94

తే. అకట ! ఐదేండ్ల చిఱుత ప్రా ♦ యంపువాఁడు
మృతుఁడు; రాఘవా! చూడుమీ! ♦ యీ శవంబు
ముదుసలుల మమ్ము వీడె న ♦ పూర్వమిద్ది!
వేరె తిలధార మాకిచ్చు ♦ వారు లేరు. 95

ఉ. పుట్టిన జీవరాశి తుద ♦ ముట్టక యుండదు, తల్లి దండ్రియున్
గిట్టక ముందె యాత్మజులు ♦ గిట్టుట యెచ్చట నైన నున్నె ? నా
పట్టి మృతుండు, బ్రాహ్మణుఁడఁ♦బాయని ధర్మచరుండనౌదు, నే
పట్టున రామరాజ్యమున ♦ బాలుఁడు ప్రాణము వీడె నయ్యయో!

ఉ. మార రమానకాంతి సుకు♦మార తనుం డితఁ డొక్కరుండె, మా
కారయఁ బుత్రకుండు నఘ ♦ మన్న దెఱుంగఁడు, నీదు ధర్మ సం

చారమునందుఁగల్గె నప ♦ చారము, రాజుల దుష్క్రియాగతిన్
మారణమొందుచుండెద ర ♦ మాయిక పాలితకోటి రాఘవా! 97

ఉ. నీవును దమ్ములున్ సుఖులు, ♦ నేరరు పాలితవర్గ సౌఖ్యముల్
గావఁగ, నాదు పుత్రకుఁ డ ♦ కాలపు మృత్యువుఁగాంచె, వెంటనే
జీవము పోయవయ్య; నృప ♦ శీలము శుద్ధము సేయవయ్య; మా
చావులు గాంతువయ్య, యిటఁ ♦ జచ్చిన బాలుఁడు లేవకున్నచో!

క. అనుచున్ రోదన వశులై
కనిపించెడి వారి కెట్టి ♦ కరణియుఁ జెప్పన్
మన సొల్లక, రాఘవుఁడును
మునులకుఁ గబురంపె దుఃఖ ♦ పూర్ణుం డగుచున్. 99

చ. ఋషు లరుదెంచినారు ధర ♦ ణీశుని పిల్పున; బాలుఁ డీతఁ డే
మిషఁ జనిపోయెఁ?, జేయఁగల ♦ మే ద్విజబాలు సజీవుఁగాఁగ? నీ
విషమగతిన్ దలంగెడి వి ♦ వేక పథం బెరిగింపుఁ డంచుఁ బా
రుషమున రాఘవ క్షితివ♦రుండు మునీంద్రులఁ బృచ్ఛసేయఁగన్.

మ. యుగధర్మంబును మీరు శూద్రుతపమున్ ♦ యోజింపఁగాఁజెల్లు, నీ
వగ బాలుం డపమృత్యువుం గనుటకున్ ♦ వ్యాజంబు రాజేంద్ర! యో
గ గరిష్ఠుం డగునట్టి శూద్రకులజున్ ♦ గాలించి ఖండించిన
న్విగత ప్రాణము వెండి చేరికొను పీ ♦ నిన్, రాజ ధర్మంబునన్. 101

తే. తనువుతోఁ గూడి దివ్య ప ♦ థంబుఁ గోరి
యతఁడు తపముండెఁ గనుమూసి ♦ యమిత దీక్ష
నంబువుల చెంత శీర్షాస ♦ నంబునాదు
యామ్యదిశఁ జూడుమీ వాని ♦ నమల చరిత! 1(

చ. అనుచును నారదుండు పలు ♦ కాడఁగఁ బుష్పకమెక్కి రాముఁ
పని యొక లెక్కయా యనుచు♦బాలుని దేహముఁగాచు ప్రక
బనుజునితోడఁజెప్పి వృష ♦ లాన్వయుఁడౌ మునిజాడఁజూడఁ దా
జని కనె దక్షిణంపు దిశ ♦ శైవలినీ గిరి చెంత న్నాతనిన్. 1(

ఉ. "ఏది కులంబు నీయది? త ♦ దేకమతిన్ దప మాచరింపఁగా
మోదము ఖేదమున్ విడిచి ♦ మోక్షము నొందఁ దలంపొ? లేక వై
రేది యభీప్సితంబొ? విన ♦ నెంచెద రాముఁడ, భూధవుండ, నా
హ్లాదముఁ జెందువాఁడ" నను♦రాముని కా ముని తెల్పు నీగతిన్. 104

తే. శంబుకుఁడ, శూద్ర కులజుఁడ ♦ స్వర్గకాంక్షఁ
దపము సల్పుచునున్నాఁడఁ ♦ దాల్మి శ్రోడ
ననిన, రాఘవుఁ డసిధార ♦ నతని శిరముఁ
ద్రుంచె, క్షణమాత్ర నది భూమిఁ ♦ ద్రుళ్లి పడఁగ. 105

తే. శంబుకుని దేహ మవనిపై ♦ శవము గాఁగ
బాలకుఁడు ప్రాప్త జీవుఁడై ♦ వసుధ లేచె
ననుచు దివిజులు పలికి ర ♦ త్యంత తృప్తిఁ
బ్రతిన నెరవేర్చి ముదమొందెఁ ♦ బార్థివుండు. 106

ఉ. రాముఁడు ఘోరపాతక వి ♦ రాముఁడొ? సజ్జన రక్షకుండొ? స
త్కామ తపోమయాత్మకుఁడు ♦ కాననసీమ గతుండు, మానవ
స్తోమ హితార్థకాంక్షి కడు ♦ శుద్ధచరిత్రుఁడగు శంబుకుండు, మా
రాముఁడు చంపఁగాఁదగు న ♦ రాతినరుండొ కో? యాతతాయియో?

ఉ. ఈకథ యేగతిన్ రఘు కు ♦ లేంద్రుని జీవిత గాథ మార్చునో?
ప్రాకట సద్గుణాన్వితుఁ డ ♦ పార కృపాన్వితుఁడైన రాముఁడే
నాకము కోరు తాపసి వి ♦ నాశ మొనర్చునో? ధర్మహానో కో?
లోకులు విశ్వసింతురో కో? ♦ లోక సుపాలన మిట్టి దన్న చో? 108

చ. కలియుగ వేళగాని రఘు ♦ కాంతుని కాలమునందుఁబుట్టు శూ
ద్రులు తపమాచరించు నెడ ♦ దోసము శాసన మయ్యె, రాజు లీ
కుల యుగ ధర్మ నిర్ణయముఁ ♦ గూలఁగఁద్రోయు స్వధర్మహానికిన్
దలకొనఁగూడదంచు నృప ♦ ధర్మము నూనితివా నృపోత్తమా! 109

ఉ. ఆరయ నిద్ర, మైథున భ ♦ యంబులు జీవులకెల్లఁ గల్గు, నా
హారము తీరునన్; బ్రతిభ ♦ యబ్బదు ప్రాణులకెల్ల సృష్టిలో,

వారని యోగసిద్ధిఁ గను ♦ భవ్యులు మాత్రమె జ్ఞానులౌదు, ర
వ్వారల వర్ణభేదమును ♦ బట్టి వధింపఁగఁ జెల్లునే? నృపా! 110

తే. అంచుఁ గొందఱు దమలోఁ ద ♦ లంచు చుండ్రు
శంబుకుని చావునందలి ♦ సత్య నిరతి
నాత్మ శంకించువారు; ధ ♦ రాధిపుండొ
పుష్పకము నెక్కి సురలోకఁ ♦ బోయె నంత. 111

రాముఁ డగస్త్యాశ్రమముఁ జేరుట.

తే. శంబుకునిఁ జంపి రఘురామ ♦ చక్రవర్తి
కుంభ సంభవు నాశ్రమ ♦ గోష్ఠిఁ జేరె
మునియు జననాథు రాకకై ♦ మోద మంది
తొడవు గానుకగా నిచ్చెఁ ♦ బుడమి పతికి. 112

తే. "దానమును గొంట క్షత్రియ ♦ ధర్మ మగునె?
భూసురుల కిచ్చుటే తగు ♦ భూమి పతికి"
ననఁగ, శ్వేతుం డొసంగిన ♦ దాట దీని,
నీవె ధరియింపఁ దగు దని ♦ నెమ్మిఁబల్కె. 113

తే. దాన మెఱుఁగని దోసంబు ♦ దగిలి, దివిని
నాకలికిఁ జిక్కి యల్లాడు ♦ నార్తిఁ దనదు
పీనుఁగును మెక్కి తృప్తుఁడౌ ♦ శ్వేతనృపతి
గాథ వివరించె నంత న ♦ గస్త్యమౌని. 114

తే. తన కుమారినిఁ జెఱిచెను ♦ దండుఁ డనుచు
భార్గవుం డెంతొ కోపించి ♦ పాంసువృష్టి
నతఁడు నాతని రాజ్యంబు ♦ నంతరించు
సప్తదినములలో నని ♦ శాప మిచ్చె. 115

తే. శాపవశమున వింధ్యాద్రి ♦ శైవలినుల
మధ్యగాఁ గల రాజ్యము ♦ మాసిపోయె.
దండుని నెపంబునం జేసి ♦ దగ్ధ మౌట
దండకారణ్యమన నొప్పు ♦ చుండు నదియె. 116

క. కృతయుగమునాఁటి శ్వేతుని
కతయును, త్రేతాయుగంపుఁ ♦ గర్మలఁ జెప్పెన్
శ్రుతి హితముగ ఘట జాతుఁడు
మతిమంతుఁడు, ధర్మమూర్తి ♦ మానవపతికిన్. 117

క. తన పురికా రఘురాముఁడు
మునిచంద్రుని యాజ్ఞగొంచు ♦ మోదము తోడన్
జనె, విని పూర్వపు గాథలు;
దిననాథుఁడు తూర్పుమలను ♦ దేజు వహింపన్. 118

మ. మునివాడన్ విడనాడిపోయెడి తఱిన్♦"పూతాత్మ! యోగీంద్ర! నేఁ
జనుదెంతున్ భవదాశ్రమంబునకు స్వే ♦ చ్ఛన్ దావకీనాజ్ఞఁ, బూ
తునిఁ గాఁజూతుఁ ద్వదీయదర్శనమునన్♦ దుర్బుద్ధిఁబోనాడి" యం
చినరాడ్వంశజుఁడైన రాఘవుఁడు మహా♦నీంద్రున్ బ్రశంసింపఁగన్.

చ. వరగుణ! రామచంద్ర! భవ ♦ బంధవిమోచక! పార్థివేంద్ర! త్వ
చ్చరణములే భజించి మన ♦ సారఁగ ధ్యానము సేయువారు, నీ
కరుణ లభించి యొక్క త్రుటి ♦ కాలమునందె పునీతు లౌదు, రీ
పరమ పవిత్ర దర్శన శు ♦ భం బొనఁగూడిన సర్వ సిద్ధియౌ. 120

క. అని ఘటజుఁడు నుతియింపఁగ
జనపతి విని, దాన హృదయ ♦ శాంతిన్ గనఁడో?
మునివధచే, నింటికిఁ జని
యనుజుల రావించి పల్కె ♦ నాత్మ గతంబున్ 121

## యాగనిర్ణయము

తే. బ్రాహ్మణుని కార్య మొనఁగూర్చి ♦ వచ్చినాఁడ
నఘ హారంబగు రాజ సూ ♦ యంబు సలిపి
ధర్మ మభివృద్ధి చేయఁగాఁ ♦ దగదొ? మీరె
తెల్పుఁ డిప్పుడె యోజించి ♦ ధీరులార! 122

ఉ. పావనుఁడైన రామ నర ♦ పాలుని పాదము లాశ్రయింపఁగా
భూవర! యేనృపుండు దల ♦ పోయఁడొ? లోకము నిన్నుఁ దండ్రిగా

భావన సేయు నన్వహము, ♦ వైరము గూర్చెడి రాజసూయమున్
నీ వొనరించుటే తగద ♦ నెన్ భరతుండు కృతప్రణాముఁడై. 123

తే. రాజసూయంబు కతమున ♦ రాజకోటి
పౌరుషముఁ జెందు, జనతతి ♦ పోరునందు
నాశనము నొందు, నృపవంశ ♦ నాశకంబు
రాజసూయంబు, సేయఁగా ♦ రాదు మనకు. 124

క. అను తమ్ముని పల్కులు విని
మనమున సమ్మోదమంది ♦ మానవ హననం
బొనరించెడి క్రతు వొనరుప
మన సొల్లదు సుమ్మినాకు ♦ మానెద నంచున్, 125

చ. పలుకఁగ నన్న; లక్ష్మణుఁడు ♦ ప్రాంజలియై యనెనంత "అగ్రజా!
సలుపుము వాజిమేధము ది ♦ శా పరిపూర్ణ యశఃప్రదీప్తముల్
విలయిత పాపసంచయము ♦ విశ్రుత యాగము పుణ్యవంతమున్
జ్వలిత విశిష్టకర్మము ప్ర ♦ శాంత తపోమయ రాజకృత్యమున్. 126

చ. మును తపముండె వృత్రుఁడని♦మోదము బాసి సురేంద్రుఁడంత, నె
మ్మనమునఁ గిన్కఁబూని, చని, ♦ మాపతి రక్షణమాశ్రయించి, వృ
త్రుని తప మంతరించెడి గ ♦ తుల్ గనకున్న, నజేయుఁడౌను, నా
తని దునుమాడఁగాఁదగిన ♦ దక్షుఁడ వంచు నుతించె నా హరిన్.

చ. అసురుఁడు హానియాట దివి♦జాధిపుఁ డొందె భయంబు, గాని,యా
యసురుఁడు ముష్కరుం డనఁగ♦నౌనె? జగత్రయమేలె లోకముల్
వ్యసనముఁజెందకుండ, ఋజు ♦ వర్తన ధర్మ పరాయణత్వమున్
బస చెడకుండ; నట్టి గుణ ♦ వంతునిఁ దాపసిఁజంప నొప్పునే? 128

తే. అతఁడు పాలించె రాజ్యంబు ♦ నమృత వృష్టిఁ
గామధేనువు వోలె లో ♦ కములు పండె
నేఁడు తప మున్నవాఁడు, వ ♦ నీ గతుండు
మత్ప్రియుం డని పల్కె ర ♦ మా ధవుండు. 129

ఉ. ఆతనిఁ జంపనేర నని, ♦ యా హరియున్ దివిజాభిమానియై
ప్రీతి స్వకీయ తేజ మిడి ♦ పెంచె బలం బసురారి యందు; సం
పాత మొనర్చె పాణితల ♦ వజ్రహతిన్, సురనాథుఁ డంతతో
భీతిలి, బ్రహ్మహత్య వెను ♦ వెంటఁబడన్ దిరుగాడె లోకముల్. 130

ఆ. బ్రహ్మహత్యఁ గలుగు ♦ పాతకం బుగ్రమై
కట్టి కుడుపదొక్కొ ♦ కాలునైన
జగతి దాఁటియున్న ♦ సాంద్ర తమంబున
నాకవిభుఁడు దిక్కు ♦ లేక డాఁగె. 131

ఉ. పాహి జగత్పితా! విబుధ ♦ వర్గ నుతా! మునిలోక పూజితా!
పాహి ! పాపరా! భువన ♦ భార భరా! నిఖిలేశ్వ రేశ్వరా!
పాహి ాధవా! నమిత ♦ పద్మభవా! జగదాది కేశవా!
పాహి జ న్మయా! దురిత ♦ వారలయా! శ్రితకోటి సత్ప్రియా!

చ. అని నుతి సేయసాగి దివి ♦ జావళి యా హరిమ్రోలఁజేరి, "నీ
యనుపమ తేజమే తపసి ♦ హత్య నొనర్చెను, బ్రహ్మహత్య, యిం
ద్రుని తలపైఁబడెన్ దొలఁగ ♦ ద్రోయుము" నావుడు శ్రీశుఁడంత వే
పౌనరుప నశ్వమేధము స ♦ మూల వినాశనపా నఘం బనెన్.

చ. దివిజుల ఱేఁడు తే జుడిగి ♦ తీవ్ర తమంబున డాఁగియుంట, సం
భవమయి కాటకంబు భువి ♦ వానలు లేమి జలాశయంబులున్
భువిజములున్ వనంబులును ♦ భూములు సర్వము నెండిపోవుటన్
సవ మొనరించి రా సురలు ♦ శక్రునిఁగాంచి యఘంబు ద్రెళ్ళఁగన్.

తే. అశ్వమేధంబు తుదముట్టె ♦ నఘ మొకండు
వర మడిగె నిట్లు సురనాథు ♦ వదలిపోవ,
"వర్షఋతువున నదులలో ♦ నరలు దాన
భూతలము నందుఁ జవుడుగాఁ ♦ బుట్టు దాన. 135

తే. ఋతుమతులఁ జేరి మదము ల ♦ యించుదాన
బ్రాహ్మణులఁ జంపు నరులలోఁ ♦ గ్రాలు దాన

నాలు గంశంబులం జెంది ♦ నాలు గింటఁ
బాద భాగంబుగోని యేను ♦ బరగు దాన. 136

తే. సురలు మెచ్చుచు నిచ్చిరి ♦ వరము నంత
బ్రహ్మహత్యయుఁజనె సుర ♦ రాజు వీడి
యనుచు సౌమిత్రి యన్నకు ♦ వినుతి సేయ
నశ్వమేధంబె తగునంచు ♦ నవని పతియు. 137

ఉ. తమ్మునిఁ జూర్చి పల్కె- వసు ♦ ధాపతి కర్దమసూను గాధ మో
దమ్మున; బాహ్లికేశ్వరుఁడు ♦ ధర్మముఁబాయక రాజ్య మేలుచున్
నెమ్మదినుండి వేఁటకు వ ♦ నీపథ మేగి, యుమాశివుల్ రహ
స్యమ్మునఁ గ్రీడ సల్పుతటి ♦ నచ్చట జొచ్చుట సుందరాంగియై.

చ. శివుని భజించి స్త్రీత్వము న ♦ శింపఁగ, ముందు వరంబుఁగోరె,భూ
ధవునకు నీశ్వరుం డదియ ♦ దాన మొసంగ నిరాకరించుటన్
భువనములెల్లఁ బ్రేముడిని ♦ బ్రోచెడి తల్లిని సర్వకర్త్రినిన్
స్తవ మొనరించె భక్తిని ప ♦ దంబుల వ్రాలుచుఁ బుంస్త్వసిద్ధికై.

క. కింకరుఁడై కడు వేఁడఁగ
శాంకరి యా నృపునిఁ గాంచి ♦ జాలిం బడుచున్,
జంకక నర్ధవరం బిడె
శంకరుఁడే పూర్తిఁజేయ ♦ శక్తుం డగుటన్. 140

క. అల వరసిద్ధినిఁ గర్దమి
యలి వేణిగఁ బురుషుమాడ్కి ♦ నలరుచునుండెన్
నెల కొకరితిగ మారుచు
నిల యని పేరొంది ♦ ధాత్రి నేలుచునంతన్. 141

క. పొలతుక యయి తపసి బుధున్
వలపుల మురిపింపఁ, జాలు ♦ వర్ధిల సాగెన్
నెలలటు తొమ్మిది గడవఁగ
నలరుచుఁ గనియెన్ బురూరు ♦ వాఖ్యుని పుత్రున్. 142

చ. అరుగఁగ నొక్క- రే డిటుల♦నా శశిసూనుఁడు మోదమంది, 'భూ
వరునకు శాపముం దొలఁగు ♦ పద్ధతిఁ గర్దమ సూక్తి వట్టి, శం

కరుణకుఁ బ్రీతిగా జరుపఁ ♦ గా హయమేధము; శాపనాశమై
పురుషతఁగాంచి పూర్ణముగ♦భూమినిఁ గార్దముఁ జేలెఁ బిమ్మటన్ 43

ఆ. అశ్వమేధ సవన ♦ మనుపమానము, సర్వ
సౌఖ్యకరము, గలుష ♦ సంహరమ్ము,
నిహ పర ప్రదమ్ము ♦ నిష్టార్థ ఫలదమ్ము
యాగ రాజ మాట ♦ నాచరింతు. 144

## ఆశ్వాసాంత పద్యములు

శా. కంటిన్ నిన్ గల, గౌతమీజలములన్♦గాకుత్స్థ! స్నాతుండనై,
వెంటన్ జానకి లేదు, లక్ష్మణుఁడు నిన్ ♦ వెంటాడి రాలేదు, నీ
వొంటిన్ బల్లకి నెక్కి వచ్చి "పరత ♦ త్త్వోపాసనం దెల్పుమీ
జంటన్ర"మ్మని యొద్దఁజేర్చి చనితో,♦సంతృప్తి గా దాత్మకున్. 145

ఉ. పరతత్త్వార్థము కర్మయోగమున లో ♦ పంబొక్కొ సత్కర్మమే,
పరమార్థంబుగ నెంచి యింతవఱకున్ ♦ బాటించినాఁడన్ దయా
కర! నేఁడో? పరతత్త్వబోధనము నా ♦ జ్ఞాపించినావొక్కొ? నా
తరమా? పామరుఁడన్ద్వదీయగుణ వి ♦ ద్యాశేముషీహీనుఁడన్ 146

శా. నీ సందేశము బోధగాదు మదికిన్ ♦నీ వేసముల్ మానుమా
మోసంబేల?త్వదీయ రూపమున భూ ♦ పుత్రీ సమేతంబుగా
దాసుం జూడఁగ రమ్ము, వచ్చి భద్రాం ♦ తర్యమ్ము నాకిమ్ము, స
న్యాసంబో? మఱియేమొ?నాకు భవిత♦వ్యం బెట్టిదో తెల్పుమీ 147

మ. సకలానూన సుఖ ప్రమోదకర స ♦ త్సాంగత్య సంపాదిత
ప్రకటార్థ ప్రథితుండు గా మనవలెన్ ♦ రాగంబునందున్న, లే
క కళోపాసన చిత్త వర్ధక ధృతిన్ ♦ గాంతాం వా ంబు సం
దొకచో, నిశ్చలమానిగాఁదగును ద్యా ♦ గోపాసకుం డెప్పుడున్ 148

తృతీయాశ్వాసము
సంపూర్ణము,



ఓమ్

శ్రీరామాయ నమః

# గోవింద రామాయణము

## ఉత్తర రామ చరితము

## నిర్గమనాశ్వాసము

క. పుట్టించుచుఁ బోషించుచుఁ
గిట్టించెద వేల ? సృష్టి ♦ క్రీడయొ నీకున్ ?
గట్టిడి వనరోకా లోకులు ?
కట్టా ! తగునోకో ! కీర్తి ♦ కామా ! రామా !

### అశ్వమేధ యాగము

ఉ. రాముని పంపునన్ మునులు ♦ రాఁ, దగు దీవెనలంది, వేల్మికిన్
నైమిశ గోమతీ తటము ♦ నం బటవేశ్మము లెత్తి, సజ్జన
స్తోమముతృప్తులై తనరు ♦ చొప్పున మజ్జన భోజనాదులన్
నేమముతో నమర్ప నవ ♦ నీపతి దెల్పె సుమిత్ర పట్టికిన్. 2

ఉ. మానులు ధర్మవర్తనులు ♦ మానిత రాజ కులావతంసులున్
గాన కళా ప్రవీణులగు ♦ గాయకులుం, నటశేఖరుల్ ద్విజుల్.
వానరయూథ ముఖ్యులును ♦ వాయుసుతుండును, వారి నేతయున్
దానవరాజ శేఖరుఁడు ♦ దైత్యులు వచ్చిరి రాము పిల్పునన్. 3

ఉ. పిన్నలు, పెద్దలుం, వివిధ ♦ విద్యలు నేర్చినవారు, సర్వ సం
పన్నులు బీదవాండ్రడు కడు ♦ పాపలు తల్లులు యాచకుల్ సదా,

వన్నెల మేల్ముసుంగులను ♦ భాసిలు నంతిపురంబు వారలున్
జన్నముఁ జూడవచ్చిరి, ది ♦ శావలయంబున నుండి వేడుకన్. 4

చ. భరతుఁడు వానితమ్ముఁడును ♦ భక్తిని భూపులు దెచ్చు కానుకలా
దరమునఁ గొంచు మన్ననలఁ ♦ దన్పుచు నుండిరి, సౌరితో వనీ
చరులు ధరాసురాళి పరి ♦ చర్యలఁ బూనిరి, భక్తితో నిశా
చరులు విభీషణుండు ముని ♦ సంఘముఁ గొల్చిరి జాగరూకులై. 5

చ. సవన తురంగమంబు భువి ♦ సర్వదిశల్ దిరుగాడ రక్షణన్
దవిలి చరించె లక్ష్మణుఁడు ♦ తజ్ఞులు ఋత్విజు లెచ్చరింపఁగా
నవని విభుండు రాఘవుఁడు ♦ యాగము సల్పుచు మోదచిత్తుఁడౌ
భువి సుత స్వర్ణవిగ్రహము, ♦ పొంత మహోత్తమ దీప్తులీనఁగన్. 6

ఉ. ఓదన సౌష్ఠవంబు రుచు♦లొల్లరొ ? సూపము లోటుఁ జెందెనో ?
యేది కొఱంత? మీమనసు ♦ కెయ్యది హర్షమటంచు ? వేఁడుచున్
గాదనుదానిఁ ద్రోయుచును ♦ గామ్యము లిత్తురు రాజపాచకుల్
లేదనుమాట లేదు క్రతు ♦ లీలలఁ జూడఁగ వచ్చు వారికిన్. 7

చ. సురుచిర వస్తు సంపదలు ♦ సొమ్ము లమూల్య దుకూల జాలముల్
కరములఁ జాపుటే తడవు ♦ గా నెవ రేయది గోర దానినే
యరయక తారతమ్యముల ♦ యాచకకోటి కనుగ్రహించు, భూ
వరుఁడగు రామభద్రుఁ డని ♦ వారిత దానగుణ ప్రపూర్ణుఁడై. 8

ఉ. చీటికి మాటికిన్ విసుగుఁ ♦ జెందెడి రీతిగ రాఁగ యాచకుల్
మాటకునైన "మీరు బహు♦ మానితులైతిరిగాదె? యిప్పుడే
యేటికి వచ్చినారు తగు ♦ నే" యని పల్కెడివారు లేరు; మో
మోటముఁ జెందఁగాఁ దగిన♦పోల్కి యొకించుకయైన లే దటన్. 9

ఉ. కాలగతిన్ జయించి బహు ♦ కాలముఁ గాంచిన యోగిపుంగవుల్
పోలిక లేదులేదు క్రతు ♦ వుం బరికింపఁగఁ బూర్వకాల మం
దేలిక యెవ్వఁడేని చరి ♦ యింపఁడు జన్నమునందు రామ భూ
పాలుని మాడ్కి, నంచుఁ గయి♦వార మొనర్చిరి సంతసంబునన్. 10

క. తప్పులఁ బట్టఁగఁబో రెవ,
రొప్పులు మూర్తీభవించె ♦ నుర్వీ పతిగా,
మెప్పులు కుప్పలు వడియెను
గొప్పఁగ రఘురాముఁ బ్రజలు ♦ గొనియాడు నెడన్. 11

చ. విడుదులకై యమర్చె రఘు ♦ వీరుఁడు యజ్ఞ పురాంతరంబునన్
గుడిసెలుఁ, బర్ణశాలలును ♦ గొండకుఁ గొల్తలు జూపు సౌధముల్
విడిసిరి మానులున్ బ్రజలు ♦ వీరులు రాజులు బంధుకోటియున్
గడపుచునున్న వారు క్రతు ♦ కాలముఁ బండువుగాఁగ నెల్లరున్. 12

కుశలవ గానము

ఉ. అందొక పర్ణశాలఁ గన ♦ నయ్యెడు శిష్య సమేతుఁడై సదా
నందుఁడు, యోగతత్పరుఁ డ ♦ నారత సత్పథ వర్తనుండు; స్వ
చ్ఛంద తపోమయాత్మకుఁడు, ♦ సత్య వచో నిరతుండు, ధర్మరా
కేందుఁడు, వాల్మికుండు పృథి♦వీశ్వరు యజ్ఞముఁ జూడ వచ్చుటన్.

తే. ఛాత్రులను బిల్చి వల్మీక ♦ సంభవుండు
సవన భూమిని మెలఁగెడి ♦ సరణిఁ దెల్పి
కుశలవులఁ జీరి విధులను ♦ విశద పఱచి
యజ్ఞ పురిలోనఁ దిరుగాడ ♦ నాజ్ఞ నిచ్చె. 14

చ. అరయ వనీ నివాసులయి ♦ యాకుల మూలములన్ భుజించుచుం
బెరిగి; మునీశ్వ రాజ్ఞలన [illegible] మీరక యాదల దాల్చ నేర్చియున్
బరమ పవిత్ర శాంత గ [illegible] భాసితులయ్యు నరేంద్ర నందనుల్
కరము మృగేంద్ర వత్స[illegible]ల ♦ కైవడి నుండిరి శిష్యకోటిలోన్. 15

తే. ముండ్లఁ బొదరిండ్లఁ బెరిగెడి ♦ మొగలి పువ్వు
పరిమళము లీన నిజరూపు ♦ బయటఁ బడదొ?
జడల నల వల్కలాజినా ♦ చ్ఛాదనమున
రూపమును రాచ ఠీవియు ♦ లోప మగునొ? 16

ఉ. కోమలులా కుశీలవులు ♦ కుంఠిత తేజులపూర్వ గాయకుల్
రామ కథా కలాప మధు ♦ ర స్ఫుటగానము, వీణె తంత్రులన్

సీమము తాళముం గలుగు ♦ నేర్పున మేళము సేయుచున్ జన
స్తోమము విస్మయంబు గను♦చున్ వెనువెంటc జరించుచుండcగా. 17

ఆ. సవన తలము నందు ♦ సంయమీంద్రుల కడ,
నృపతు లుండు చోట్ల ♦ విపణులందు
రథ్యలందు రామ ♦ రాజేంద్రు వాకిటc
బాడి రెల్ల జనులు ♦ ప్రస్తుతింప. 18

ఉ. బాలురు పాడువారు, రఘు ♦ వర్యు చరిత్రము పాట, జంత్రమో
త్తాలు గరంచు వీణె, కవి ♦ రాయలు వాల్మికి గ్రంథకర్త; యా
కాలమొ యాగకాలము, సు ♦ ఖప్రద మర్భక నిస్వనమ్ము; భూ
పాలక ముఖ్య సర్వజన ♦ వర్గము గాన రసాబ్ధిc దేలదే! 19

ఉ. ఆలన పాలనన్ సలుపు ♦ చా రఘురాజు సభాంతరంబునన్
బాలురcజేరి, పాట రస ♦ వంతముగా వినిపింపcగోరె, భూ
పాలురు గాయకుల్ కవులు ♦ పండితవర్యులు ధర్మవేత్తలున్
బాలితవర్గము ల్మునులు ♦ బంధువులు న్విని మోదమందcగాన్. 20

తే. రాజమార్గాండుc డా రఘు ♦ రామ రాజు
నిండు పేరోలగంబుండి ♦ నెమ్మిమీర
మునికుమారుల రావించి ♦ వినc దొడంగె
కెరలి పాడెడి వారి సం ♦ గీత మంత. 21

కుశలవులచే రాముcడు పాడించుట

చ. వినును రఘూద్వహుండు తన ♦ వీర కథామయ గీతికాళి; నె
మ్మన మనురాగ పూర్ణమయి ♦ మై పులకింతలు పుట్టుచుండ, లో
చనములు యోజనన్ మొగుడ ♦ శ్రావ్య రసోల్బణ గాన వాహినీ
జనిత తరంగడోలికల ♦ సారెకు సారెకు నూగు లాడుచున్. 22

[illegible]. గారాముల్ కడుచిందులాడెc జిఱుతల్ ♦ గానంబు సేయంగ, నా
ధీరోదాత్త నృపాల వీరకథలన్ ♦ దివ్య ప్రబంధంబునన్,
వీరాగ్రేసరులైన భూమిధవు లా ♦ విఖ్యాత మోదంబునన్
శూరుం డీ రఘురాముcడే యనిరి, సం ♦ శ్లోకించుచున్ వంశమున్.

చ. అటు నిటుఁజూచి రాము ముఖ♦మారసి పాపల మోముగాంచి, వీ
రటవిఁ జరించు బాలకులొ ♦ యందుల కేమికతంబొ? సుందరుల్
జటలను దాల్చి రేల? వర ♦ సంస్కృతకావ్య మెటన్ బఠించిరో!
యెటులు విపంచి నేర్చిరో? య♦దెందులకో? యనిపల్కె రెల్లరున్.

ఉ. అతులిత కోమలద్యుతి స ♦ మంచితముల్ నగుమోము లెంచ, భూ
పతి ముఖబింబ తుల్యములు ♦ వారికి రేనికి రూపు రేఖలన్
జత గనిపించుచున్నది, వి ♦ శాంపతితో ముని బాలక ద్వయీ
గత సదృశత్వ మెల్లరును ♦ గాంచుచు విస్మయ మందిరా సభన్. 25

ఉ. మార సమానకాంతి సుకు ♦ మారులు మౌని కుమారు లాసభన్
నారదుఁడాది వైణికుల ♦ నైపుణి సీ యనునట్లు పాడుటన్,
భూరమణుండు రాముఁడు ప్ర♦మోదముతోడ బహూకరించె, బం
గారపు నాణెముల్ విరివి ♦ గా నిడి, వైణిక బాలకద్వయిన్. 26

ఉ. బాలకులా సువర్ణనిధి వైపునఁ ♦ జూడరు ముట్టఁబోరు; దు
శ్శీల మటంచు లోఁ దలఁచి, ♦ శ్రీరఘురామనరేంద్ర! మౌను లే
కాలము ముక్కు మూసికొని ♦ కాననసీమఁ దదేక నిష్ఠతో
శ్రీలలనా మనోహరునిఁ ♦ జేతమునం దలపోయుచుండరో. 27

ఉ. వారల కేల యీ ధనము? ♦ వారు పయః ఫల మూల భక్షకుల్
గారొకొ? యోగసిద్ధిఁ గనఁ ♦ గా సుఖదుఃఖము లంతరించు, బం
గారముతో నిమిత్తము వి ♦ కా వికలై చను; నట్టి వారికిన్
భారము గాదొ యీధనము? ♦ పార్థివ? మా గురునాజ్ఞ యిట్టిదే?

క. అను మునిపాపల నుడులన్
జనవల్లభు మానసంబు ♦ సంకోచింపన్
విన నెంచుచుఁ జెఱుతల కథ
వెనువెంటనె యతఁడు ప్రశ్న ♦ వేసెన్ ప్రేమన్.

ఉ. ఏరిని గూర్చినట్టి కథ? ♦ యెయ్యది మూలము దీనికంత? యె
వ్వారు రచించినారు? గురు ♦ వర్యుఁ డెవండు? నివాస మేడ? నీ

తీరున నేర్చుకొంటిమలకు? ♦ దీనిని గానము సేయ నేటికో?
మీరు వచింపుఁడయ్య విని ♦ మెత్తుము; బాలకులార! వేడుకన్. 30

ఉ. నీ యభిమాన మెంచ ధర ♦ శీతలనాథ! ముదావహంబు, రా
మాయణకావ్య మిద్ది! ముని♦మండల పూజ్యుఁడు వాల్మికుండు రా
మాయణ లేఖకుండు, విను ♦ మా! భవదీయ చరిత్రమే సుమా!
ఈ యసమాన కావ్యకథ,♦యీ కవిరాజె గురుండు, మాకగున్. 31

ఉ. పుట్టనుఁ బుట్టినట్టి ముని ♦ ముఖ్యుఁడు పూజ్యుఁడు దేశికుండు; మా
కెట్టుల సెప్పె నప్పగిది ♦ నే భవదద్భుత పుణ్యగాథ ని
ప్పట్టున నాలపించితిమి; ♦ పార్థివ! నీ కృప గల్గియున్న చో
ఘట్టము లన్నియున్ మధుర ♦ గానమునన్ వినిపింతు మీగతిన్.

తే. సప్తకాండము లేనూరు ♦ సర్గములును
వివిధ శతగాథలును ధర్మ ♦ విస్తరములు
నగు చతుర్వింశతి సహస్ర ♦ మైన శ్లోక
ములును రామాయణంబునఁ ♦ గలవు రామ! 33

తే. సవన వాటిక దరిఁ బర్ణ ♦ శాల నుండె
మా గురూత్తముఁ డాముని ♦ మహితుఁ డిచట
రామ! త్వచ్ఛుభాశుభము స ♦ ర్వమ్ము వ్రాసె
దివ్యదృష్టిని వాల్మీకి ♦ భవ్యమూర్తి. 34

తే. ఇందు నిరువది సర్గమ్ము ♦ లేము నేఁడు
పాడి యుంటిమి, తక్కిన ♦ భాగ మెల్ల
పాడువారము తుదముట్టఁ ♦ బ్రతిదినంబు,
గురుని యనుమతి నీయానఁ ♦ గొలువు లోన. 35

చ. అని యిటు లర్భకుల్ పలుక ♦ నాదరణంబున వారిఁ జూచుచున్
జనములు సంతసంబు గన ♦ జన్నపుఁ గృత్యము లెల్లఁ దీర్చుచున్
దినదినమున్ నృపాలకుఁడు ♦ దీరిక వేళల నాత్మ గేయమున్
వినుఁ దన కొల్వులోనఁ బృథి♦వీసుత చొప్పులు సంస్మరించుచున్. 36

చ. వినివిని రాముఁ డాత్మకథ ♦ వీనుల విందుగఁ గొన్నిరోజు లా
తనయులఁ గన్న తల్లి వసు ♦ ధాసుత యంచుఁ దలంపలేదొ ? యే
వనితకుఁ బుట్టినార నెడి ♦ ప్రశ్నను వేయఁడు ! తండ్రిఁ గూర్చియుఁ
గనుఁగొన నెంచబోఁడు రఘు♦కాంతుని వర్తన మెంత వింతయో. 37

చ. ఇనకుల వంశదీపక న ♦ రేశ్వరు నుత్తమగాథఁ బాడుచున్
గనుచు నిజాస్యసన్నిభ ము ♦ ఖంబును గట్టెదుటన్, రఘూత్తమున్
జనకునిగాఁ దలంపరొకొ ? ♦ జానకి తల్లి యటం చెఱుంగరో ?
ముని కడనే మెలంగుటను ♦ బుట్టిన దాదిగ బాలగాయకుల్. 38

ఉ. తుంగ తరంగ మాలికల ♦ తో, సగ ముత్తరకాండ మందె, యు
ప్పొంగెను మోహవారినిధి ♦ భూపతి కాత్మను వారిపట్ల; సీ
తాంగన ముద్దుబిడ్డలని ♦ యాత్మజు లంచుఁ దలంపుఁగల్గి, యె
బ్భంగిని నీషణత్రయము ♦ బారికిఁ జిక్కఁడు రాఘవేంద్రుఁడుర్.

## వాల్మీకికడకు రాముని రాయబారము

ఉ. అత్తటి రామరాజ హృద ♦ యంబు కలంగెనొ ? లేదొ? కాని, యే
తత్తరపాటు నొందక ని ♦ దానముతోఁ దలయూచి, రాఘవుం
డత్తపసుల్ సభాస్థలము ♦ నందలి యెల్లరు నాలకింప, లో
కోత్తర వామలూరుముని ♦ యొద్దకుఁ బొమ్మనె రాయబారులన్. 40

చ. చని మునిఁ గాంచి నా నుడిగ ♦ "సాధుజనస్తుత ! సీత, పూతఁ దా
నని పరిశుద్ధ వర్తనము ♦ నాత్మఁ దలంచిన, నట్లు నాదు కొ
ల్వున శపథంబుఁ జేయుటకుఁ♦బూనునె రేపు త్వదాజ్ఞ" నంచు మీ
రని ఋషిచిత్తమున్ ధరణి ♦ జాత్మగతంబు నెఱింగి రండనెన్. 41

క. చని దూతలు ప్రభు నాజ్ఞను,
వినయంబునఁ బ్రణతులగుచు ♦ వివరించిరి, త
న్మునిపుంగవు సమ్ముఖమున
జనకజ శపథంబుఁగూర్చి ♦ జనపతి పలుకుల్. 4

చ. నరపతి దూతలన్ ముదము ♦ నంగని దీవనలిచ్చి సద్యశో
భరితుఁడు, వాల్మికుండు రఘు ♦ వంశ వతంసు మనోగతంబు లో

నరసి; నిజాత్మయందు జన ♦ కాత్మజ చిత్త మెఱింగియుంట; "మా
ధరణిజ తేనియాన శప ♦ థం బొనరించును నిండుఁగొల్వునన్. 43

తే. పతియె దైవంబు సతికను ♦ పలుకు నిజము
సీత రఘురాము నానతి ♦ రీతిఁ బలుకు"
ననఁగ వాల్మీకి, యామాట ♦ లవని పతికి
మనవిఁ జేసిరి దూతలు ♦ మరలి వచ్చి. 44

చ. ధరణి విభుండు దూత గది ♦ తమ్ముల కెంతయు సంతసించి, భూ
సురులును మానులున్ నృపులు ♦ చోద్యముతో విన వాల్మికోత్తముం
గరము నుతించి వారికనె; ♦ "క్ష్మాజ ప్రతిజ్ఞ నొనర్పఁ గొల్వునం
దరమర లేదు, శిష్య నిచ ♦ యంబులతోఁ జను దేరఁ గోరెదన్. 45

చ. వినఁదగు నాదుపత్ని పృథి ♦ వీసుత సేయుప్రతిజ్ఞ, శ్రోతలై
గనఁదగు నెల్లవారు; సుము ♦ ఖంబున వత్తురుగాక రేపు ప్రొ
ద్దున నె; జనాపవాదమును ♦ ద్రోయుటొ? పొందుటొ? తేల్చు బాసకై"
యనె రఘురామరాజు; సభ ♦ నందఱు సన్నుతిఁజేసి రాతనిన్. 46

క. నీవే తగు దీపని కొరు
లే వారలు సలుప నేర ♦ రీ గతి రామా!
భూవర! యంచును, సభ్యులు
వే వాక్కులఁ జెప్పికొంచు ♦ విడుదుల కరుగన్. 47

తే. సభను జాలించె రఘురామ ♦ చక్రవర్తి
గడచె నారేయి కాల చ ♦ క్రంబు దిరుగఁ,
దెల్లవారెను; యజ్ఞ ప్ర ♦ దేశ ముండె
జన తరంగచ్ఛటా రట ♦ జ్జలధి వోలె. 48

## సీతా శపథము

తే. గౌతముఁడు, వసిష్ఠుఁడు గర్గ ♦ గాధిసుతులు
చ్యవనుఁడును నారదుండును ♦ శక్తిమౌని
భార్గవుఁడు పులస్త్యుఁడు భర ♦ ద్వాజుఁడును న
గస్త్య కాత్యాయనులు, వ్యాస ♦ కాశ్యపులును. 49

తే. వామనుఁడు, వామదేవుఁడు ♦ బర్వతుండు
నాదిగా గల మునుల కా ♦ హ్వాన మంపి
సకల శాస్త్రార్థ కోవిద ♦ సంయములను
సవన భూమికి రప్పించె ♦ నవని విభుఁడు. 50

ఉ. పెద్దలు పిన్నలున్ మునులుఁ ♦ బెక్కురు భూపతు లెందఱెందఱో
ప్రొద్దుదయింపకుండఁ గ్రతు ♦ భూమిని మూగిరి, రామభూపుఁడా
ప్రొద్దునఁ గీర్తికాముకులు ♦ పొందు వెతల్ వెదజల్లు చూపులన్
సద్దొకయింతలేని సభ ♦ జానకి రాక నిరీక్షఁ జేయుచున్. 51

ఆ. సర్వ ధర్మవిదులు ♦ సకల జనావళి
సభను గూడియున్న ♦ చంద మెఱిఁగి
యా త్రికాలవేది ♦ యనఘుఁడు వాల్మీకి
సీతతోడ సభకుఁ ♦ జేరె నపుడు. 52

తే. తరుణ మిహిర బింబారుణ ♦ కిరణ దీప్తిఁ
బ్రాగ్దిశాకన్య హారతిఁ ♦ బట్టె ననఁగ
లోకబాంధవుఁ డంత వి ♦ లోకనమ్ము
సలుప నరుదెంచె మైథిలీ ♦ శపథగరిమ. 53

ఉ. కట్టిన నారచీర; కసు ♦ గంది కృశించు తనూ విలాసమున్;
బెట్టెడి కంటిసీరు; ముఖ ♦ బింబమునం గల దీనభావ, మ
ప్పట్టునఁ గాంచి పొక్కిరి స ♦ భాసదులందఱు, సీత కక్కటా!
కట్టెడి ధాత యెట్టి కడ ♦ గండ్లను గూర్చె నటంచు నాత్మలన్. 5[illegible]

చ. కరములు మోడ్చి ఆత్మ నిజ ♦ కాంతుని సంస్మరణంబు సేయుచున్
శిరమును వంచి, దుఃఖము వ ♦ శీకరణం బొనరించికొంచు; సం
భరిత, విషాద పూర్ణ గళ ♦ భారమున న్మని వెంట వచ్చె నా
సురనుతఁ బూత, సీతఁ గన ♦ క్షోభము గల్గదొ యెట్టివారికిన్ ! 55

మ. జనకక్ష్మాపతి ముద్దుబిడ్డ నబలన్, ♦ సామ్రాజ్యదక్షుండు రా
ముని యిల్లాలయి వన్నెఁగన్న ♦ సుదతిన్, మూర్ఖప్రజా నింద లో

గొని ఘోరాటవిలోన డించియును సం ♦ క్షోభించు నర్ధాంగినిన్
గొనిరా నీగతిఁ గొల్వు దీర్చుటకు, సం ♦ కోచింపఁ డా రాముడున్.

చ. కుశలమె జానకీ యనఁడు, ♦ గోమలిఁ జూచియుఁ జాల యేండ్లకున్
గుశలవులన్ వనిం గనుటఁ ♦ గూర్మినిఁ దెల్పఁడు సుంతయైనఁ దా
యశము వరించి రాముఁ, డక ♦ టా! ధరణీసుతయున్ సభాస్థలిన్
నిశ వెలుగొందు చంద్రుగతి ♦ నిల్చెను మానముఁదాల్చి స్తబ్ధయై.

ఉ. రచ్చకు వచ్చి యాత్మసతి ♦ ప్రత్యయమున్ సలుపన్ విభుండు; తా
మెచ్చి పరిగ్రహించెడి ప్ర ♦ మేయముఁ దెల్పఁ డదేల మానితో
సచ్చరితుండు వాల్మికియు ♦ జానకి బాసను సల్పునంతలోఁ
బొచ్చెము లేక రాఘవుడు ♦ వొందునొ? లేదొ! యెఱుంగఁ డేలకో.

తే. తొలుత రఘురాముఁ డంపిన ♦ పలుకు లందు
మాని హితమునుఁ దెల్పిన ♦ మాట లోన
నెంచ బాస సల్పఁగ నిచ్చ ♦ యించినారు
గాని, సీతను గ్రహియించు ♦ కరణి లేదు. 59

క. అంచును, సభయందలి బుధు
లెంచుచు, లోలోన సీత ♦ నిద్ధచరిత్రన్
గాంచుచు, నృపుఁ జూచుచు, సుగు
ణాంచితు మునినాథుఁ జూతు ♦ రలజడిఁ బడుచున్. 60

తే. ముసలివాఁ డయ్యు వాల్మీకి ♦ మునియు నయ్యు
భీషణ ధ్వని దిక్కులు ♦ పిక్కటిలఁగ
నిండు పేరోలగంబున ♦ నిలిచి పలికె
విశద మొనరింతు రాఘవా! ♦ వినుమటంచు. 61

ఉ. ఈ సుగుణాలవాలకు ప్ర ♦ దీశ్వర భూవర! మత్తపోవనిన్
వాసము సేయ నీవె విడు ♦ వంబడి యొంటిగ లోకనిందకున్
గాసిలుచున్నఁ జూచి ముని ♦ కాంతలఁ జేర్చితిఁ బూత యాటచే
బాసను సల్పు నిప్పుడె స ♦ భాస్థలి నిల్చి! త్వదాజ్ఞ యైనచో. 62

చ. వినుము యథార్థమిద్ది పృథి ♦ వీ ధవు లెల్ల వినన్ వచింతు నీ
వనిత మహాపతివ్రత య ♦ పార మహా బల సన్నివిష్టు లీ
తనయులు; వీర లిర్వురును ♦ దాశరథీ! భవదీయ పుత్రకుల్,
కనినది సీత యీ కవలఁ ♦ గానమందు మదాశ్రమంబునన్. 63

ఉ. తప్పక చెప్పువాఁడ సతి ♦ తంబు ఋతంబునె; జానకీపతీ!
మెప్పువహించి మించిన య ♦ మేయ గుణుండు ప్రచేతసుండు మా
యప్ప, యొకప్పుడేనిఁ గల ♦ నైనఁ దలంపఁగఁబో నసత్యమున్,
దప్పక యింతలేని నిజ ♦ దార తనూజులు వీరు నమ్ముమీ. 64

చ. వర తప మాచరించి బహు ♦ వర్ష సహస్రము, సిద్ధిఁగన్న భూ
సురుఁడ, మనో వచః క్రియలఁ ♦ జొచ్చిన నాదు తపఃఫలం బిదే,
ధరణిజ దుష్టయే యయిన ♦ దగ్ధమగున్, బరిశుద్ధ, పూతయై
వరలిన నాకు లబ్ధమగు ♦ బాస సుమా యిది! భానువంశజా! 65

తే. పతియె దైవంబుగా నెంచు ♦ పరమ సాధ్వి
త్రికరణంబుల సతతంబు ♦ సకల విధులఁ
బాప రహితయు సుత్తమ ♦ వర్తనయును
నంచు నెఱ నమ్మియును నింద ♦ నెంచి నావు. 6[illegible]

ఆ. దివ్య దృష్టి చేతఁ ♦ దెలిసికొంటిని సీత
శుద్ధ చరిత యంచు, ♦ బుద్ధియందు
భూత పంచకమునఁ ♦ బొడసూపె రామ! యీ
సీత నిర్మలాత్మ ♦ పూత యంచు. 6[illegible]

క. జనముల నిందకు లోనై
మనమున శంకించు నీకు ♦ మనసార నిటన్
జనకజ శపథముఁ బల్కెడి
పెనిమిటి హిత మెంచి పాప ♦ విరహిత యయ్యున్. 6[illegible]

తే. అనుచు వాల్మీకి భాషించు ♦ నంత, నృపుఁడు
మునికిఁ బ్రత్యుత్తరం బిచ్చె ♦ జనుల మధ్య

హస్తయుగ్మంబు మోడ్చి న ♦ యంబు మీర
నిలిచి యుండిన దేవ వ ♦ ర్ణినినిఁ గనుచుఁ 69

ఉ. ఒప్పుల కుప్ప సీత యని ♦ యొప్పుగ నెమ్మది నాటు నట్లుగాఁ
జెప్పితి రయ్య నేఁడు; ముని ♦ శేఖర! నేనును విశ్వసించితిన్;
దప్పక యింతలేని వసు ♦ ధా సుత నంపితి వన్యభూమికిన్
దెప్పకుఁడీ! క్షమింపుఁడి మ ♦ దిన్ దిగులొందితి లోకనిందకై. 70

చ. అనలముఁ జొచ్చె నాఁడు వసు ♦ ధాత్మజ; కల్మషహీన, శుద్ధయం
చనిరి సురాళియున్ మునులు; ♦ నంతట నింటికి వెంటఁ దెచ్చియున్
జనము వచించు నింద వినఁ ♦ జాలమి నీవని కంపియుంటి, నీ
తనయులు సీతపుత్రకులు ♦ తథ్యము; నమ్మితి నా తనూభవుల్. 71

ఉ. ఆపె విశుద్ధ యయ్యెఁ, బ్రజ ♦ లందఱు మెచ్చ; జనాపవాదమున్
బాపుకొనంగఁ జేయఁదగు ♦ బాసను; జానకి శంక దక్కి "యే
పాప మెఱుంగ దీ మహిజ; ♦ పార్థివ రాముని ధర్మపత్నిలో
లోపము లేదు లే దనఁగ♦లోకులు; రూఢినిఁ బొందఁగాఁ దగున్" 72

చ. అని రఘురాముఁ డాడఁగ స ♦ భాంతరమందు మహామునీంద్రుతో,
విని యజుఁడున్ సురాదులు ది ♦ విం బరివేష్టితులైరి; చూడఁగాఁ
జనకజ సేయు ప్రత్యయము, ♦ సంభ్రమ మొప్పఁగ వారిఁ గాంచి ప
ల్కెను మఱియొక్క మాఱటు చ♦లింపక రాముఁడు ధీర చిత్తుఁడై.

చ. కరములు మోడ్చి, సీత మమ♦కారము వీడి జగంబుఁ జూచుచున్
శిరమునువంచి; ధాత్రియెడఁ ♦ జేర్చుచు దృక్కులు, నిశ్చితాత్మయై
యరమర లేక రాఘవ ప ♦ దాంబుజ సన్నిధిఁ జిత్త ముంచి; యె
ల్లరు వినుచుండ వాకొనఁ గ ♦ డంగె సభా జన తాంతరంబునన్.

ఉ. జానకి, రామరాజ సతి, ♦ సల్పునిటన్ శపథంబు, సంతతం
బేను మహా పతివ్రతగ ♦ నీ రఘు రామునిఁ దప్ప, నన్య నా
మానస మందు నెంచకయె ♦ హృత్స్థలి నుండిన మాట సత్యమే
యైన యెడన్ బిలంబు నిడు ♦ మాత్మజ కిప్పుడె తల్లి! మాధవీ! 75

చ. ఆసతి పల్కె, రామ విభు ♦ నాజ్ఞఁ బ్రతిజ్ఞను సల్పుచుంటి; నేఁ
బూనిక తోడ రాఘవుని ♦ పూజల నాత్మ నొనర్తు నేని; అ
వ్వాని మనో వచః క్రియలఁ ♦ బాయక నిశ్చల సంస్మృతిన్ సదా
యేను చరింతునేని బిల ♦ మీయఁగ వేఁడెదఁ దల్లి! మాధవీ! 76

చ. ఏను రఘూత్త మేతరుల ♦ నెన్నఁడు నాత్మఁ దలంప నంచు నీ
మానవ లోక విశ్రుతు ల ♦ మానుషు లా సురలోక ముఖ్యులున్
గానఁగ, నిందు నాదు రఘు ♦ కాంతుని కిచ్చిన బాస సూనృతం
బైన, బిలమ్ము నిమ్ము విన ♦ యమ్మున వేఁడెదఁ దల్లిమాధవీ! 77

చ. అని యిటు మూఁడు మారులు ధ ♦ రాత్మజ తల్లిఁదలంచి పల్క,భూ
మిని విదళించి వేయుచు న ♦ మేయ మరీచుల దివ్య దీప్తితో
ననుపమరీతి నా సభ మ ♦ హాద్భుత మంచుఁ దలంప, నొక్క యా
సన ముదయించె భూతనయ ♦ సన్నిధి, దిక్కులు ప్రజ్వలింపఁగన్.

ఉ. భూమి, పతివ్రతా శపథ ♦ మున్ విని, యాత్మజ దీక్ష నిల్ప, గా
రాముని దివ్యరూపమున ♦ రాజ సభాస్థితయై, మృదూక్తులన్
భూమిజఁ గౌఁగిలించి, ముద ♦ ముం గని, రత్న మహాసనంబుపై
రామ నరేంద్రు పత్ని నిడి, ♦ రమ్మని తోడ్కొని పోయె లోనికిన్.

ఆ. భూమి తనయ యిట్లు ♦ భువి వీడి పాతాళ
మేగుచోఁ బ్రసూన ♦ వితత వృష్టి
గురిసె నామెపైని ♦ గొండాడఁ గడఁగిరి
మునులు బుధులు సురలు ♦ జనము లెల్ల. 8(

ఉ. శోక దవాగ్ని పాల్పడిరి ♦ చూచిన వారలు, లోక మాత భూ
లోకముఁ బాసిపోవఁ బ్రదుటి ♦ లో క్షుభితాత్మకులౌచు, జానకీ
పావిత శుద్ధ జీవనముఁ ♦ బల్మరు మెచ్చుచు, రాము దూఱుచున్
లోకమునోరు మూయఁగలఁ ♦డో యెవఁడైనను! మూఁకుడున్నదో

చ. పరమ పవిత్ర యీజనక ♦ పార్థివ పుత్రిక , భర్తృ ధర్మమే
సరణినిఁ దప్పియుండె? రఘు ♦ చంద్రుని జీవిత గాథ యంతయున్

బరఁగెనో ధర్మవంతమయి? ♦ భ్రష్ట వివేకత గాదొ రాముఁడీ
కరణిని ధర్మపత్ని కడ ♦ గంట్లకుఁ గారణ మాట! యక్కటా. 82

చ. జనకుఁడు లోఁ దలంపఁడొకొ ♦ జానకి కష్ట పరంపరా గతిన్!
మనమున నెంత గుందు నొకొ ♦ మాధవి గైకొనినట్లు విన్న? రా
ముని కర యుగ్మ మందుఁ దన ♦ పుత్రిక నుంచిన నాఁట నుండి వే
దన యనుభోజ్యమాట నెడఁ ♦ దన్ దిగులెంతగ నొందుచుండునో!

చ. తన సతియైన మాత్ర వని ♦ తక్ జనకాత్మజ రచ్చకీడ్చి, పా
వని వని తెల్పుమంట పరు ♦ వా? యన రాముఁడుమామ కేమనున్?
జనక మహానృపుండు తన ♦ జానకి యేదని ప్రశ్నఁ జేయుచో
నినకుల దీపకుం డగు న ♦ రేంద్రుఁడు మారుగ నేమి చెప్పునో! 84

సీ. ఆ లీల రాజ్యంబు ♦ నంతయుఁ బోనాడి
వని కేగునాఁడు వెం ♦ బడిని రాదొ?
ఎనలేని సుఖములు ♦ జనకు పెంపునఁ బొంది
వనమునం దిడుమలు ♦ పడయ లేదొ?
సురవైరి హరియింప ♦ నిరతంబుఁ దపియించి
పతిరాక కగచాట్లఁ ♦ బడఁగ లేదొ?
ప్రాణనాథుని యాజ్ఞ ♦ వహ్నిలోపలఁ జొచ్చి
శుద్ధాత్మ యనుచుఁ సం ♦ స్తుతినిఁ గనదొ?

తే. చూలు దాల్చియు వనికంప ♦ సుక్కి సుక్కి
బ్రతికి యుండదొ? రాఘువ ♦ వంశ మెంచి,
సతిని శుద్ధ చరితను ని ♦ ష్కారణముగ
భూమి కర్పించితో సాను ♦ భూతిఁ దక్క. 85

ఉ. బాస యొసంగు నంతటఁ బ్ర ♦ వాసముఁ బాపి యయోధ్యలోన, నీ
వాసముఁ జేర్పఁగాఁ గల సు ♦ భాషిత మేమియుఁ దెల్పవైతి; నీ
భూసుత దాని నాత్మఁ దల ♦ ఁపేసియె చొచ్చెనొ మాతృకుక్షిలో?
దోసము నీది గాదొ? గుణ ♦ దోష విభేదము లేదొ తేనికిన్? 86

ఉ. శిష్ట వసిష్ఠమౌని యభి ♦ షేక ముహూర్తము వెట్టె, నయ్యదే
దుష్ట ముహూర్తమాయెఁ, గడు ♦ దుర్భర కానన వాస బీజమై
కష్ట లతా నికుంజ తరు ♦ కాండము జీవిత మయ్యె రామ! నీ
చేష్టల వక్రతా గతికి ♦ సీత యలంగియె భూమిఁ జొచ్చెనో ? 87

చ. సతి కుపితాత్మురా లగుచుఁ ♦ జయ్యనఁ గ్రోధ గృహంబుఁ జేర; భూ
పతి వెఱపొందఁగాఁ దగునె? ♦ పత్ని యభీష్ట మెఱుంగకుండ వాం
ఛిత మొనరింతు నం చనఁగఁ ♦ జెల్లునె? వృద్ధనృపుండు కైక కా
గతి వరమిచ్చెటే పుడమి ♦ కన్నియ కీగతిఁ దెచ్చె రాఘవా! 88

తే. అరయ సత్య ప్రతిజ్ఞకై ♦ యంచుఁ బంపె
నిన్ను శ్రీరామ ! నీ తండ్రి ♦ మున్ను వనికి,
నీవా ? సత్యపరాక్రమ ♦ నియతి నుండి
ప్రతినఁ బల్కించి పత్నినిఁ ♦ బాసి నావు ! 89

తే. ఏది సత్యసంధత ? కన, ♦ లేదు క్రియల;
రాజ్య మొసఁగెద నంచు నో ♦ రారఁ బలికి
యశము విడనాడి మరునాఁడె ♦ దశరథుండు
ఘా మ్మనఁగ లేదా వనిఁబట్టె ♦ పుత్రు నిన్ను? 90

తే. అంతరాత్మ ప్రవృత్తిచే ♦ నవని జాత
వీత కల్మష యని నమ్మి ♦ వీడు టందు,
దోషిణిగ బాస సేయించు ♦ వేష మందు,
సత్య మెక్కడ ? విక్రమ ♦ సరణి యేది ? 91

తే. అబల లాడెడి మాటల ♦ కవని విభుఁడు
శిరసు లొగ్గుట తగునొక్కొ ? ♦ చేటుగాదొ ?
తండ్రియును నీవు భార్యల ♦ తలఁపు కొఱకుఁ
బడఁగ రానట్టి బాముల ♦ పాలు గారొ ? 92

ఉ. త్యాగి వటంచు నిన్ను సత ♦ తంబును లోకము కీర్తిసేయు, నీ
త్యాగ మదేమిటోయి? వసు ♦ ధాపతియాజ్ఞను మీరుటెట్లు? నీ

రాగమ్ము, రాజ్యకాంక్షయుఁ బ ♦ రాజిత మయ్యె, వనీ నివాస ము
ద్యోగముగా విధింపఁ బడి ♦ యుండుటఁ; దప్పనె జానకీపతీ! 93

ఉ. ఆఁడుది కోరఁగాఁ దగుదు ♦ నంచును, మేటి మగండ నంచు, వె
న్నాడవొ నాఁడు మాయ హరి ♦ ణంబును లోకము గోడిపాటిగా!
దోడును నీదు వెంటఁబడెఁ ♦ దొయ్యలిఁ రావణుచేతఁ జిక్కె, నీ
పోడిమి యేడఁబోయినది ♦ హో! భవితవ్య మెఱుంగ నేఱవో? 94

ఉ. పక్షికి మోక్షమీయఁదగు ♦ ప్రజ్ఞగలట్టి మహానుభావ! నీ
లక్షణమా? యవజ్ఞగతి ♦ లక్ష్యముఁబాసి ధరాసుతా వియో
గాక్షత శోకమగ్నత వ ♦ నాంతరమున్ దిరుగాడవే, స్వయం
రక్షణ చేత గాక, పర ♦ రక్షణ మేగతిఁ జేయఁగల్గితో? 95

ఉ. ధర్మము నాల్గు పాదములఁ ♦ దప్పక పాలనఁ జేసినావొ? బల్
వర్మవు! సాలవృక్షముల ♦ ప్రక్కన డాగిన హేతు వేమి? నీ
మర్మ మెఱుంగ నోపని య ♦ మాయికు వాలిని జంపితేల? దు
ష్కర్మముగాదొ? రామ! యిది ♦ శాశ్వతమైన కళంకమే సుమా. 96

ఉ. వాలి యమాయికుండు "రఘు ♦ వంశ పవిత్రుఁడు, రామరాజు న
న్నేల వధింపఁజూచునొకొ? ♦ యే నపరాధము నొల్ల వాని కే
కాలము నందుఁగాని" యని ♦ గాఢ మతిన్ దన భార్యతో నన్
మూల మెఱుంగ లేక; నృప ♦ పుంగవ! నమ్మిన వానిఁ జంపితో? 97

ఉ. ఎంతటి మోసమో? యినకు ♦ లేంద్రుఁడు రాముఁడు సాధువృత్తి సు
స్వాంతుఁడు, ధర్మతత్పరుఁడు ♦ సంగరవీరుఁడు త్యాగశీలుఁ డా
వంతయు దుష్కృతిన్ సలుప ♦ నట్టి వనేచరుఁ జంపునేఁడ? శ్రీ
కాంతుఁడు లోక నిందితుఁడు ♦ గాఁ జనునేఁడ? యశంబు ద్రెళ్ళఁగన్ 98

ఉ. స్వార్థము నిన్ను సోకినది ♦ యాలి యెడన్ మమకారబుద్ధి, ధ
ర్మార్థముఁ ద్రోసి పుచ్చి, పురు ♦ షార్థము లైదుగఁ జేసినావు; భా
ర్యార్థము సర్వ ధర్మ విల ♦ య మ్మదనమ్ముగఁ జెల్లునంచు! వే
రర్థము లేదు; వాలివధ ♦ కార్త శరణ్యత యంచు బొంకెదో? 99

చ. అరయక చేసినట్టి వధ ♦ యంచు మదిన్ దపియింపవైతి, వీ
వరమర వీడి వాదునకుఁ ♦ బాల్పడి తేల? మనుష్య ధర్మమా,
హరులకు? సాకుఁజెప్పఁదగు ♦ నా పర దార హరుండటంచు? వా
నర పతి మైత్రినే బడసి ♦ నన్ బని దీరదె? కర్మ దప్పునే? 100

శా. భావాతీత గుణ ప్రపూర్ణుఁడనుచున్ ♦ వాల్మీకి కీర్తించుటన్
దేవుండౌ నె నరుండు; దేవునకుఁ బ ♦ త్నీ దుఃఖ మెట్లుండుపో!
నీవే దేవుఁడవైన వారినిధి బం ♦ ధింపన్ గతంబేమి? సం
భావింపన్ ద్రుటిలోన రావణుఁడు జీ♦వంబుల్ విసర్జింపఁడో? 101

ఉ. సాగిలెఁ దావకీన పద ♦ సారస బంభరమై మరుత్సుతుం
డాగమవేది యేలొకో? య ♦ నార్యుఁడు స్తోత్రపరుండు, భక్తి సం
యోగము,మూఢతత్వమును♦నొక్కటియే! యదె హేతువౌ రమా
రాగ పరా! కపీశ్వరుని ♦ రంజితుఁ జేసితి వయ్య నేర్పుతో. 102

ఉ. వీరుఁడు శూరుఁడంచుఁ గడు ♦ వృద్ధుఁడు దొంగలఱేఁడు వ్రాసెబో
వీరుఁడె! సోదరుండు పృథి ♦ విం బడినంతనె యుద్ధభూమి నే
శూరుఁడు కంటఁబెట్టుఁదడి ♦ శోకములోఁబడి శత్రువర్గ సం
హారము వీడి రాఘవుని ♦ యట్లది చెల్లునె ధీరవృత్తికిన్? 103

ఉ. చంచల చిత్తుఁడీ నృపుఁడు ♦ సాధు మనోగతి లేనివాఁడు; దూ
షించఁడొ నాఁడు సీత దనుఁ ♦ జేరగ వచ్చిన లంకలోన, నే
పంచలకైనఁ బొమ్మనుచుఁ ♦ బామరుఁ డాడెడి రీతి; నాజిలో
నంచిత రీతిఁ జూపియు సు ♦ రారిని స్వీయ సతీ నిమిత్తమై. 104

తే. "రాము పత్నిని హరియించె ♦ రావణుండు
భీరుఁడై రాఘవుఁడు వాని ♦ వీడె ననెడి
యపయశపు భీతి సమరమ్ము ♦ నందు దైత్యుఁ
జంపినాఁడను సీతకై ♦ చంప లేదు.





తే. పరుని చేఁ జిక్కినట్టి లా ♦ వణ్యవతివి,
మిన్నకుండునె రావణుఁ♦డిన్ని రోజు"

లనుచుఁ బలుకాడు నాఁడె నీ ♦ యాత్మ వృత్తి
ప్రాకృతంబని రుజువయ్యెఁ ♦ బార్థివేంద్ర ! 106

తే. శ్లేష్మ మందుఁ బడిన యీఁగ ♦ లీల నీవు
ప్రకృతిలోఁ బడిఁ సుఖ దుఃఖ ♦ వారి రాశి
మునిఁగి తేలుచు నున్నావు ♦ పుడమిఱేఁడ!
తాత వ్రాసిన రేఖలు ♦ తప్పునొక్కొ ? 107

ఉ. రాజద్రోహముఁ జేసినాఁడు పర సా ♦ మ్రాజ్యాధిపుం జేరి, య
వ్యాజోత్పన్న మొకో విభీషణుని స ♦ ద్భావంబు శ్రీరాముపై?
ఆజిం జచ్చెడి భీతియో ? యసుర రా ♦ జ్యం బేలఁగా వాంఛయో?
రాజున్ సోదరుఁ జంపఁజేయు కథకున్ ♦ రామప్రభూ ! హేతువుల్.

ఉ. అన్నల మోసపుచ్చి తగు ♦ నంచును నన్యుల పంచఁబట్టి, య
భ్యున్నతిఁ జెందినట్టి ఘన ♦ యోగ్యులు నీ పరివారమయ్య ! సం
పన్నులఁ జేసినావు పరి ♦ పాలన మిచ్చి, స్వరాజ్య సౌఖ్య గ
ర్వోన్నతి కట్టఁబెట్టితి వ ♦ యో ! తలక్రిందుగ మోసగాండ్రకున్.

ఉ. కాదనఁడాయె రాముని య ♦ కారణ చేష్టల వాయుజుండు, సం
వాదము సేయఁబోఁడు కపి ♦ వంశ నృపుండు; విభీష ణార్యుఁ డా
మోదము గాని యట్టి తల ♦ పుం బ్రకటింపఁడు; నాథుఁడన్న నో
యాదరణమ్ముఁ జూపఁడు ; ల ♦ యమ్మొ సుఖమ్ముగ సీత యెంచదో ?

ఉ. సీతలు లోకమాతలు వి ♦ శిష్ట చరిత్రలు సాధ్వు లెందఱో
భూతల దేవి ! నీకు మును ♦ బుట్టిరి గిట్టిరి నిన్నుఁ జేరి, రా
పూతలు జానకీ తనయ ♦ పొందిన బాములఁ బొంది యుండిరో
చేతము దుఃఖభాజన వి ♦ శీర్ణముగా దురపిల్లి పోయిరో ? 111

తే. ఆమె జీవిత మొక్క మ ♦ హా స్రవంతి
బహుళ కాంతార సీమలఁ ♦ బారి పారి
మెట్ట పల్లము లెన్నెన్నొ ♦ మెట్టి మెట్టి
శాంతిఁ గనదాయెఁ దల్లిఁగో ♦ సమఁయు దాఁక ! 112

ఉ. కుందిరి కొంద ఱందిటులు ; ♦ కొందల మందిరి రాము చర్యకై
కొందఱు, వాల్మికోత్తముఁడు ♦ గూర్చిన రామకథా విమర్శనన్
గొందఱు వాదులోఁబడిరి, ♦ కొందఱు జానకినెంచి దుర్భ రా
క్రందను లయ్యు, రాఘవుని ♦ రమ్యగుణంబుల మెచ్చి రయ్యెడన్.

ఉ. భార్య విశుద్ధ యంచు బహు ♦ భంగుల నమ్మియు లోకతృప్తికై
భార్యను వీడఁగాఁ గలుగు ♦ వారలు లేరు నృపాలరాజి, నీ
కార్యము రామరాజె కల ♦ కాలము లోకము సంస్తుతింప నా
శ్చర్య కరమ్ముగా సలిపె, ♦ సాటి యొకండు గలాఁడె యేనికిన్. 114

ఉ. పట్టినఁబట్టుఁగాక యొక ♦ పట్టున సద్గుణ మేదియైన, నే
పట్టునఁ గాని, సర్వగుణ ♦ వర్గము పట్టదు, రామునందుఁ జూ
పట్టెడి సర్వతోముఖ వి ♦ భాసుర సద్గుణ సంచయంబు ని
ట్ట ట్టనఁ జెల్లునే? రఘు నృ ♦ పాన్వయ రాముఁడు మానవుండొకో?

ఉ. [1]శౌర్యము ధైర్యమున్ నృప వ♦శంబు, లోకండె వధించి దైత్యులన్
శౌర్యముఁ జూపినాఁడు,రిపు ♦ సంచయ సంహారణ ప్రతిజ్ఞలన్
[2]ధైర్యముఁ బూనినాఁడు , శర ♦ ణార్థి విభీషణ రక్షణంబునన్
[3]స్థైర్యముఁజెందినాఁడు,రఘు♦ చంద్రుఁడురాముఁడు మానవుండొకో.

---

1. శౌర్యము:— ఒంటరియయ్యు, నిర్భయుఁడై శత్రుసైన్యంబునఁజొచ్చు సామర్థ్యము. ఖరాదులతోఁ బోరునప్పుడును, రావణుని మూల బలంబులఁ జెండాడునప్పుడు జూపట్టెను.

2. ధైర్యము:— తన కత్యంత హితమగు దానిని కోల్పోవలసి వచ్చినను, దాఁజేసి ప్రతిన చెల్లించుకొనుట. రాక్షసులతోడి పోరాటము మన కేలయని సీతయాఁ మనంబు త్రిప్ప యత్నించినను "జీవితమునైనఁ ద్యజించెదను" అని ఆమె కొ గిన ప్రత్యుత్తరమునఁ దోచును.

3. స్థైర్యము:— శరణాగతులకు శరణం బొసంగుటయందుఁ జలించ కుండుట. విభీషణుఁడు శరణాగతుండైనప్పుడు గోచరించుచున్నది.

ఉ. ఆర్యమతిన్ గపీంద్రునకు ♦ నాసురనేతకు రాజ్య మిచ్చి [4]గాం
భీర్యముఁ జూపినాఁడు, ముని ♦ బృంద వశీకరణాతిధుర్య, [5]సౌం
దర్య నిదాన మేచక క ♦ న త్తను సంపదఁ గ్రాలువాఁడు; [6]మా
ధుర్య పరీత వాగ్విభవ ♦ ధుర్యుఁడు, రాముఁడు మానవుండొకో.

ఉ. కార్యము పట్లఁ బొందక య ♦ కారణ సంశయ మెప్డుగాని, [7] చా
తుర్యముఁ జూపినాఁడు, ముది ♦ తుండయి పేదల నాదరించి [8]యౌ
దార్యముఁ బూని దానము స♦తంబు నొసంగి, యతృప్తిఁజెందు నౌ
దార్యముఁ గల్గువాఁడు, నుత♦దాంతుఁడు రాముఁడు మానవుండొకో.

ఉ. తుల్యుఁడొకండు లేఁడు,గుణ ♦ దోషములెన్నఁడు దన్నుఁ జేర, [9]వా
త్సల్యముఁ జూపినాఁడు నిజ ♦ శత్రు సహోదరుపట్ల, నేగతిం

---

4. గాంభీర్యము:— భక్తుల ననుగ్రహించు పట్టునఁగాని, వారలకోర్కె లీడేర్చుట యందుఁగాని నేమియుఁ దెలియఁబడకుండుట సుగ్రీవుని విభీషణుని తమతమ రాజ్యముల కభిషేకించునపుడును, వనవాసంబునకుఁ బోవునపుడును గూడఁ జూపట్టును.

5. సౌందర్యము:— తన రూపౌదార్యాది గుణంబులచే, ఋషుల దృష్టిని మనంబును నాకర్షించువాఁడు. మునులను మోహింపఁజేయుట.

6. మాధుర్యము:—తీయందనము. లేక, తన్ను ద్వేషించు, లేక చంప నిచ్ఛగించు వారల మనంబును, దృష్టిని గూడ నపహరించుట. తారాసంభాషణంబునను, శూర్పణఖా వచనములందును గాననగును.

7. చాతుర్యము:—శంకల నడఁచిపుచ్చి; దోషము నుద్ఘాటింపని, అజడ క్రియాత్వము. విభీషణునియెడ, అనుమానమును గల్గియుండిన వానరులతో, అతని విషయమై శ్రీరాముఁడాడిన మాటలలో చాతుర్యము విశదము.

8. ఔదార్యము:—ప్రతిఫలాపేక్షలేకుండ దానముచేయు రసికత్వము, లేక దరిద్రునకు హెచ్చుగనిచ్చియు తృప్తిని గాంచకుండుట. కఱ్ఱ విసరివేయ నెంతదూరమేగునో, అన్ని గోవుల త్రిజటుండను పాఱునకు దానంబు చేయుటలో గోచరించును.

9. వాత్సల్యము:—తనకు రక్షింపఁదగినవారలగు నిష్టులయందు దోషంబును తిరస్కరించు బుద్ధి. సుగ్రీవుని, విభీషణుని రక్షించుటయేకాక, "అస్మద్భార్యా హర్త యగు రావణుండె స్వయముగ వచ్చి, వేడినను రక్షించి తీరుదును" అనిన రాముని వాక్యముల యందు వాత్సల్యము గోచరించును.

దుల్గూలు గాని వానరుల ♦ తోఁ సహచర్య మొనర్చినాఁడు [10]సౌ
శీల్యము జూపినాఁడు, గుణ♦సింధువు రాముఁడు మానవుండొకో!

ఉ. మూల్యము సెప్ప లేని రఘు ♦ పుంగవు సద్గుణరాశి కేరు, [11] నై
ర్మల్యము దేహకాంతి నస ♦ మానముగాఁ జెలువారు వాఁడు, [12]నౌ
జ్వల్య మయంబువాఁడు, మది♦వాక్కును, గర్మయు నైక్యమూ, [13]నకౌ
టిల్యము వాఁడు, సూనృత ప♦టిష్ఠుఁడు రాముఁడు మానవుండొకో?

శా. [14]తారుణ్యమ్మె సతమ్ము రాఘవుని స♦ద్ధర్మంబులన్ ద్యోతమౌఁ,
[15]గారుణ్యామృతమూను భూభరణకృ ♦ త్కర్మాళి నిత్యంబు, నౌ
ప్వారున్ దుష్టవిరోధి దాశరథికిన్ ♦ [16]వాల్లభ్య [17]సౌలభ్యముల్,
(శ్రీ)రాముండు మనుష్య మాత్రుఁడొకొ కీ ♦ ర్తింపంగ శక్యంబొకో.

---

10. సౌశీల్యము:– తాను గొప్పవాడయ్యుఁ దనకంటెఁ దక్కువ వారితోఁ గలిసి; మెలసి వర్తించుట; గుహునితోడను, గపుల తోడను మెలఁగిన విధము.

11. నైర్మల్యము:—కాంతిపుంజము. (శ్రీ)రాముఁడు ఇంద్రనీల ఘనశ్యాముఁడనుట యందు ద్యోతము.

12. ఔజ్జ్వల్యము:—ప్రకాశము. ప్రళయకాలాగ్నిఁబోలె వెలుఁగుచు, సూర్యునిఁ బోలె కాంతిమంతుఁడు, అనెడి శ్లోకములలోఁ గననగును.

13. అకౌటిల్యము:—మనోవాక్కాయ కర్మంబు లొక్కటిగ నుండుట. సుగ్రీవ విభీషణులకు రాజ్యప్రదానము చేయుటయే నిదర్శనము.

14. తారుణ్యము:—ఎంతటి దుస్తర కార్యమైనను, వయోబలంబునఁ దుదముట్టజేయు సామర్థ్యము. తాటకాదులఁ జంపుటలోను, మారీచు నుక్కడంచుటలోను, ధనుస్సును ద్రుంచుటలోను, పరశురాముని భంగపఱచుటలోను గాననగును.

15. కారుణ్యము:—తా నొందు ప్రయోజనము లేకున్నను, నితరుల దుఃఖము మాన్పు నిచ్ఛ. ఋషులను రక్షింతునను ప్రతిజ్ఞలోఁ గననగును.

16. వాల్లభ్యము:—సర్వాధిపత్యము, చక్రవర్తి పుత్రుఁడు. అశ్వమేధాదియాగఁ లొనరించుట చేత నెలకొనినవి.

17. సౌలభ్యము:—చక్షుర్విషయము కాని దానియందును చక్షుర్విషయత్వము. "నే నేద్యుండును" ఇత్యాద్యర్థమిచ్చు శ్లోకంబుల గాననగును.

తే. అతఁడు[18] సౌభాగ్య సీమయై ♦ యవతరించె
[19]నానుకూల్యంబులోఁ గర్మఁ ♦ బూనినాఁడు
లేదు [20]చాపల్య మనుమాట ♦ లీల నైన
నఖిల గుణపూర్తి శ్రీరాముఁ ♦ డనఘ మూర్తి. 121

ఉ. కొందఱు రాము నీగతిని ♦ గొప్పగఁ బల్కిరి, కొంద ఱన్ననో
సుందరి జానకిన్ దలఁచి ♦ కోపముతో రఘురాము దూఱుచున్.
జిందఱ వందఱయ్యె సభఁ ♦ జేరినవారల యాత్మలన్ని, వా
రందఱు నెట్టులో యొక తె♦ఱంగునఁ జిక్కిరి చింత కత్తరిన్. 122

ఉ. రామ నరేంద్ర చంద్రుఁడో, ధ ♦ రాస్థలి లోఁగొనునంత ధాత్రిజన్
గాముకుఁడయ్యె నాత్మసతిఁ ♦ గానఁగఁ జాలమి; నెంత వారికిన్
గామము గ్రోధముల్ విడువఁ ♦ గల్గుట సాధ్యమె? తన్ను మీఱటె, యా
భూమి నిజాత్మజాతఁ గొనఁ ♦ బొక్కఁగ సాగెను గ్రోధ తప్తుడై.

ఉ. మోహ నిశీథమందు రఘు ♦ పుంగవుఁ డార్తినిఁ దేజుఁ బాసి, స
మ్మోహక జానకీ విషయ ♦ పూర్వ కథల్ దలపోసికొంచు, జీ
వాహవ మందుఁ జిక్కికొని ♦ యశ్రులఁ గార్చుచు నేకధార, నీ
సాహస మేల నీ కనుచు ♦ జానకి సంస్మృతిలోఁ బడెన్ వెసన్. 124

ఉ. భూరి యశంబుఁ గూర్చితివి ♦ పుట్టిన మెట్టిన యిండ్లకీవు, సీ
తారమణీ! విభున్ విడిచి ♦ తల్లినిఁ బిల్చి చనంగ నౌనె, నీ
దారిని నీవు పోయి పరి ♦ తాపములోఁ బడఁ ద్రోసినావు, నన్
గ్రూరునిగాఁ దలంచితివొ? ♦ రోసితివో మది నాదు చేష్టలన్! 125

---

18. సౌభాగ్యము:—మహైశ్వర్యము, భూమండలాధిపత్యము.

19. ఆనుకూల్యము:—ఇష్టంబగు దానియందు, అయిష్టంబగు దానియందుఁ గూడ సమంబగు వర్తనము. యౌవరాజ్యాభిషేకము నంగీకరించెను, వనంబున కేగుమని నను శిరసావహించెను.

20. అచాపల్యము:—శేయ నిశ్చయించిన కర్మను జేసి తీరుట, రాక్షసులను దునమాడుదునను ప్రతిన నెగ్గించుకొనుటలో స్పష్టము.

(శ్రీ రామాయణ సారోద్ధారమునుండి).

సీ. కోరినయంతనే ♦ కొమ్మరో! వెనువెంటఁ
గొనినాఁడ వనికి నీ ♦ కోఱకుఁ గాదె?
వాలిని వధియించి ♦ భామరో! కపులతోఁ
జతఁ గూడినాఁడ నీ ♦ కతనఁ గాదె?
వారిధి బంధించి ♦ వనితరో! సురవైరిఁ
బరిమార్చినాఁడ నిన్ ♦ బట్టి గాదె?
కడగండ్లఁ గుడుచుచే ♦ కాంతరో! బ్రతుకొచు
మనినాఁడ నీయెడ ♦ మమతఁ గాదె?

తే. పావకునిలోఁ బ్రవేశించు ♦ ప్రతిన నాఁటి
వాల్మికుని యాశ్రమముఁ జేరఁ ♦ బంపు నాఁటి
పలుకు లన్నియు సైరించి ♦ బ్రతికి యుంటి
వకట! నేడేల సైఁపలే ♦ వైతి వబల? 126

ఉ. అత్తవు సుమ్మి భూమి సతి! ♦ యాత్మసఖిన్ గొనితెమ్ము వెంటనే,
బత్తి నొసంగు మన్ననకుఁ ♦ బాత్రమవై మనఁ జూతు వేని నే
నిత్తఱి నూరకుందు నని ♦ యెంచకుమీ భవదీయ సర్వమున్
మొత్తుదు శైల దుర్గ వన ♦ ముల్ నదులున్ నదముల్ నశింపఁగన్.

చ. వివరము నాకుఁ గూడఁ బృథి ♦ వీజకుఁ బోలె నొసంగి యిప్పుడే
భువిసుతతో రసాతలముఁ ♦ బొందఁగ నిమ్ము, సుఖంతు నేడనో
కవ విడకుండ సీత కడ ♦ గన్నుల వెన్నెలఁ గ్రీడ లాడుచున్,
జెవి నిడవేమి? మత్సఖిని ♦ సీతను దెమ్ము వసుంధరా సతీ! 128

చ. కథ వినవొక్కొ? నాకె యప ♦ కార మొనర్తువా! వాలిఁ జంపి నీ
రధి నవలీల దాఁటి, రిపు ♦ రాజ భయంకరు రావణాసురున్
వధ యొనరించి, సీతఁగొని ♦ వచ్చిన నాకు, వసుంధరా! నినున్
శిధిలము సేయ లెక్కయొకొ? ♦ సీతను దెమ్మిఁక, జాగుసేయు దే?

క. ఇటు పలుకొడుచు రాముఁడు
పటుతర గంభీర రోష ♦ భావోద్ధతుఁడై

యటఁ గల సభ్యులఁ జూచుచు
మటమట లాడంగ సాగె ♦ మహిపై సతికై. 130

ఉ. అండజ వాహుఁడయ్యు మను♦జాకృతిఁ గొన్న రఘూద్వహుండు కో
దండము బూనినాఁడు గుణ ♦ దర్పము దిక్కులు పిక్కటిల్ల, భూ
మండల మెల్లఁ దీవ్రతర ♦ మార్గణ శక్తి లయ మ్మొనర్ప, ను
ద్దండ భయంక రాకృతినిఁ ♦ దాల్చుచు ధారుణి కంప మొందఁగన్.

చ. పటుతర విక్రమాన్వితు నృ ♦ పాలుఁ గనుంగొని వారిజోద్భవుం
డటకు సురాళితో నతిర ♦ యంబున వచ్చి వచించె, "భూమి నీ
విటు లయ మొందఁ జేయఁదగు ♦ నే? కమలాపతి వీవు, వైష్ణవ
స్ఫుట కరుణా పరత్వ గుణ ♦ మున్ విడనాడఁగ నీకె చెల్లునా? 132

చ. సరసిజ లోచనా! హృదయ ♦ శాంతినిఁ బొందుము, పూర్వభావ సం
స్మరణము సేయఁగాఁదగు వి ♦ చారము వీడి, త్వదీయపత్ని యా
దరమునఁ జేరు నిన్ను దివి, ♦ ధాత్రిజ భోగిజగమ్ము నందు నే
మఱక నినున్ దలంచుచు, స ♦ మాహిత సౌఖ్యమతిన్ జెలంగెడిన్. 133

ఆ. విశ్వ కర్త వీవు ♦ విశ్వ భర్తవు నీవు
విశ్వ మయుఁడ వౌచు ♦ వెలయు దీవు
విశ్వ నాశనంబు ♦ వేడ్కతోఁ గావించి
మిగిలి వెలుఁగు మొదటి ♦ మేటి వీవు. 134

చ. తొలి కథకుండు వాల్మికియె ♦ తోరముగా రచియించినాఁడు భూ
స్థలి భవదీయ గాథ, విది ♦ తంబు త్వదీయ భవిష్యదంశ మీ
లలిత కృతిన్, సుకావ్య మిది,♦శ్లాఘ్యము రాముఁడె నాథుఁడౌట, నీ
కిలఁ గల శేషకర్మ విను ♦ మింపుగ నాదిమ కావ్య సూక్తులన్. 135

క. వినఁదగు నీ వాకరుండవె
ముని నాథుఁడు వ్రాసినట్టి ♦ ముందున్న కథన్
మును వినియుంటివి నే నది.
యినకులరాజేంద్ర! నిర్జ ♦ రేశుని తోడన్. 136

ద్వి. పంక జోద్భవుఁ డిట్లు ♦ పలు కాడి నంత
జంకక భూదేవి ♦ శబ్దంబు సలిపె. 137

చ. "నరుఁడవు నీవు గావు నర ♦ నాయక ! జానకి గాదు సీత, సు
స్థిర పరశక్తి, ప్రేమమయ ♦ దేవత, దేవుఁడ వీవు సుమ్ము, త
న్నిరుపమ దివ్యతేజ మిట ♦ నీవయి పుట్టెను, బారతంత్ర్యమున్
నెఱపి కృపన్ జెలంగి హరి ♦ నిం గన నేర్పఁగఁ బుట్టె శక్తియున్.

తే. ఆమె దివ్య స్వరూపంబు ♦ నపుడె తాల్చి
సకల సంపత్కరమ్ముగ ♦ సాగి పోయి
చేరె వైకుంఠ ధామంబుఁ ♦ జెలఁగి నీవు
గూడఁ గలవామె పొందు వై ♦ కుంఠ మందు". 139

తే. అనెడి శబ్దంబు భూతల ♦ మందుఁ బుట్టి
నృపుని పేరోలగం బంత ♦ నిండె, నంత
కోపభూయిష్ఠుఁ డారఘు ♦ కుంజరుండు
దాని విని, శాంతిఁగనె; ధాత ♦ "తథ్యమెల్ల" 1

చ. అని, నృపు నూరడించి, ముని ♦ లందఱు వెంబడిరా, సురాళితో
జనెను దివంబు; ధాతనుడి ♦ సమ్మతిగా, మదినిల్పి రాఘవుం
డనిపె జనంబులన్; సుతుల ♦ నాదరణంబునఁ జేరఁదీసి, తో
డ్కొని చని, సాగనంపె ముని ♦ కుంజరు వాల్మికిఁ బర్ణశాలకున్.

తే. అమల సీతా మహా తేజ ♦ మస్త మించె
ననఘు రఘురాము సంతోష ♦ మస్త మించె
నవనిపై జేని కోపమ్ము ♦ నస్త మించె
నపుడె యిన వంశ కరదీప్తి ♦ యస్త మించె.

ఉ. ఆ నిశయెల్ల భూసుత గు ♦ ణాతిశయంబు మదిన్ స్మరించు దే
మైనను మానఁడాయె, లవ ♦ మైన సుషుప్తినిఁ బొందఁడాయె,
జాని సతీప్రియుండు, భువి ♦ జానకి గొన్న విశుద్ధ కీర్తినే
మానసమందు నిల్పియును ♦ మానఁడు సాంద్ర వియోగదుఃఖవ

138 వ పద్యములో 1 వ పాదమునకు మారుగా
నరుఁడవు నీవుగావు, నరనాయక జానకి గాదు, సీత - అని చదువవలెను.

తే. దిన కరుఁడు కర్మహేతువై ♦ తేజ మొందె
రఘువరుఁడు దీర్చె నిత్య క ♦ ర్మంబు లెల్ల
మునివరుఁడు వాల్మికుఁడు బ్రహ్మ ♦ మునుల తోడ
నవని పతి కోర్కెమై వచ్చె ♦ నతని కడకు. 144

తే. కవగ సుతులంత నుత్తర ♦ కాండ మందు
శేషమగా రామ గాథా వి ♦ శేషమెల్ల
నారదుని బోధ రీతి గా ♦ నంబుఁ జేయఁ
గడఁగిరి జనకుండు ముదము ♦ గాంచు రీతి. 145

తే. అపయశము వోయి యపవాద ♦ మంతరింప
మూఁడు లోకంబులును దృష్టిఁ బొందు రీతిఁ
బదియు నెనిమిది మాసముల్ ♦ పార్థివుండు
సవన మొనరించియును నాత్మ ♦ శాంతిఁ గనఁడు. 146

చ. కొలఁది దినంబులిట్లు గడుఁ ♦ గూరిమి నుత్తర కాండమెల్ల, భూ
వలయ విభుండు పుత్రకులు ♦ పాడఁగ సర్వము నాలకించు లో
పల, సవమున్ ముగించి, జన ♦ పాలుర మానుల వీడుకొల్పె, భూ
షల నిడి మన్ననల్ సలిపి ♦ సద్విధి నెల్లర కర్హ రీతులన్. 147

చ. అరయ సతీ వియోగమున ♦ కార్తినిఁ గుందనివార లుందురే
కెరలి సవంబు సల్పి కృత ♦ కృత్యుఁడునై రఘురాముఁ డాలి సం
స్మరణమునన్ దగుల్కొని కు♦మారులు వెంబడిరా నయోధ్యకున్
మరలె, జగమ్ము సర్వమును ♦ మాయగఁ దోచు సతీ వియోగికిన్.

## ఆశ్వాసాంత పద్యములు

శా. కంటిన్, గన్గొనఁ గంటి నిప్పటికి నిన్ ♦ గందోయికిన్ విందుగా
వెంటన్ జానకియున్ సుమిత్ర సుతుఁడున్ ♦ వేంచేయఁగా రాఘవా!
వింటిన్ నీ మృదువాక్య జాలము కృపా ♦ విఖ్యాత సద్గోష్ఠిలోఁ,
దింటిన్ నీ విడినట్టి చక్కెర మహా ♦ దివ్య ప్రసాదంబుగన్. 149

మ. కలయో! కాదది, విభ్రమంబొ? యదియుం ♦ గాదెంచ నిక్కంబె, క
న్నులతోడం గనినాఁడ ముచ్చటల నెం ♦ తో ప్రీతిమై సల్పి కౌఁ
గిలిఁ గోరన్ దయచేసి పాదయుగళిన్ ♦ గేల్మోడ్చి మ్రొక్కన్ దయా
కలితంబౌ చిరునవ్వు నవ్వి హృది పొం ♦ గం జేసి తీవే కదా!

ఉ. చూచితి మాట లాడితిని ♦ జొక్కితి నే ప్రమదంబునందు, నే
నోచిన నోము పండెను గ ♦ నున్ మది శాంతి, త్వదీయ వాక్యముల్
దాచి హృదంతరంబున య ♦ థావిధి నీ స్మరణంబు సల్పుచున్
వేచెద భూత కాల పరి ♦ పీడల విస్మృతిఁ జెందుచుం ప్రభూ! 151

ఉ. రేల జరించెదో క్రొ, కను ♦ ఱెప్పల మూయఁగఁ జూడవత్తు వీ
వేల? దినంబునందె కన ♦ నెంతయొ కోరెడి వాఁడ! రామ! నీ
లీల కిదే ఘనంబె! పవ ♦ లే స్వశరీరము తోడ, భక్తు నే
వేళనొ చూడరమ్ము, మఱి ♦ వేఁడను నిన్ను మఱొండు దృశ్యమున్

మ. ఒక సారే నినుఁ జూచునంత హృది శాం ♦ తోపాసకంబయ్యెఁ, వే
ఱొక మాటే కృపగల్గ నెట్టిఫలమో? ♦ యూహింపఁగాఁ జాలఁ, దా
వక మాధుర్య పరీత సీమ విహరిం ♦ పన్ యోగ నిష్ఠన్ ముని
ప్రకర ప్రక్రియఁ బొందఁజాలుదునె? శ్రీ ♦ రామా! జగత్పాలకా!

చతుర్థాశ్వాసము—సంపూర్ణము.



ఓమ్

శ్రీరామాయ నమః

# గోవింద రామాయణము

## ఉత్తర రామ చరితము

## పునస్సంయోగాశ్వాసము

క. కగములు రెండై, రెండై
మృగములు, నరపట్క మాచు ♦ మేదినిఁ బుట్టెన్
యుగ యుగమున హరి ధర్మము
సుగతిం బ్రబలింప, లోక ♦ సుందర రామా! 1

తే. ఏక పత్నీ వ్రతుండు లో ♦ కైక విభుఁడు
రాజ మార్తాండుఁ డినకుల ♦ రామ రాజు
భూమిఁ బాలించుచుండె ని ♦ ష్కామ వృత్తి
నమల సత్య పరాక్రముం ♦ డగుచు సతము. 2

రామరాజ్యము ప్రజలతృప్తి

చ. ప్రజల యభీప్సితంబె నర ♦ పాలుని శాసనమై చెలంగు, నా
ప్రజ ఋజుమార్గ వర్తనముఁ ♦ బాయదు, పేదఱికంబుఁ జెంద, దే
రుజయును బొంద, దా రఘు వ ♦ రుం డిల నేలుచునుండ స్వర్గమే
నిజముగ నీ యయోధ్యయయి ♦ నేలకు డిగ్గె నటందు రెల్లరున్. 3

ఉ. "రామ నరేంద్రుఁడే ప్రభువు, ♦ రాఘవుఁడే తగు రాజ్యమేల, మా
నోములు నోచినట్లుగ మ ♦ నోరథ సిద్ధినిఁ బొందియుంటి, మే

బాములు గాని లేవు, కడు ♦ పార భుజించి సుఖించుచున్న మా
కేమి కొఱంత" యంచు జను ♦ లెప్పుడుఁ దృప్తినిఁ బొందుచున్ మనన్

**తే.** రామరాజ్యంబు నాఁ బేరు ♦ భూమి యందు
స్థిరముఁ జిరకాల జీవియై ♦ చెలఁగు నట్లు
మనుచు, దీర్ఘాయువును గల్గి ♦ మహిపుఁ డిలను
సలిపె హయమేధ శతము, య ♦ శంబు ప్రబల. 5

**తే.** జనకజకు మారుగాఁ గ్రతు ♦ సరణి యందు
భూతనయఁ బోలు బంగారు ♦ బొమ్మ నుంచి
సలిపె వివిధాధ్వరంబుల ♦ క్ష్మా విభుండు
ధర్మ మార్గ చరుండు ♦ సీతా ప్రియుండు. 6

**చ.** సుతుని మహాధ్వ రోద్గత య ♦ శో గరిమంబు, సురాజ్య పాలనా
గతిఁ బ్రజలొందుసమ్ముదము ♦ గాంచుచుఁ బౌత్రులఁ బ్రీతిఁ బెంచుచున్
సత మసమాన గౌరవ ద ♦ శన్ సుఖియించుచు రాము తల్లి, భూ
పతి విడి యొక్కనాఁడు త్రిది ♦ వంబున వల్లభుఁ జేరె నొంటిమై. 7

**తే.** సుగుణవతు లయ్యు సవతుల ♦ సుఖముఁ జూచి
యోర్వఁగల రొక్కొ? సుదతు లీ ♦ యుర్వి యందుఁ
గతిపయ దినంబు లోర్చియుఁ ♦ బతినిఁ జేరఁ
గైకయు సుమిత్రయును గూడఁ ♦ గదలి చనిరి. 8

**తే.** నియతిఁ దల్లుల కుత్తర ♦ క్రియలు సలిపి
దాన ధర్మంబు లెన్నియో ♦ పూని జరిపి
పేదసాదలఁ దనిపి సం ♦ ప్రీతిఁ గొలిపి
రాఘవుఁడు సోదరులఁగూడి ♦ రాజ్య మేలు. 9

**తే.** పుత్ర సంతాన వంతులై ♦ పుడమిఱేని
తమ్ము లందఱు నతని పా ♦ దముల చెంత
నాశ్రయం బొంది రామాజ్ఞ ♦ ననుసరించి
మెలఁగుచుండిరి లోకము ♦ మెచ్చు రీతి. 10

తే. రామరాజ్య యశో లత ♦ ప్రాకి ప్రాకి
దివ్య సుమ సౌరభంబున ♦ దిశల కెక్కి-
సకల గుణ గణ సాంద్ర చం ♦ ద్రికలఁ దగిలి
జనుల నాకర్షణ మొనర్చు ♦ ననఁగ నందు. 11

## సురాజ్య స్థాపనము

తే. పంపె నొకనాఁడు కేకయ ♦ పార్థివుండు
గార్గ్య గురువర్యు రఘురాము ♦ కడకు, రాజు
మన్ననల నెన్నియో చేసె ♦ మాని యంతఁ
దెలియఁ జెప్పె యుధాజిత్తు ♦ పలుకు లన్ని. 12

తే. రామ భూవల్లభుఁడు మామ ♦ సేమ మరసి
యతని సందేశ మాలించి ♦ యతుల గుణుల
భరతు సుతులను, భరతుతోఁ ♦ బంపెఁ, దాతఁ
గూడి గాంధర్వ భూమిఁ ♦ గైకొనఁగ నపుడు. 13

తే. మామ ప్రేరణ చేయంగ ♦ మామ గూడి
సింధునది పారు గంధర్వ ♦ సీమ నేలు
కంటకుండగు నృపతిఁ బో ♦ కార్చి, భరతుఁ
డచటఁ బ్రజ సమ్మతింప, రా ♦ మాజ్ఞ నిలిపె. 14

తే. తక్షశిల యందుఁ దక్ష భూ ♦ ధవుని నిల్పి
పుష్కలావతిఁ బుష్కల ♦ భూపతి కిడి
తక్ష, పుష్కల సుతుల ♦ గాంధర్వ సీమ
క్షితిపతులఁ జేసె భరతుఁ డా ♦ శీర్వదించి. 15

తే. అతుల సుఖ సంపదలఁ దోగు ♦ నాత్మ భవుల
చెంత నైదేండ్లు భరతుండు ♦ వంత లేక
తనివి దీరంగ సుఖియించి ♦ తరలి వచ్చె
సరస గుణధాముఁడౌ రాము ♦ సన్నిధికిని. 16

చ. ఇటు భరతాత్మజుల్ ధరణి ♦ నేల ముదావహులౌచు; రాఘవుం
డటుల సుమిత్ర సూను తన ♦ య ద్వయమున్ భువి పాలనంబునం
దెటనో కృతార్థులై మనఁగ ♦ నెంచుచు, లక్ష్మణుఁ జేరఁజేరి, నీ
పటుతర శౌర్యయుక్తులగు♦బాలురు రాజ్యము సేయఁ జెల్లరో! 17

చ. అన; భరతుండు రాము నుడు ♦ లారసి కారుపథంబు భూములన్
జనపతి గాఁగ నంగదునిఁ ♦ జారుత రాంగునిఁ జేయఁ జెల్లు; నం
దనవన చంద్రకాంత వసు ♦ ధాస్థలి రాజుగఁ జంద్రకేతునిన్
వినుత యశస్వి మల్ల రణ ♦ వీరుని నిల్పుట యర్హమే యనెన్. 18

తే. భరతు నుడి నెంచి రాముఁడు ♦ ప్రమద మతిని
లక్ష్మణుని పుత్రులకు రాజ్య ♦ లక్ష్మి నిచ్చి
యంగదుని వెంట లక్ష్మణు; ♦ నతని యన్నఁ
జంద్రకేతుని తోడను ♦ సాగనంపె. 19

తే. పశ్చిమంబున నంగద ♦ పార్థివుండు
నుత్తరంబునఁ జంద్రకే ♦ తూత్తముండు
భూమి పాలింపఁ దంద్రులు ♦ మోదమంది
తిరిగి వచ్చిరి యేడాది ♦ తిరుగ కుండ. 20

తే. భరత లక్ష్మణు లెప్పుడుఁ ♦ బాయ లేదు
రాము పద సేవ; సంతత ♦ ర క్తితోడ
నగ్ర సోదరు సేవించు ♦ ననఘ మతులఁ
దమ్ములనుగూడి రాముండు ♦ ధరణి నేలు. 21

## యముని రాక

ఉ. రాము డజస్ర సోదర వి ♦ రాజితుఁ డర్క-కులాగ్రయాయి గా
రామున లోక మేలు తఱి, ♦ రాఘవ దర్శన కాంక్ష సంయమి
గ్రామణి వేష మూని లయ ♦ కాల విభుండు పరేతరాజు, శ్రీ
ధామ నరేంద్రు సౌధము క♦ళింగటకున్ ఘను దెంచి నిల్చెనన్. 22

ఉ. ఏరు మహాత్ములీరు ధర ♦ నీశ్వరుఁ జూడఁగ వచ్చినార ; లే
కారణమో గదా, యనుచు ♦ గారవ మొప్పఁగ లక్ష్మణుండనన్;
(శ్రీ) రఘురామ భూవరుని ♦ చెంగట ముచ్చట లాడు కోర్కె, నే
దూరమునుండి వచ్చితిని ♦ దూతగ *నాది మునీంద్రు పంపునన్. 23

చ. అని యిన తేజుఁడైన ముని ♦ యాడిన మాటల నాలకించి, రా
ముని కడ కేగి యాజ్ఞఁగొని ♦ భూధవు చెంతకు లక్ష్మణుండు చే
ర్చెను యతి, నాతఁడున్ నృపవ♦రేణ్యుఁడొసంగిన యర్ఘ్యపాద్యముల్
గొని రఘురాముఁడొక్కఁడె త♦గున్ విన నానుడు లంచుఁ బల్కఁగన్.

తే. వల్లె యనె రాఘవుం డంత ♦ "పరుఁడు విన్న
నన్ను దుక్తులు వధ్యుఁడో" ♦ నంచు మౌని
ప్రతినఁ బల్కెంచె ధారుణీ ♦ భర్త చేత
నతఁడు దనయాన సౌమిత్రి ♦ కప్పుడె తెలిపి. 25

తే. ఎవరు విన రాదు మా మాట ♦ లిప్పుడు, విన్న
యెడల, మముఁ గాంచు నెడలను ♦ నెవరు గాని
వధ్యులగుటను లక్ష్మణా ! ♦ ద్వారము కడ
నీవె నిల్వంగఁ దగు దనె ♦ భూ విభుండు. 26

ఆ. అంత శంక దక్కి ♦ యవనీశుతో జముం
డనఁగ సాగె నిట్టు ♦ లమిత భక్తి
మునుపు నేను నీదు ♦ తనయుండనే సుమ్మి
వచ్చినాఁడ నేఁడు ♦ బ్రహ్మ పంప. 27

ఆ. పవ్వళించి తీవు ♦ పరమాత్మ ! జలధిలో
భువన సృష్టి కెల్ల ♦ మూల మగుచు
పద్మనాభ ! నాఁడు ♦ వటపత్ర శాయివై
కంటి వయ్య ! తొలుతఁ ♦ గమల భవుని. 28

---

* ఆదిమునీంద్రుఁడు = బ్రహ్మ.

ఆ. శమను పేర నన్ను ♦ శాసించి తీవయ్య
లోక సంహరణ వి ♦ లోలుఁ గాఁగ
నాదిదేవ ! తొల్లి ♦ యఖిల ప్రపంచంబు
మాయ చేత సృష్టిఁ జేయ వాక్కొ ? ౨9

ఆ. కర్మ పరుఁడ వౌచు ♦ ధర్మంబుఁ బాలింప
స్వేచ్ఛ జన్మ మొంది ♦ తీవు పుడమిఁ
బంక జోద్భవుండు ♦ పరమ పదంబును
జేర రాఁగ, నిన్నుఁ ♦ జీను మనియె. 30

చ. అవని జనించి నట్టి పని ♦ యంతయుఁ దీరెఁ గృపాంతరంగ ! యీ
భువి దురితాత్ములన్ దునిమి ♦ పుణ్యము ధర్మము నిల్పినావు, నీ
దివమున కేగు మింక భవ ♦ దీయ పదాంబుజ సేవ లేమిచే
దివిజ గణంబు గుందెడిని ♦ దేవర! పొందుము పూర్వభావమున్.

చ. పరమ పదంబునందుఁ గల ♦ వైభవమున్ స్మరణంబు సేయుచున్
దరహాసి తాననుండయి వి ♦ ధాతృని మాటల నాలకించి, యా
దరణ వచో విలాసమునఁ ♦ దన్పి యమున్ రఘురాముఁ డిట్లనున్
మరలుదు నింకఁ, జేరెదను ♦ మామక ధామము విష్ణు లోకమున్.

ఆ. వనజ భవుని కోర్కె ♦ పాటించి నాఁడను
శంక వీడి జముఁడ! ♦ చనుము దివికి,
కాఁ గలట్టి పనులు ♦ కడతేరెఁ బుడిమిపై
విష్ణు పదము నందు ♦ వెలయు వాఁడ. ౩౧

## దుర్వాసుని రాక

క. శ్రీపతియును గాలుండును
నాపగిది రహస్య భాష ♦ లాడెడి వేళన్
దాపసి దుర్వాసుఁడు సనె
భూపాలకుఁ జూడ నాత్మఁ ♦ బుట్టిన కోర్కెన్. ౩౨

చ. మునిం గని లక్ష్మణుం డుచిత ♦ పూజలఁ జేసి నమస్కరించి "మీ
పని సెలవిండు, భూమిసుర ♦ వర్య ! తపోమహితాత్మ ! తీర్తు" నం
చన, "రఘురాముఁ జూడ హృద♦యంబున నెంచితి, వేగఁబోయి మీ
యినకుల రాజుతో నుడువు ♦ మిచ్చట నుండు సుమిత్ర పుత్రకా !"

చ. అను ముని కంతఁ దెల్పె విన♦యంబున రాఘవు సోదరుండు "రా
ముని కడ కేరుఁగాని కనఁ ♦ బోవఁగ నానతి లేదు, వ్యగ్రుఁడా
యెను, మఱికొంతసే పిట ము ♦ నీశ్వర! తాళఁగఁ జెల్లు, నాపయిన్
జనెదఁ ద్వదీయ వాంఛితము ♦ సల్పఁగ రాముని దర్శనార్థినై." 36

ఉ. భూపునిఁ జూప రాదనెడి ♦ భూపతి తమ్ముని మాట కంతలోఁ
దాపసి యగ్లై మండిపడెఁ ♦ దామస వహ్నిని, నత్రి పుత్రకుం
డోపఁడు, మంటి మింటి ద్రుటి♦నూచి విదల్చెడి తీక్ష్ణ దృక్కులున్
దాపము మేనికంపమును ♦ దారుణమై చెలరేగు చుండఁగన్. 37

మ. "శపియింతున్ భవదీయ వంశము వినా ♦ శంబొంద రామానుజా!
నృపునిన్ వీడ, సపుత్రకంబుగ నిదే ♦ నిర్మూల మొందింతు, నా
కృపకున్ బాత్రుఁడు గాఁడు కైక సుతుఁడున్ ♦ గిట్టింతుఁ దత్సంతతిన్
సపురంబై నృపురాజ్య మెల్ల సమయన్ ♦ శాసింతు యోగాగ్ని చేన్.

క. నను వెనువెంటనె రామునిఁ
గనఁ జేయవయేని నాదు ♦ కార్యార్థంబై"
యను దుర్వాసుని శపథము
వినుచున్ సౌమిత్రి ఖేద ♦ విహ్వలుఁ డగుచున్. 39

తే. తపసి నుడువుల మన్నింపఁ ♦ దలఁప నేని
శాప వశమున వంశంబు ♦ సమసి పోవుఁ
బలువు రసువులఁ గోల్పోవు ♦ పనికి నొల్ల
నేను మాత్రమె చచ్చుట ♦ కిచ్చగింతు. 40

తే. అనుచుఁ దలపోసి సౌమిత్రి ♦ యత్రి సుతుని
రాక నెఱిఁగింప నన్నకు, ♦ రాఘవుండు

కాలుఁడు ముదంబుఁ గన పీఁడ ♦ కోలు సలిపి
యతినిఁ బూజించె రాజ మ ♦ ర్యాద లొసఁగి. 41

ఆ. "పట్టుఁ బట్టి యేను ♦ బదివేల యేండ్లుగ
సలిపి యున్న తపము ♦ చాలు కతన
స్రుక్కుచుంటి, నేఁటి ♦ క్షుద్బాధఁ దీర్పుమో
రామ!" యంచు మౌని ♦ రాజు పలుక. 42

క. మృష్టాన్న భోజనంబునఁ
దుష్టుని గాఁ జేసి పనిచి ♦ తోడనె మౌనిన్,
గష్ట సహిష్ణుఁడు రాముఁడ
దృష్ట విహీనుండు సత్య ♦ దీక్షన్ దలఁచెన్. 43

లక్ష్మణుని పరలోకయాత్ర

తే. కాలు సందేశ మాత్మలోఁ ♦ గ్రాలఁ దొడఁగె
సత్య దీక్షయు శాసింప ♦ సాగె మదిని
సోదరుని జంపఁ జేయాడఁ ♦ బోదు, ప్రకృతి
వశము గావించు కొను నెంత ♦ వాని నైన. 44

తే. "అతుల సత్యపరాక్రమా! ♦ సతత మీవు
ధర్మ సంరక్షణంబున ♦ ధాత్రి నేలి
సత్య పరిపాలనము చేయ ♦ శంక యేల?
వధ్యుఁడ" నటంచు సౌమిత్రి పలికె నంత. 45

ఉ. మౌనులఁ బిల్చి ఱేఁడు మతి ♦ మంతుఁడు ధర్మవిదుండు పల్కె "నే
బూనితిఁ దీక్ష, లక్ష్మణుఁడ ♦ పూర్వముగా విధివల్ల మీఱెన
ద్దాని; నతండు వధ్యుఁడని ♦ ధర్మ నిరూపణ మొప్పు; నే గతిన్
వీని వధింపఁ జెల్లు! సెల ♦ వే యటు సేయ ఋతె ప్రకారమున్?"

తే. "వధయు దేశాపసరణంబు ♦ పార్థివేంద్ర!
ధర్మ విధి యందు నొక్కటే ♦ తఱచి చూడ

స్వీయ రాజ్య నికారంబె ♦ విహిత మైన
శిష్ట ధర్మం" బటంచు వ ♦ సిష్ఠుఁ డనియె. 47

చ. కులగురు ధర్మ సూత్ర మను ♦ కూలముగా గ్రహించి "వత్స! నీ
పలికిన యట్లు ధర్మగతిఁ ♦ బాయ, నిజే తొలి నేర మాటఁ బె
ద్దలుఁ దగునిద్దె యంట, గుణ ♦ ధన్యుఁడ వౌట, స్వకీయ బుద్ధిచే
సలుపని దోష మౌట; నిఁకఁ♦జయ్యన వీడుము రామరాజ్యమున్."

తే. అనుచు రఘురాజు దండించె ♦ ననుజు, నంత
తపసు లెల్లరు మేలన్న ♦ ధర్మ విధిని
ఖేద మొందఁడు ముదమునఁ ♦ గెరలినాఁడు
లక్ష్మణుం డౌర! జ్ఞాన వి ♦ లక్షణుండు. 49

ఆ. తల్లి దండ్రి గురుఁడు ♦ దైవంబు సర్వంబుఁ
దనకు రాముఁ డంచుఁ ♦ దలఁచు నతఁడు
విధిని మీరు కతన ♦ విధియింపఁ బడి నట్టి
శిక్షఁ గొనుచు నెంచె ♦ మోక్ష పదవి. 50

చ. అరయ రఘూత్తముండు పలు ♦ కాడిన రీతి శిరంబుఁ ద్రుంపఁగా
నరమర యేల? రామ విభు ♦ నాజ్ఞకు మారు మఱొండు శిక్షఁ బ
ల్కిరి మును లేల? రాముఁ డతి ♦ కిల్బిషు లక్ష్మణు వీడ నేల? అ
బ్బుర మొకయింత లేదు; విధి ♦ పోకడ లిట్లు విచిత్రముల్ గదా!

మ. వర రామాజ్ఞఁ జరింప రాఘవ పదా ♦ బ్జం బంటి సౌమిత్రి; భూ
వరునిన్ వీడ్కొని ప్రాణముల్ విడుచు టే♦భావ్యంబుగాఁ బూతమౌ
సరయూ తీరముఁ జేరి; నీరముల సు ♦ స్నాతుండునై యోగియై
పరమాత్మున్ మదినెంచి కుంభకమునన్ ♦ బ్రాణంబు బంధింపఁగన్.

ఉ. వాసము వీడివచ్చి నిజ ♦ వాసము సేరఁ దలంచి యోగ మ
భ్యాసము సేయు లక్ష్మణు డి ♦ వంబునకున్ గొనిపోవఁగా మదిన్
వాసవుఁ డెంచి భూస్థలికిఁ ♦ బంపి విమానము బొందెతోడనే
తీసుకపోయె; లోకము ను ♦ తింపఁగ మానులు హర్ష మొందఁగన్.

తే. లక్ష్మణుం డేగి దివికి స ♦ లక్షణముగ
నాది శేష స్వరూపంబు ♦ నవధరించి
యఖిల వైకుంఠ ధామంబు ♦ నందు వెలసె
ధన్య సీతా రమా సన్ని ♦ ధానమునను. 54

ఆ. "తమ్ము లన్న రాము ♦ తమ్ములె తమ్ములు
గురునివోలె నన్నఁ ♦ గొల్చు వారు
సకల సుగుణ యుతుఁడు ♦ సౌమిత్రి; యీ ధాత్రి
నతని సాటివారి ♦ నరయ లేము." 55

తే. అనుచు లక్ష్మణుఁ బ్రజ గొని ♦ యాడు చుండఁ
బ్రకృతి యందున్న శ్రీరామ ♦ పార్థివుండు
వినియు, భ్రాతృ వియోగార్తి ♦ పీడఁ డాయె
మమతలోఁ జిక్కి వెసఁ గుందు ♦ మధ్య మధ్య. 56

కుశలవ పట్టాభిషేకము

ఉ. పుట్టిన దాది కష్టముల ♦ పుట్టుక నాయది, జీవితంబునం
దెట్టి నికృష్ట కష్టముల ♦ కే గుఱియైనను పీడ నట్టి చే
పట్టిన పూత సీత చనె, ♦ భ్రాతయు వీడి చనెఁ దివంబు, నే
పట్టున రాజ్య మేలుదును? ♦ బండెను గాలమటంచు నెంచుచున్ 57

చ. భరతునిఁ బిల్చి రాజ్య పరి ♦ పాలన మూనఁగఁ గోరి, ధారుణీ
వరుఁడు భువిన్ త్యజించి నిజ ♦ వాసము సేరఁగ నిశ్చయించె, సో
దరుఁడగు కైక సూనుఁడు ము♦దంబును గాంచఁడు, తేనిపల్కు లా
దరణము సేయఁబోఁడు, వసు ♦ ధాపతియై మన నొల్లఁ డాతఁడున్.

గీ. "రాజ్య రమ నొల్లఁ, గోరుదు ♦ రాము సేవ
సత్య మిది నమ్ము మన్నరో! ♦ సత్య సాక్షి
నిముస మైనను నిను వీడి ♦ నిలువఁ జాల
రాఘవుఁడు లేక నాకేల ♦ రాజ్యలీల?

క. కోసల దేశము నుత్తర
కోసల దేశమ్ము రెంటఁ ♦ గుశలవ సుతులన్
శాసింపుము ప్రజ నేలఁగ
వాసిని గడియింత్రు, వంశ ♦ వర్ధను లగుచున్." 60

గీ. ప్రణతి సల్పుచు వినయంబు ♦ పాదుకొనఁగ
భరతుఁ డటు విన్నవించెను ♦ ప్రభుని కపుడు
పౌరు లెల్లరు రామునిఁ ♦ బాయ లేక
యార్తిఁ బడి దేవులాడిరి ♦ హా యటంచు. 61

ఉ. "పౌరుల మోము లెల్ల వసి ♦ వాడి కడుంగడు దీన భావముం
గూరె, నపూర్వమిద్ది కను ♦ గొమ్ము కతమ్ము కృపా పరుండవై;
వీరల చింతఁ దీర్పక, యు ♦ పేక్ష వహించుట రాజ ధర్మమా!
శ్రీరఘునాయకా!" యని, వ ♦ సిష్ఠ మునీంద్రుఁడు హెచ్చరింపఁగన్.

తే. రాఘవుఁడు జీరి ప్రజనెల్ల ♦ రాగ మొప్ప
"ఏల దుఃఖింతు రీగతి ♦ నేను లేనా?
తెలుపుఁడీ మీదు కోరికఁ ♦ దీర్చు వాఁడ
నభయ మిచ్చుచు నున్నాఁడ" ♦ ననుచు నుడివె. 63

పౌరుల కోరిక

మ. వనమో? భూమియొ? నాకమో? జలధియో ♦ ప్రాప్తింపఁగా నిమ్ము నీ
చను త్రోవన్ సకళత్ర పుత్రముగ రా ♦ జా! వత్తు మయ్యా ప్రజల్
నినుఁ బాయంగలవారు కారు మమతన్ ♦ నీ తావలంబందె మే
ము నివాసం బొనరింప నాజ్ఞ నిడు, సం ♦ పూర్ణానురాగంబునన్.

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు ♦ దాతయు నేతయు సర్వమీవె మా
యుల్లము లన్ని నీ పరత ♦ నున్నవి, నీ వెటనున్న నచ్చటే
చల్లని యిల్లు మాకగు ని ♦ జంబు, మమున్ త్యజియించి పోవఁగాఁ
జెలునె? రామరాజ! దయ ♦ చేసి వరంబు ననుగ్రహింపుమా! 65

తే. అనుచుఁ బ్రజలెల్ల నెలుఁగెత్తి ♦ యడుగఁ, బ్రభువు
లనదు నిజభక్త కోటి సం ♦ తాప మరసి;
వల్లె యనుచును వర మిచ్చి ♦ పౌర తతికి
మోద మొనఁగూర్చె శ్రీరామ ♦ భూ విభుండు. 66

ఆ. భరతుఁ డొసఁగు హితముఁ ♦ బార్థివుం డాలించి
పలయు పనుల నెల్ల ♦ సలుపఁ దొడఁగి
కర్జ మరసి తనదు ♦ కడగొట్టు తమ్మునిఁ
బిలువ భటుల నంపె ♦ వేగిరముగ. 67

తే. కుశలవుల దక్షి ణోత్తర ♦ కోసలములఁ
బార్థివులఁ జేసి చతురంగ ♦ బలము నిచ్చి
దీవన లిడి సత్యాగ్రహ ♦ దీక్షఁ దెల్పి
రాజలాంఛనమున వారు ♦ రాజిలంగ. 68

తే. అతుల పుత్రేమణంబున ♦ నంక మందు
పుత్రకుల నిర్వురం జేర్చి ♦ ముద్దు లిడుచు
గాఁగిలింతలఁ దనివోక ♦ యూగి యూగి
మూర్ధముల మూర్కొనుచు నుండు ♦ భూ విభుండు. 69

ఆ. ఎవని కైనఁగాని ♦ యీషణత్రయ మెంచ
కట్టువడదొ ? జన్మ ♦ కాల మెల్ల
రాఘవుండు గూడ ♦ రాగ లాలసుఁ డయ్యె,
మాయ యనఁగ నెట్టి ♦ మమతమొక్కొ ? 70

తే. పూర్వ సంస్కృతి పుట్టియు ♦ భూ ధవుండు
తరలు చూడియు వైకుంఠ ♦ ధామమునకు,
మమతలోఁ బడి యంతలో ♦ మాయ దాఁటి
పుత్రుల స్వరాజ్యముల కంపె ♦ ముగ్ధుఁ డగుచు.

తే. కుశుఁడు సేరె కుశావతి ♦ కోసలంబు
లవుఁడు శ్రావస్తి కేగెఁ బా ♦ లనము సేయ

తండ్రి యానతిం దలంచాల్చి ♦ తరలు చుంట
కాదొ రఘురాము వంశాను ♦ కరణ మరయ ! 72

### శత్రుఘ్నుం డయోధ్యం జేరుట

ఉ. రాముని పంపునన్ జని స ♦ రాసరి దూతలు మూండు నాళ్లలో
నా మధురాపు రీశున, కు ♦ దంతముం దెల్పిరి, "లక్ష్మణుం బరం
ధామము సేర్చె రాము శప ♦ థంబు, నరేశుం డయోధ్య మానవ
స్తోమము తోడ పీడి భర ♦ తుం గొనిపోవు దివంబుం జేరంగన్. 73

తే. కొడుకు లందఱ దీవించి ♦ పుడమి నిచ్చి
ప్రజలం బాలింప వారలం ♦ బంపి నాండు
ప్రకృతి రసవర్గ బంధంబుం ♦ బాసినాండు
సిద్ధ మయి నాండు స్వర్గంబుం ♦ జేర తేండు." 74

క. అను దూతల నుడులను విని
జనతతిని ననుజ్ఞం గోరె ♦ శత్రుఘ్నుండున్
దనయుల కిడి రాజ్యము రా
ముని సేవింపన్ నిజపురి ♦ బోవన్ విధిమై. 75

తే. మధుర రాజ్యంబున సుబాహు ♦ మనుజ పతిగం
బ్రభునిగా శత్రుఘాతిని ♦ వైదిశమునం
బ్రజల యనుమతితో నిల్పి ♦ వారి కపుడు
స్వమ్ము సర్వమ్ము సమముగం ♦ బంచి యిచ్చె, 76

చ. భరతుని తమ్ముండంత రఘు ♦ వర్యుని పాదము లాశ్రయింపంగా
నరదముపై నయోధ్యకు ర ♦ యంబున నేగి, దుకూలశోభితున్
బరమమునీంద్ర మధ్యమున ♦ భాసిలు భ్రాతను గాంచి మ్రొక్కుచున్
గరములు మోడ్చి నిల్చి జన ♦ కాంతుని ముంగల, నిశ్చయాత్ముండై.

తే. "తనయుల కొసంగి రాజ్యంబు ♦ జనులు పొగడ
మధుర విడనాడి వచ్చితి ♦ మానవేంద్ర !

ఆజ్ఞ కృపసేయుమీ! వెంట ♦ నంటి రాఁగ
మారు వల్కక" యని కోరె ♦ మహిత గుణుని. 78

## రాముఁడు వరంబు లొసఁగుట

తే. రాము వదన మంత ♦ రాజిల్లెఁ బరిపూర్ణ
తేజ మొంది దివ్య ♦ దీప్తిఁ గ్రోడఁ,
దమ్ము మదినిఁ గల్గు ♦ దార్ఢ్యంబు గమనించి
వల్లె యంచు నుడివె ♦ పార్థివుండు. 79

ఉ. శ్రీరఘురామ మూర్తి దివిఁ ♦ జేరఁ దలంచిన వార్తయెల్ల; నం
భోరుహనాభిసంభవుఁడు, ♦ బూచుల ఱేఁడు, సురాసురుల్, కపుల్
భూరమణుల్, విభీషణుఁడు, ♦ భూసురులున్, మునిముఖ్యవర్గముల్
కోరిక మీరఁగా విని; ర ♦ ఘుప్రవరుం గనవచ్చి రెల్లరున్. 80

ఉ. గుంపులు గుంపు లౌచు హరి♦కోటులు రాముని చుట్టుమూఁగి, వా
రింపకు దేవరా! మముఁ ద ♦ రింపగఁ జేర్పుము స్వర్గమందు; నా
లింపుము భక్తవర్గము చ ♦ లింపక కోరు వరంబు; నిన్నె సే
వింపఁగ వత్తుమయ్య మము♦వీడకుమీ, కడుబాధ గూర్చుచున్.

ఆ. "వెడలి పోవ మమ్ము ♦ విడనాడి; భువిలోన
దండ ధరుఁడు మాకుఁ ♦ దప్ప డయ్య!
నీవె దిక్కుగాఁగ ♦ నెఱనమ్మి నారము
బ్రోవు" మనిన కపులఁ ♦ బ్రోచె విభుఁడు. 82

ఉ. "ఇచ్చితి రాజ్య మంగదుని ♦ కేను ముదంబున; నీదు మార్గమున్
జొచ్చి తరింప వచ్చితి; వి ♦ శుద్ధచరిత్ర! త్వదీయ భక్తునిన్
హెచ్చిన కూర్మి వెంటఁగొను♦మీ" యని వేఁడెడు వానరేశ్వరున్
మెచ్చి రఘూత్తముండు కపి♦మిత్రుఁడు రాముఁడు దెల్పె సమ్మతిన్.

ఉ. చేతులు మోడ్చి ఫాలమునఁ ♦ జేర్చి విభీషణుఁ డల్లనల్లనన్
జేతముఁ గూడఁదీసి నృప ♦ సింహుని డాసెను; రాఘవుండు స్గం

ప్రీతిని వానికిట్లను "విభీషణ! రాక్షస రాజ్య మేలు మీ
భూతలమందు నిల్చి తను ♦ వున్ విడనాడక ధర్మ మూర్తివై. 84

క. ఇనుఁడును శశియును మింటన్
గనిపించుచు నుండు నంత ♦ కాలంబును; రా
ముని కథ నిలిచెడి వఱకును
మను చుండుము; నీవు నాదు ♦ మాటను సఖుఁడా! 85

క. మా కుల తిరువారాధన
నీకు సమర్పింతు; భక్తి ♦ నియతిన్ గొనుమీ
శ్రీ కరుని జగన్నాథుని
లోకాంతర వర్తిఁ గొల్వ ♦ లోలుఁడ వగుచున్. 86

తే. మారు మాటాడ వలదు నా ♦ మాట వినుము,
మైత్రితోఁ జెప్పుచుంటి న ♦ న్మార్గ మరసి"
యనెడి రామాజ్ఞ నాలించి ♦ యసుర విభుఁడు
కించ నొందక శిరసా వ ♦ హించె నంత. 87

ఉ. మారుతిఁ గాంచి యంత "నస ♦ మానగుణాఢ్య! భవత్ప్రతిజ్ఞ యీ
ధారుణి యందు వర్తిలుస ♦ దా, వృథ సేయకు మయ్య దాని, నా
పేరు ధరాస్థలిన్ ప్రజలు ♦ విస్మృతిఁ జెందని యంతకాలమున్
శ్రీరఘురామ సత్కథల ♦ చే మనుచుండఁ గలాఁడ వ" ననెన్. 88

తే. నియతి రామాజ్ఞ నీరాంజ ♦ నేయ వరుఁడు
మీరఁ డెన్నఁడు "భవదీయ ♦ వీర చరిత
పరమ పావన! సతతంబుఁ ♦ బాడు కొనుచు
మెలఁగుచుండెద నిల" నంచుఁ ♦ బలికె హనుమ. 89

తే. *వృద్ధ జాంబవంతునిఁ గాంచి ♦ ద్వివిదుఁ జూచి,
ఐందుఁ గని, పంచవీరుల ♦ కందఱకును

* పాఠాంతరము: వృద్ధు

గలియుగ ప్రాప్తి యగునంతక ♦ కదల వలదు
తనువులను బాసి, యనె రామ ♦ ధరణి విభుఁడు. 90

ఆ. కోఁతి మూఁకఁ జూచి ♦ "కోరిక ఫలియించె
నెంట రండు మీరు ♦ విడువ మిమ్ము"
ననెడి రాము మాట ♦ నాలించి ముద మొంది
కిలకిలంబు సల్పె ♦ కీశ గణము. 91

క. వరముల నిచ్చిన పిమ్మట
వరదుఁడు రేవెళ్లఁ బుచ్చెఁ, ♦ బ్రాగ్దిశ యందున్
దరణి జనించెను, దన కుల
వసు ప్రస్థానముఁ గనంగ ♦ వచ్చిన పగిదిన్. 92

## శ్రీరాముని మహాప్రస్థానము

చ. కులగురుఁ గాంచి రాఘవుఁడు ♦ గూరిమి తోడ నమస్కరించి "నేఁ
డిల విడనాడి నాకమున ♦ కేగఁ దలంచితిఁ దన్నిమిత్తమై
వలసిన కర్మమెల్ల జరు ♦ పందగు ముందుగ" నంచుఁ బల్కఁగన్
గల పనులన్ వసిష్ఠుఁడు సు ♦ కర్మము ధర్మము నెంచుచున్ వెసన్

తే. సలిపి; ముగియించె నంత ప్ర ♦ స్థాన విధుల;
యాగ వహ్నులు మును ముందు ♦ సాగు చుండ
నంగ వస్త్రంబు ధరియించి ♦ యనఘ విభుఁడు
వెడలె నిలుపీడి కుశలను ♦ వ్రేళ్ళ నూని. 94

తే. దిన కరుఁడు మింట వడివడి ♦ దీప్తిఁబూనె
శాంతి వశవర్తి రాఘవ ♦ చక్రవర్తి
బ్రహ్మ మంత్రంబు నాత్మలోఁ ♦ బాదుకొల్పి
లయ విలోలత నీషణ ♦ త్రయము వాఁడె. 9

క. కుడి యెడమల శ్రీహ్రీలును,
వడివడి చనుచున్న రామ ♦ భద్రుని వెంటన్
నెడలుచు నున్న తేజంగునఁ
బొడసూపెను రామమూర్తి ♦ పోయెడి దారిన్.

తే. అనుపమ మహాస్త్ర శర సంచ ♦ యంబు లపుడు
రాము వెన్నాడు మానవ ♦ రాశి గాఁగ,
వేదములు విప్రులై తన ♦ వెంట రాఁగఁ
బ్రజల హర్ష స్వనము ప్రణ ♦ వంబు గాఁగ. 97

తే. ముని జనంబు వషట్కార ♦ పూర్తి గాఁగ
సకల రక్షక గాయత్రి ♦ సాక్షి గాఁగ
ద్వారములు లేని వైకుంఠ ♦ ధామ మేగఁ
దరలి చనినాఁడు రామయ్య ♦ తండ్రి, నదికి. 98

ఆ. చనిరి కైక సుతుఁడు ♦ సౌమిత్రియును గూడ
స్వ పరిజనము వెంట ♦ సాగి రాఁగ
సతుల తోడఁ గూడి ♦ సర్వంబు విడనాడి
సాగ్ని హోత్రు లగుచు ♦ నన్న వెంట. 99

ఉ. బాలురు వృద్ధులున్ బడుచు ♦ వారలు నాలు మగండ్రు నెల్లరున్
హేలగఁ గట్టకట్టుకొని ♦ యేగిరి రామునితోఁ; నయోధ్యనే
మూలఁ జరింప దొక్క ఖగ ♦ ముం బశువున్ మఱి జీవ మేదియున్
బోల దయోధ్య పూర్వ విధ ♦ మున్ దరలెన్ గళలున్ సమస్తమున్

ఆ. భూత తతియుఁ గూడఁ ♦ బురి వీడి రాముతోఁ
స్వర్గ ధామ మేగఁ ♦ జనెను నదికి
స్థావరములు గూడ ♦ స్వర్గ లోకాపేక్షఁ
జనియె నపుడు రాము ♦ సన్నిధికిని. 101

ఆ. తన్ను నమ్ము వారు ♦ తనవెంటఁ బడి రాఁగ
నర్ధ యోజనాధ్వ ♦ మరిగి, రాజు
సకల పాప హారి ♦ సరయూ మహానదీ
నీర మందుఁ గ్రుంకి ♦ నిలిచి యుండె. 102

ఆ. స్వర్గ లోక యాత్ర ♦ సాగించు రాముతోఁ
పౌర బంధు మిత్ర ♦ భక్త వితతి

సర్వ జీవ వస్తు ♦ సముదయంబు నయోధ్య
వీడి చనఁగ సురలు ♦ వింతఁ గనిరి. 103

ఉ. ఆకస మెల్ల నిండె సుర ♦ యాన విమాన సమూహ పంక్తులన్
నాక నివాసు లెల్ల నర ♦ నాథుని ముంచిరి పూలవాన, నా
లీకభవుండు రాఘవుని ♦ లీలలఁ జూచుచు మింట నుండి, యో
లోక నుతా! హరీ! నిఖిల ♦ లోకచరా! యిదె స్వాగతమ్మనెన్.

ఆ. శ్రీనివాస! రమ్ము ♦ చిత్త మొప్పిన రీతి
నాకమునకొ విష్ణు ♦ లోకమునకొ;
యఖిల లోక సృష్టి ♦ కాధార మగు దేవ
అచ్యుతా! యనంత! ♦ యభవ! రామ! 105

ఆ. ఆత్మభవుఁడు దన్ను ♦ నర్థింపఁ దనువుతో
నన్నుజ యుగముతోడ ♦ నైచ్ఛికముగ
విష్ణు తేజ మందు ♦ విభుఁడు లీనం బయ్యె
సురలు భక్త వరులు ♦ చూచి పొగడ. 106

ఆ. సర్వ జీవ రాశి ♦ సరయూనదినిఁ జొచ్చె
నన్ను గూడివచ్చి ♦ నలినభవుఁడ!
భక్త కోటిపట్ల ♦ భక్తుండ నేనుమ్ము.
వారి కెల్ల స్వర్గ ♦ వసతి నిమ్ము. 107

క. అను పరమేశుని యానతి
విని, ధాతయుఁ జేర్చె, జీవ ♦ వితతుల దివికిన్
వనచరులు సురలు కాఁగా,
దినకరు లో లీనమయ్యె ♦ దినకర సుతుఁడున్. 1

తే. అట్లు స్వస్థానమునక య్యె ♦ నంతఁ డరిగి
చెలఁగె సీతా మహాలక్ష్మి ♦ చెలిమి కలిమి;
దీర్ఘ కాల వియోగంబు ♦ దీరు కొఱకు
నురముపై నామె నుంచి సం ♦ యోగ మొందె. 1

తే. భరత శత్రుఘ్నులా విష్ణు ♦ పదము నందు
శంఖ చక్రంబులై స్వతే ♦ జముల నొంది
శ్రీమహా విష్ణు సన్నిధిఁ ♦ జేరి, యుభయ
పార్శ్వ*భుజ పీఠముల కెక్కి ♦ వరలి నారు. 110

తే. శ్రీసతినిఁ గూడి చెలువారు ♦ శేష శాయి
శంఖ చక్ర యుతుండు, సా ♦ క్షాత్కరించె,
వాయు సుతుఁడు విభీషణ ♦ పార్శ్వ్వుండు
నమర తతియును మునులు "ధ ♦ న్యాస్మ్మ" యనఁగ. 111

## ఆశ్వాసాంత పద్యములు

ఉ. మాయల మారి లోక మస ♦ మానముగా సృజియించి తేల ? నీ
మాయకు నీవె లోఁబడి ర ♦ మాపతి ! గుందితి వెంతో లీల ! రా
మాయణ మందు, మానవుఁడు ♦ మాయకు లోఁబడు రీతిఁజూపి రా
మా ! యశమంది నావు, గుణ ♦ మాన్యుఁడవై నృపవేషధారివై.

శా. రాజ్యం బేలుటయందు ధర్మ మతివై ♦ రాజిల్లెడిం గాక; యే
రాజ్యాధీశ్వరుఁడీ ప్రపంచమున వై ♦ రాగ్యంబునం దుండియున్,
రాజ్యం బేలుట దోషి గాక మననా ♦ రారాజ ! నీపట్టునన్
"రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను టసా♦ర్థం బయ్యె రామప్రభూ !

## అంకితము

శా. 'ఓం' కార ప్రభవమ్ము నీమహిమ స ♦ ర్వోత్కృష్ట మీా సృష్టికిన్
'శ్రీం' కారుణ్య గుణాకరంబు సకల ♦ శ్రేయస్కరంబౌ సదా
'ఐం' కాలజ్ఞతఁ గూర్చి జ్ఞానకరమై ♦ యాముష్మికం బిచ్చెడిన్
'రాం' కామ్యంబులఁ దీర్చి బ్రోచెడిని శ్రీ♦రామా ! భవన్మంత్రమై.

క. శ్రీ 'రామాయ నమో' యని
ప్రేరణ సేయంగ నీవు ♦ ప్రేమన్ రావా !

*పాఠాంతరము : భుజపీఠముల నెక్కి

గారాబంబునఁ గృతిఁ గొన
రా! రా! వే వేగ రామ ! ♦ రాజ లలామా ! 115

క. అంకిత మిత్తును రామా !
కింకరుఁడను ముందుగతులు ♦ కీడో మేలో
కొంకను సర్వము నీవే
జంకేలా వరద ! నీదు ♦ సన్నిధి యందున్. 116

ఉ. చేసితి నిర్వదేండ్లు నర ♦ సేవను నా సకలంబు నోడ్డియున్;
బాస యొనర్చి సత్యపథ ♦ వర్తన మింతయుఁ దప్పకుండ; నా
యాసము జెందినాఁడ, మను ♦ జావళి మోసముఁ గోడ; నేఁడెగా
వ్రాసితి నీదు సద్గుణ వి ♦ రాజిత కావ్యము ధన్య జీవినై. 117

చ. ఇరువదియేడు లాయె; సుక ♦ వీశ్వర పాళినిఁ గైతచే సభాం
తరములలో వధానములఁ♦దన్పి, మఱెప్పుడొ ? ప్రాసముల్ యతుల్
సరసగతుల్ కవిత్వ రస ♦ సార రుచుల్ మఱపొందియుణ్ భవ
త్కరుణ లభింప, వ్రాసితిని ♦ దాశరథీ ! భవదీయ సత్కథణ్. 118

తే. ఆత్మకూ ర్యన్వయంబున ♦ నవతరించి
రెండవో శాస్త్ర విదులు, గో ♦ విందుఁడందు
మూల పురుషుఁడు; షట్ఛాస్త్ర ♦ మూల విదుఁడు;
మామక పితామహుని పితా ♦ మహుని తండ్రి. 119

తే. గోకులుం డిష్టదైవము; ♦ గోపవరమె
యగ్రహారంబుగా నొంది ♦ నట్టి యూరు,
సరస సాహిత్య సంగీత ♦ శాస్త్ర గరిమ
నతని కెనలేరు మద్వంశ ♦ మందు నేరు.

క. కవియా నీగోవిందుని
భవనమునం దతని పేర ♦ వరలుదు నేను
ద్భవమంది సుభద్రా కృ
ష్ణ వధూ వరు లందు; బ్రహ్మ ♦ సత్కులమందున్, 1[illegible]

తే. జనన మాదిగఁ బదియేండ్ల ♦ జనకు డుండెఁ
దాత ముత్తన మామయుఁ ♦ దల్లి పిన్ని
విద్య బుద్ధియుఁ గఱపించి ♦ పెంచినారు
పేరు గనునట్లు పిన్నలఁ ♦ బెద్ద లంధు. 122

తే. సకల శాస్త్రార్థ కోవిద ♦ సంయమీంద్రుఁ
డతఁడు; మాతామహుండు; స ♦ త్య ప్రియుండు
వేదవేదాంగ విజ్ఞాన ♦ విదుఁడు సాతు
లూరి కుల, సుభద్రాచార్య ♦ సూరివరుఁడు. 123

ఉ. నీ కడ సూరులన్ గలసి ♦ నిల్చిన వాఁడు, రఘూత్తమా ! భవ
త్ప్రాకట వైభవంబుఁ దెలు ♦ పంగల తారక మంత్ర రాజ మ
స్తోకముగా జపింప మన ♦ సున్ గలిగించి గురూపదేశమున్
నా కొనరించి త్వద్గుణ గ ♦ ణంబుల గానము నేర్పె నాతఁడే. 124

సీ. జనకుఁ డిచ్చిన యాన ♦ జవదాట నొల్లక
పైతృక రాజ్యంబు ♦ బాసి తీవు
జనని పిల్చిన పిల్పు ♦ జవదాట నొల్లక
పైతృక భాగ్యంబుఁ ♦ బాసినాను
సాధు రక్షణ దీక్ష ♦ సర్వంబుఁ దాజియించి
యసుర రాజ్యధ్వంసి ♦ వైతి వీవు
స్వాతంత్ర్య సిద్ధికై ♦ సర్వస్వ మర్పించి
యాంగ్లరాజ్య విరోధి ♦ నైతినేను

తే. కష్ట చయ మెల్ల భరియించి ♦ కార్య దీక్ష
యందు, భవదీయ పదముల ♦ నంటి యుంటి,
నింక మున్ముందు మత్కర్మ ♦ మెట్టి దౌనొ ?
యేమి గావింప నుంటివో ♦ యిన కులేంద్ర !

మ. "పరతత్వార్థము బోధసేయు" మను నీ ♦ భావంబుఁ బోనాడి, యీ
శరణికి శాసన సభ్యుగా నలిపితో? ♦ కానున్న దేమో ! భవ

త్పరిపూర్ణం బగు ప్రేమకుం దగినచో ♦ ధాత్రీతలం బందు, భూ
వరుఁడౌ నల్పుఁడు గూడ, నీమహిమ సం ♦ భావింపఁగా శక్యమే?

తే. నీవ యొసఁగితి ప్రేమంబు ♦ నేను దాని
నేరి కేనియు నొసఁగ లే ♦ దింత దనుక
నస్మదీయ హృదంతర ♦ మ్మాక్ర మించి
యున్న యద్దాని హరియింప ♦ నోప రెవరు. 127

తే. హృదయ కుహరంబునందె, ల ♦ యింప లేదు
పరుల చేఁ జిక్కి, రవ్వంత ♦ తఱుగ లేదు
ప్రాత వడి, తీపి యిసుమంత ♦ వాయ లేదు
నీవె గొనుమింక నీదాని ♦ నిలుప వలదు. 128

ఉ. ఆయు వొసంగినన్, దినుట ♦ కన్న మొసంగిన, బుద్ధి యుంచినన్,
గాయ పటుత్వ మిట్లయిన, ♦ గాసిల కున్న, సశేషమైన రా
మాయణ మాదినుండి యస ♦ మానముగా రచియింప నెంతు; రా
మా! యిఁక మీఁదఁగూడ భవ♦దాశ్రితుఁగా జరియింపఁ జేయుచోన్.

చ. అనుపమ మంత్ర బీజముల ♦ కక్షర మాలయుఁ, బూవుమాలచే
ననుదినమున్ జపింతు నిను, ♦ నయ్యది, మొత్తము సప్తమాలలన్
దినమున కొక్క పద్యము గ ♦ తిన్ సమకూర్చితి సువ్రతుండనై,
నినుఁ దనియింప, నీకృతిని ♦ నీవె గొనందగు జానకీ వరా! 1

ఉ. నే చరితార్థతన్ గనుదు ♦ నిక్కము, బాల పదాశ్రితుండనై
నోచిన నోము పండుట, న ♦ నున్ దరిఁజేర్చిన దామె, "ఏకమే
వాచలన ప్రధాన "మను ♦ నాత్మ రచించితి, దీనిఁ గొమ్ము; భ
ద్రాచల రామ! భక్తవర ♦ దా! కరుణాకర జానకీ వరా!

ఉ. నీ చిదచిన్మయత్వము, ము ♦ ని ప్రకరానుభవైక వేద్యమై
లోచన దుర్నిరీక్ష్యము, వి ♦ లోకన యోగ్య గుణ స్వరూపమే,

యోచనఁ జేయఁ జెల్లు నను ♦ యోజన వ్రాసితి దీనిఁ గొమ్మ, భ
ద్రాచల రామ! భక్తవర ♦ దా! కరుణాకర! జానకీ వరా! 132

ఉ. దాఁచిన వాఁడఁ గాను ధన ♦ ధాన్యములన్, గుడి గోపురంబులన్
యాచనఁ జేసి కట్టు దల ♦ పైనను గల్గిన వాఁడఁగాను, భా
వాచితిఁగో స్మరించు హృద ♦ యంబున వ్రాసితి దీనిఁగొమ్మ, భ
ద్రాచలరామ! భక్తవర ♦ దా! కరుణాకర! జానకీ వరా! 133

ఉ. ఆ చలి బాధ కోర్చి, భర ♦ తావనిఁ బుణ్య నదీ నదంబులన్
జూచి, మునింగి, తీర్థవిధిఁ ♦ జొచ్చియు నిశ్చల శాంతి లేమిచేఁ
బ్రోచెడి వాఁడ వీవె యను ♦ బుద్ధి రచించితి దీనిఁగొమ్మ, భ
ద్రాచల రామ! భక్తవర ♦ దా! కరుణాకర! జానకీ వరా! 134

ఉ. నీ చరణాంబుజోద్భవ వి ♦ నిర్మలమౌ మధువెల్లఁ గ్రోలి, క
ర్మాచరణోద్గత శ్రమల ♦ నల్లనఁ బాయఁగఁ జేసికొంచు స
ద్వాచక తావకీన కృతి ♦ వ్రాసితి దీని గ్రహింపుమీవ, భ
ద్రాచలరామ! భక్తవర ♦ దా! కరుణాకర! జానకీ వరా! 135

ఉ. అత్తిన బత్తిఁగోడ విన ♦ యమ్మున నా కవితా సుమమ్ము సి
మెత్తని పాదయుగ్మము స ♦ మీపమునం దిడి పూజసేసితిన్
జిత్తము నందుఁ జేప్పుము వి ♦ శేషముగా నిఁకఁ గానుకల్ మతే
మిత్తును? సర్వమిచ్చితి, ని ♦ దే శరణంటిని, జానకీ వరా! 136

## ఫ ల శ్రు తి

ఉ. శ్రీరఘురామ కల్పకముఁ ♦ జేరి విరామము నొంద నీడలం
దాఱును మానవాళి దురి ♦ తార్తి మయాతప తీవ్ర బాధ, యే
కోరికనైనఁ దీర్చు రఘు ♦ కుంజరు నుత్తరకాండ మిద్ది, యె
వ్వారు పఠించినన్ వినినఁ ♦ బాయని భక్తిని చిత్తశుద్ధితోన్. 137

## మంగళమహాశ్రీ వృత్తము

మంగళము శ్రీశునకు–మంగళము రామునకు–మంగళము శాశ్వతునకు కృపునకున్
మంగళము శ్రీసతికి–మంగళము సీతకును–మంగళము పూతకు సతంబునన్
మంగళము శేషునకు– మంగళము చక్రికిని–మంగళము శంఖికిని విష్ణుల్
మంగళము భక్తులకు–మంగళము శ్రోతలకు–మాపతికి మంగళమహాశ్రీ.

---

ఇది శ్రీ వసిష్ఠ, శక్తి, పరాశర, త్ర్యార్షేయ పరాశరగోత్ర
పవిత్ర సుభద్రా వేంకటకృష్ణాచార్య పుత్రుండును, మహాత్మా
గాంధిచరిత్ర, భారతదేశార్థిక చరిత్ర, భారతీయ రాజ్యాంగ
చరిత్రేత్యాది గ్రంథకర్తయు ఎఫ్. ఆర్. ఇ. ఎస్.,
ఎమ్. ఎల్. సి. భారతీ తీర్థోపాధ్యాయ ఆత్మకూరి
గోవిందాచార్య విరచిత గోవింద రామాయణ
మహాకావ్యంబున నుత్తరరామచరితము
సర్వము సంపూర్ణము.
శ్రీ రామార్పణము
శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౫ | | | |
| 1 వ కాలం | 9 | క్రథావిధానము | కథావిధానము |
| ,, | 10 | గంథమునం | గ్రంథమునం |
| ,, | | | |
| 2 వ కాలం | 25 | నదురుగ | నరుదుగ |
| ౧3 | | | |
| 2 వ కాలం | 19 | భగవదిచ్ఛాశక్తి. | భగవదిచ్ఛాశక్తి. |
| ,, | 25 | ఇతరు లిచ్ఛాకల్పిత | ఇతరు లిచ్ఛాకల్పిత |
| ౧౪ | | | |
| 1 వ కాలం | 26 | ప్రబలజేసి | ప్రబలఁజేసి |
| ౧౫ | | | |
| 1 వ కాలం | 12 | రాని | దాని |
| ౧౫ | | | |
| 2 వ కాలం | 5 | ప్పిడి | చప్పిడి |
| ౧౬ | 17 | వినిమోగించి | వినియోగించి |
| ,, | 24 | భగదవతార | భగవదవతార |
| ,, | 27 | అమూలాగ్రముగా | ఆమూలాగ్రముగా |
| ౧౭ | 19 | అంధ్రప్రబంధము | ఆంధ్రప్రబంధము |
| ౨౨ | 6 | సీతా శిల | సీతా శీల |
| ,, | 18 | మంత్రములె | మంత్రములై |
| ,, | 21 | ప్రజాసతి | ప్రజాపతి |
| ౨3 | 2 | వర్ణించె''నట | వర్ణించె"నట. |
| ౨౫ | 19 | రామాయణము. | రామాయణము, |
| ౨౮ | 16 | పంద్రెండేళ్ల | పంద్రెండేండ్ల |

| పేజీ | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 49 | డేఁగి | డేగి |
| 11 | 57 | గాథలన్ | గాథలన్ |
| 15 | 86 | మరువఁడు | మఱువఁడు |
| ,, | 87 | మరువఁ | మఱువఁ |
| 20 | 106 | రాజువై | రాజవై |
| 22 | 119 | జేసెద పుష్పకంబ | జేసెదఁ బుష్పకంబ |
| 23 | 124 | మిధునంబు | మిథునంబు |
| ,, | ,, | జతనూగు | జతనూఁగు |
| ,, | ,, | గననోచి | గననోఁచి |
| 24 | 126 | మిధునము | మిథునము |
| 25 | 134 | అసమానుడు | అసమానుఁడు |
| 26 | 142 | నూచియూచి | నూఁచియూఁచి |
| 29 | 16 | దలయూచు | దలయూఁచు |
| 37 | 62 | దాటు | దాఁటు |
| 39 | 74 | నన్ను గాంతార | నన్నుఁ గాంతార |
| 43 | 96 | జెలగ | జెలఁగ |
| 44 | 102 | జనింపగ | జనింపఁగ |
| 48 | 127 | శపధము | శపథము |
| 49 | 131 | నశ్రువులుఁగార్చు | నశ్రువులుఁగార్చు |
| 58 | 158 | మార్పగా | మార్పఁగా |
| 54 | 167 | నోచియుంటినా ? | నోఁచియుంటినా! |
| 57 | 6 | శాంతిమైపలికి | శాంతి మైఁబలికి |
| 61 | 33 | దాటి | దాఁటి |
| 63 | 42 | నొప్పు దాల్చి | నొప్పుఁదాల్చి |
| ,, | 45 | సుదాసుఁగాధ | సుదాసుగాథ |
| 68 | 78 | శుశ్లోకంబు | సుశ్లోకంబు |
| ,, | ,, | సత్కథనుఁబృథ్వి | సత్కథనుబృథ్వి |
| 76 | 132 | పాహిగన్మయా ! | పాహిజగన్మయా ! |
| ,, | 133 | అనిన సేయసాగి | అనినుతి సేయసాగి |
| 82 | 22 | నూగులాడుచున్ | నూఁగులాడుచున్ |

| పేజీ | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 83 | 27 | కానననెమ | కాననసీమ |
| 88 | 56 | రాఘుడున్ | రాఘుఁడున్ |
| ,, | 58 | రాఘుప్రుడు | రాఘవ్రుఁడు |
| 89 | 63 | యధార్థమిద్ది | యథార్థమిద్ది |
| 96 | 104 | చేరగ | చేరఁగ |
| 100 | 123 | గ్రోధతప్తుడై | గ్రోధతప్తుఁడై |
| 102 | 135 | భవదీయగాధ | భవదీయగాథ |
| 105 | 151 | నోచిన | నోఁచిన |
| ,, | ,, | దాచి | గాఁచి |
| ,, | ,, | యధావిధ | యథావిధి |
| 106 | 4 | నోచినట్లుగ | నోఁచినట్లుగ |
| 108 | 6 | దోగు | దోఁగు |
| 109 | 22 | రాముడజస్ర | రాముఁడజస్ర |
| 112 | 37 | ద్రుటినూచి | ద్రుటినాఁచి |
| 115 | 59 | రాజ్యలిల | రాజ్యలీల |
| 116 | 65 | జెలునె | జెల్లునె |
| 117 | 70 | మెంచకెట్టువడదో ? | మెంచఁగట్టువడదో? |
| 119 | 79 | నుడివె పార్థివుండు | నుడివెఁబార్థివుండు |
| 127 | 131 | నోచిన | నోఁచిన |